శ్రీరాములు.

# ఉపోద్ఘాతము

సీ॥ జానకీదేవి మాజనని సద్గుణవతి జనకుండు శ్రీకృష్ణశాస్త్రి మాకు। బోడెపువంశాబ్ధిపూర్ణ చంద్రుడవరవీరరాఘవశాస్త్రి పిరాజనుతుడ। నాయనుజన్ముండు నరసింహాశాస్త్రియు వ్యాపారదక్షుండ వరగుణుండు। జనకసంస్థాపిత చంద్రగిరిస్థ శ్రీవేణుగోపాలక వివిధధర్మ। కర్తృత్వనిష్టుండ కాస్యపగోత్రుండ నగ్రహారయుతుండ నఖిలవిదుడ। ముద్రింపబడి యనుముద ముసమాచేత సకలకవీంద్రులు సంతసింప। జనకనిర్మిత నందనందనచరిత్ర। యక్షగానప్రబంధంబు నఖిలబుధులు। దోషమెంచక గుణముల తుష్టిజెంది। సత్కరింపంగ ప్రార్థింతు సంతసమున॥

ఈగ్రంథము నైజాంయిలాకా వరంగల్ జిల్లా మధిరతాలూకా చనుగొండనివాసస్థులగు బోడెం కృష్ణశాస్త్రికవిగారిచే రచియింపబడిన యీ నందనందనచరిత్రము యీకవిగారికి సోదరులు అయిదుగురు వారినామములు వెంకటేశ్వర్లు, లక్ష్మీకాంతశాస్త్రి, రామయ్య, సూర్యనారాయణ గానకళావిశారదులు. పుత్రులు యిరువురు. అందగ్రజుడు వీరరాఘవశాస్త్రి, ద్వితీయుడు నరసింహాశాస్త్రి. వీరు తన తండ్రిగారిచేత సృష్టింపబడిన కృష్ణాపురమనే అగ్రహారమునందు నివసింపబడి చంద్రగిరియందు తండ్రిగారిచే నిర్మింపబడిన శ్రీ వేణుగోపాలస్వామివారి కయింకర్యనిరతులై సదా సజ్జనానుగ్రహపాత్రులై యీగ్రంథమును అచ్చువేయించుచున్నారు. ఈగ్రంథము సంగీతసాహిత్యవిద్యాపారంగతులకు ముఖ్యావలంబమైనది కావున సమస్తజనులు యీగ్రంథమును గుణదోషముల నెంచక ఆదరించవలయునని ప్రార్థించుచున్నాము.



రామచంద్రాయనమః.

శారదాంబాయైనమః.

హయగ్రీవాయనమః.

# నందనందనచరిత్రము.

శ్లో॥ శ్రీభద్రగిరిసౌధాగ్రచారిణం రఘునాయకం
సీతాలక్ష్మణసంయుక్తం ధ్యాయేభీష్టప్రసిద్ధయే॥

శ్లో॥ రాధికాకుచకుంభాగ్ర కుంకుమాంకితవక్షసం
రుక్మిణీహృదయాబ్జార్కం శ్రీకృష్ణం భావయేసదా॥

శ్లో॥ శ్రీనందనందనచరిత్రమిదం సుగద్యం
పద్యంచకర్తు మిహవాంఛతిధీస్తథామె

శ్లో॥ శ్రీరామచంద్ర మమచేతసివాచినిత్యం
స్థిత్వా సుశబ్దరచనాంకురు పూర్ణతాంచ॥

గద్య॥ అథై దానీం శ్రీ నందనందనచరణారవింద వందనాభిలాష సకల విద్వజ్జనమనీషావివర్ధినీ । నిఖిలనిగమకల్ప నగాగ్రస్థ శుకముఖ శకలీకృత మోక్షఫలామృతదాయినీ । భగవత్కథానువర్ణ నాకర్ణన పఠనజన మనశ్శ్రవణ భక్తానంద పటుత్వ సంధాయినీ । రమ్యా శ్రీమహాభాగవతపురాణాంతర్గత దశమస్కంధసంబంధ నందనందనకథామయా ప్రస్తూయతే । అస్మిన్ కథాప్రసంగే శ్రోతావక్తాచ శ్రీరామచంద్రోస్తు॥

అనేన రఘువంశాబ్ధిపూర్ణ చంద్రః కృపానిధిః । ప్రియతాం జానకీజాని రస్మాకం కులదైవతం॥

## మధ్యమావతిరాగము—అటతాళము.

వందేహం శ్రీరఘురామచంద్రం। యిందుశేఖర మునిబృందార కేంద్రం॥ వందే॥

యిందీవరనిభ సుందారగాత్రం । యిందువదన మరవిందాభ నేత్రం॥ వందే॥

వామాంకసంస్థిత వసుమతితనయం । సామీరిసేవిత సత్పాద కమలం॥ వందే॥

సరసలక్ష్మణ భరతశత్రుఘ్న సహితం । కరకంజధృతవర శర శరాసనం॥ వందే॥

ధర భద్రశైల సత్పురమందిరం । నర కృష్ణదాస హృద్వనజ సంస్థితం॥ వందే॥

సీ॥ వారిజాసన విష్ణువామదేవులకున్న వాణీరమాసతీ వనితలకును। మ్రొక్కి విఘ్నేశుని ముదముతోఁ గొల్చెద నంతరాయారణ్య హవ్య వహుని । అఖిలవిద్యలకెల్ల నాధారుఁడౌ హయగ్రీవుని పదకంజ సేవజేసి । పద్మమిత్రునిగొల్చి పరగసుదర్శనదేవుని నుతియింతు స్థిర మనమున । వ్యాస వాల్మీకమునులకు వందనంబు। జేసి శ్రీకాళిదాసాది శ్రేష్ఠకవుల । నభినుతించియు దిక్కన నన్నయార్య । వినుతి జేసెద మత్కావ్య వృద్ధికొరకు॥

ఉ॥ శ్రీయుత మైధిలీరమణ సిద్ధతటుత్తునరిప్రభీమమహా
జ్యాయతరావ గర్జితము హస్తగృహీతధనుః పులోమజా
నాయకు కార్ముకంబహిత నైరుత కీలిశమింపజేయు శ్రీ
నాయక మేఘమెల్లెడల నాకుమనోరధ సస్యమీగావుత॥

## మధ్యమావతి రాగం—అట.

వాణి నినుభజియింతు కల్యాణి । సతతంబు నాముఖవనజమున శుకవాణి॥

వాణి పద్మజురాణి పుస్తకపాణి ఘననిభ వేణి పల్లవపాణి దృష్టి జితైణి పృథుసుశ్రోణి వీణాక్వాణి మోదిని ॥వాణి॥

యిందు విలసత్పాండుర శరీరా । వదనాబ్జిత పూర్ణేందు బింబా తారసమహారా । హరిమధ్యరద జితకుంద కుట్మల కీర్తివిస్తారా । కరభోరుదరతుల కంధరీ యరవిందలోచనా । సరసిజమందిరా యిందిరా భక్తవందితామరచిత్త బృందానందదాయిని త్రిభువనైక సుందరీ వరకుందదామినీ ॥ వాణి ॥

రంగుగా లిఖయించునపుడు । పుస్తక భీతిచెలంగి బట్టివచించునపుడు । కవిత్వమను నుప్పొంగుచును రచియించునపుడు । సభయందు కావ్యప్రసంగములు నే జేయునపుడు ॥ వాణి ॥

కృష్ణాఖ్య పూజిత మంగళప్రదదేవి నా హృదయాంగణంబున నిల్చి మత్ప్రసంగములం జెలగంగ జేయుము రంగుగాను కురంగలోచన॥

యమునాకల్యాణిరాగం—ఆది.

శ్రీఆంజనేయుని మదిలో సేవించెద నేనూ ॥ శ్రీయాంజ ॥
శ్రోయజమిత్రుడు దోచుతరిని కెంజాయఫలంబని సరగునమ్రింగిన ॥శ్రీ॥
మిత్రపుత్రుతో మిత్రాన్వయమునకు మైత్రిమొనర్చియు మన్ననజెందిన॥
రంగుగ శ్రీరామాంగుళియ్య వరముంగొని జవి సీతాంగనకొసగిన ॥శ్రీ॥
లంకినిజంపియు లంకజొచ్చి నిశ్శంక నకుజూసి బింకమణంచిన ॥శ్రీఆం॥
సంజీవినిగొని మంజులముగ రఘుకుంజరులకు మదినింజలిదీర్చిన ॥శ్రీ॥
వరచంద్రగిరిని వసించియు కవివరు కృపాఖ్యుని వదలకబ్రోచిన ॥శ్రీఆం॥

సీ॥ శ్రీజానకీజాని సేవాత్తభవ్యమహా కాస్యపాన్వయమందు ఘనతకెక్కు బోళెముమవంశాబ్ధి పూర్ణేందుడౌ వీరరామయార్యుడు ప్రపితామహుడు । ఆవీరరాఘవార్యాగ్ర్యున కుదయించె విద్వన్నుతుండున్ చరణ । సేవారతుండయ్యు చెలువుప్పు కృష్ణాఖ్య దా మాంబసతికి । ముప్పురుకొడుకులు ముదమొంద ఖ్యుండు ఖ్యాతియశుడు ।

గీ॥ వైరి గజసింహమనదగు వీరరాఘ
వార్యుడును లక్ష్మినరశింహు లనగభువిని
సకలబుధజననుతులును సత్యయుతులు
విష్ణుసేవానిరతులును విమలమతులూ॥

గీ॥ అందు శ్రీవీరరాఘవులబ్ధి పూర్ణ
చంద్రక్రియబుట్టి కళల నిస్తంద్రుడయ్యొ
దానమున ఘనుడటంచును దమశమాది
సుగుణముల చేత గురుడని సుజనులనగా॥

క॥ శ్రీ విప్రుల కులాంబుధి
జైవాతృకుడైన రామజనకునకును త
ద్దేవియగు రాజమాంబకు
పావనియగు సీతమాంబ ప్రభవించె ధరణ్॥

గీ॥ సంపదను మృదువాక్కుల సతితనమున
నిందిరావాణి పార్వతు లీడుజూడ
ననుచు బుధులెల్ల నుతియింప నవనియందు
ఖ్యాతిజెందెను కరుణచే సీతమాంబా॥

గీ॥ అవని శ్రీవీరరాఘవు డందముగను
సీతవరియించు చందాన చెలువుమెరసి
ఆర్యుడగు వీరరాఘవు డందముగను
సీతమాంబను వరియించె ఖ్యాతిమీర॥

సీ॥ శ్రీ వీరరాఘవ సీతాంబలకు వరపుత్రు లేవురు బుధమిత్రులగుచు
జన్మించి రందగ్రజున్మందు కృష్ణాఖ్యుడను నేను రాములయందు మన
ము। నిల్పి సేవింపుచు నిర్మలమతినుండ శ్రీరామచంద్రుండు చెలువు
మీర। స్వేతాశ్వమున నెక్కి చెలగి స్వప్నంబున విచ్చేసిపల్కెను విను
ముకృష్ణ

కవి మహాభాగవతమందుగల దశమము
యక్షగాన ప్రబంధము నమరజేసి

నాకు కృతియిమ్ము గైకొందు నయమువీర
నీముఖంబున విననాకు ప్రేమగలదూ॥

క॥ అనియుట్లుబల్కి మేల్కని
మనమున ముదమంది యతని మంజులపద స
ద్వనజములు దలచుచుంటిని
వనజాక్షుడు మరుదినంబు వాలాయముగన్॥

క॥ శీకరముగ చంద్రగిరిని
ప్రాకటముగ భక్తవరుల పాలింపుచు న
స్తోకమనీషా విభవము
నా కొసగదలంచి పవననందనుడుండన్॥

మ॥ హనుమత్సన్నిధిజేరి నిల్చినపుడే నాసామికిన్ మ్రొక్కనం
గని చింతింపకు కృష్ణదాసయగు నీకావ్యంబునాస త్కృప
న్నిను మర్త్యకావ్యము సేయగాదగిన సద్విద్యన్మహామేధనీ
కొనగూర్చుం బవనాత్మజుంగొలువుమీ వుద్యన్మహాభక్తిచే॥

అని యట్లానతిచ్చినా

గీ॥ దాశరధిరెండుమారులు తానివచ్చి
స్వప్నమున నాకువరమిచ్చె సంతసమున
రామచంద్రుండు నాయంతరంగమునను
నిలచి తానురచించని నిశ్చయించి॥

సీ॥ శ్రీదామరాన్వయసింధుపూర్ణేందుండువరకళాశాలిసర్వజ్ఞవరాళి
సకలరాజేంద్ర సన్మకుటస్థరత్న నీరాజిత చరణసరోజయుగళు
డాశ్రితమందారుడబ్ధిగభీరుండు సూనాస్త్రశతకోటి సుందరుండు
శారదనీహార శరదిందునిభయశుం డాదిత్యవత్ప్రతాపాన్వితుండు

రాజరాజాధిరాజ సద్రాజతేజ
రాజకంఠీరవసవానురాజవిభవ
రాజదామర వెంకటరామయాఖ్య
రావనగ ధాత్రినుతికెక్కు రాజవరుడు॥

క॥ ఆరాజేంద్రుండేలును
శ్రీరాముల కరుణచేత స్థిరచంద్రగిరిం
ధారిణి హాసనాబాదయు
చారుతరంబైనయట్టి శంకరగిరియుᳲ॥

చ॥ ధరణిని దామరాన్వయ సుధాకరు వెంకటరామయాశ్వరా
ద్వరముఖపద్మమందు చెలువంబుగనాడెడు వాణిగాంచ నిం
దిరజనుదెంచి గట్టువడెదివ్యగుణావళినంచు కీర్తియా
కరణినన్నుగట్టునని కంధులుదాటి భ్రమించునేటికిᳲ॥

ఉ॥ దీనులబ్రోవదుష్టులను దీనులజేయగ నశ్వరాయుడే
బూనెధరాతలంబితడుపోషణచేయగజాలునిందు కే
బూనపనేమిలేదనుచు పొందుగచంద్రగిరిన్వశించియా
మానవనాధుచేత నిడె మంజులముద్రిక రాముడాప్తతᳲ॥

గీ॥ ధరణివెంకటరామభూధవుడు రాఘు
వునికరణి లక్ష్మినరసమాంబను వరించె
ధర్మభంగంబు సేయకతననువిశ్వ
మిత్రులెల్లను గొలువను మెచ్చద్విజులూ॥

సీ॥ భూదేవిమెచ్చి పాలైనక్షమను సద్గతిచేనపంకయుకాంతయును
చు। శ్రీకాంతముదమున శిరులిచ్చెపతితోడ సహధర్మచారి నిశ్చల
యటంచు। భారతిమృదువైనపల్కులొసంగెను పతికన్నమున్న
దాబల్కదనుచు। మంగళంబులు సర్వమంగళ రొమనగూర్చె నాది
ᳲగాదటంచు।
నవనినిష్కల్మషుడు రాజునమరదాత
యుభయపక్షంబుల సమానుడభయుడైన
రాజదామర వెంకటరామనృపతి
కాంతయును లక్ష్మినరసమ్మగారికిలనూ॥

క॥ ఆవెంకటరామాశ్వా
రావునకును నరసమాంబరమణీమణికిం

శ్రీవెలయ ముగురుకొడుకులు
శ్రీవ ధరణిబుట్టిరొక్క పుత్రికగలిగె॥

సీ॥ శ్రీకరంబుగ సుధాసింధుజయగు శిరినెంచి శ్రీహరివరియించు కరణి
జనకరాజన్య సంజాతయౌ సీతను సంప్రీతిగాను రామచంద్రుకరణి
శ్రీకృష్ణదేవుని చెలియలైన సుభద్ర నలరిపార్థుఁడు పెండ్లియాడుకరణి
ధరభీమరాజేంద్ర తనయను దమయంతి నిలనలరాజు వరించుకరణి
రాజు దామర వెంకటరామ నృపతి
పుత్రికారత్నమును కళాపూర్ణుఁడైన
రాజ శ్రీ వెంకటాద్ర్యప్పరాయ చంద్రు
డలరి వరియించె బుధులిల నభినుతింప॥

గీ॥ భద్రగిరిధాముడగు రామభద్రుకృపను
పుత్రపౌత్రాభివృద్ధియై పొందుగాను
హరియు శిరిబోలి దంపతులవని సకల
సంపదలజెందియుండిరి జగతియందు॥

సీ॥ ఆ ముగ్వురాత్మజులందు సీతారామ భూపాలుడాశ్రిత పోషకుండు
విద్యాంభోజుండు విభవదేవేంద్రుండు కందర్పశతకోటిసుందరుండు
ఆదిత్యనిభ తేజుఁ డబ్జారి సమయశుం డవనీశబృందార్చితాంఘ్రియు
గుడు । కల్పకబలి కర్ణకలశార్ణవ సమాన వితరణశాలియు వీర
మౌళి ।
యేకచక్రంబుగా నెవ్వరెదురులేక
రాజ్యమేలుచునుండగా రహస్యముగను
విని నవాబుసాహెబావార్త విశదముగను
సైన్యమంపెను తాలూక జప్తుసేయ॥

ఉ. వచ్చిన సేనగాంచి నృపవల్లభుఁ డాత్మనలంగి సేనతో
నచ్చట జేరి ఖడ్గమున నాగ్రహమొప్పగ భానులందరి
న్వచ్చి హయాదులం దునిమి వారణపంక్తుల బాహుటీటలం

గ్రుచ్చినసేనమహారునకు గొబ్బునసేగ ఖుదానుదట్బుచుర్
వ॥ తదనంతరంబ.

సీ॥ మహారుకేతెంచియు సన్నైగ్రతి యూర్కాటు రామానుజయ్యతో
తాము జేసి । సాలారుజంగ్నవాబుసాహెబుదర్శించి నజరివ్వగైకొన
నుజరులేక । రాజాసవాసీత రామాశ్వరావు కెంఫిరుపడె సర్కారు
బిగరీయలేల । నాపురాజాబినేయన భాదావందాఖ్యు హుకుం
శిరిపరిరభిఅబురునకరె । అన్నసవాల్ జవాబతుల సౌందర్యగాంభీ
ర్యశౌర్యాదులు కరుణదోప ।
జేసినను బిల్మ ఖ్తగాగ్రాసినసనదు
శహాలుకండియుశిర్ పెంచుసభనొసంగి
యతడుదానివ్వగైకొని యపుడుసనదు
గొనియు భద్రాద్రికేతెంచె కోర్కెమీరా॥

గీ॥ అట్టి సీతారామయూశ్వరాయులమాత
లక్ష్మనరసమాంబరమ్యముగను
ధరణి వెంకటేశుదర్శింప నన్నమ
రెడ్డిపల్లెజేరి ప్రేమమీరా॥

క॥ వరహాలిడి కానుకగా
పురమొక్కటి యగ్రహారముగ నిచ్చియుభూ
సురులకు వైష్ణవవరులకు
వరభోజనమిడుచు నచట వసియించుతరిన్॥

గీ॥ వేంకటేశుండు మాకిలవేల్పుగాన
స్వప్నమిటులాయనాసామిశెలవుజెంద
వలయుననియెంగి సామికి వందనంబు
జేసి యటనుండ బహుకృపజేసి యపుడు॥

క॥ కోదండకాండధరుడై
వేదండము నెక్కి వచ్చి వెంకటనాథుం

డాదండికార్యమిదినా
కె దండక మొకటిజేసి యదిజేయుమనఁ॥

సీ॥ శ్రీకరుం డాబాల్యస్నేహితుం డన్న సముద్రాన్వయాంబోధి రాకా బ్జవైరి। మహిజగన్నాథసన్మంత్రి పౌత్రుడువర వెంకటరాయ మం త్రీంద్రసుతుడు। సకలకళాశాలి సంగీతసాహిత్యలోలుండు సజ్జన పాలకుండు। ధరణిన శ్వారాయతరతరంబున తమవంశాప్తమంత్రిత్వ వైభవుడు

శ్రీజగన్నాథమంత్రియారాజసభను
నన్నుగని మ్రొక్కి క్షేమము నరసియొందు
కిందువిచ్చేసిరటన్న డెందమలరి
స్వప్నవృత్తాంబు నేజెప్పసంతసించి॥

గీ॥ కృష్ణకవివర్య మీపురాకృతశుభమున
రామచంద్రుడుగోరె మీ రమ్యకృతిని
గాన కృతిజేసి సత్కీర్తిగాంతువనుచు
మంత్రివరుడని రాణితో మనవిజేయ॥

గీ॥ మాసమస్తానమందు సన్మాన్యులగుచు
ఖ్యాతిజెందిరి మీతండ్రి తాతలనఘ
ధరణి శ్రీ భద్రశైలాంకితముగ కృతిని
జేయుమని రాణిబహుమతిజేసినపుడు.

సీ॥ శ్రీకరంబుగ సుధాసింధుజయగు శిరినెంచి శ్రీహరి వరియించుకరణి
జనకరాజన్య సంజాతయాసీతను సంప్రీతిగాను రామచంద్రుకరణి
శ్రీకృష్ణదేవుని చెలియలైన సుభద్ర నలరి కిరీటి పెండ్లాడుకరణి
ధరభీమరాజేంద్ర తనయను దమయంతి నిల నలరాజు వరించుకరణి

రాజ దామర వెంకటరామనృపతి
పుత్రికారత్నమును కళాపూర్ణుడైన

రాజశ్రీ వెంకటాద్ర్యప్పరాయ చంద్రు
డలరి వరియించె బుధులిల నభినుతింప॥

గీ॥ యిందిరావాణి పార్వతులీడుజూడ
సంపదను మృదువాక్కుల సతితనమున
ననుచు బుధులెల్లనుతియింప నవనియందు
ఖ్యాతిజెందెను కరుణచే సీతమాంబా॥

సీ॥ భూకాంతసాటి యీపూబోఁణికనవచ్చు పాంసులగాక నిష్పంకయైన
శ్రీకాంతసాటి యీచేడియకనవచ్చు భార్గవియనుపేర బరగకున్న
పార్వతీడగును యీపద్మాక్షికనవచ్చు చెండికాఖ్య వహించియుండ
కున్న । శారదసరియ యీనీరదచికురకు కులహీనులను జెంద దల
పకున్న ।

ననుచు బుధులెల్ల వారల నపహసింప
శుచిని పతిభక్తి సంపద శీలములను
రాజశ్రీ వెంకటాద్ర్యప్పరాయ చంద్రు
నాతి సీతాంబ ధరబ్రఖ్యాతికెక్కె॥

శా॥ శ్రీలం శ్రీలలనాకుమార్ కుమల సత్సీతాఖ్యచే సీత స
ద్దేలం నీలసతీ సతీతనమునన్ ప్రీజెందరేవారు ని
న్నోలంజాలుదురే యటంచు బుధులీ భూలోకమందెన్న భూ
పాల స్త్రీలు స్మితాస్యలై దలుతురిప్పద్మాక్షి నేవేళలన్॥

సీ॥ అవని శ్రీ వెంకటాద్ర్యప్పరాయేంద్రుచే సీతమాంబికయందు శ్రీక
రుండు । రాజ శ్రీపార్థసారథి యప్పరాజేంద్రుడుదయించె క్షీరాబ్ధి
నోషధీశు । భాతి కౌసల్యకు భద్రుడౌ శ్రీరామచంద్రుని క్రియభవ
సతికి గుహుని । కరణి దేవకీయందు కల్యాణగుణుడైన శ్రీకృష్ణుభం
గిని చెలువుమెరశి ।

శైశవంబున సకలశాస్త్రములు జదివె
పారసీ యింగ్లీషుల పఠనజేసె

హయగజారోహణాదుల నభ్యసించె
సకలశాస్త్రాస్త్రముల పార్థు సమతగాంచె॥

సీ॥ శ్రీయప్పరాయ సుస్థిరవంశ కలశాబ్ధిచంద్రుండు భోగదేవేంద్రుడ
ఖిల। రాజేంద్రకోటీర రాజన్మణి ప్రభాజాలరంజిత పాదజలజయు
గుడు। తారహీరపటీర పారదకుందేందు శారదనీహారసదృశయశు
డు। కల్పకబలకర్ణ కలశార్ణవసమాన వితరణశాలియు వీరమాళి

రాజ దినరాజ సురరాజ రాజరాజ
సదృశకీర్తి ప్రతాప విస్తార భోగ
ధనుడు కందర్పనిభరూపధరుడు పార్థ
సారధను యప్పరాజేంద్ర చక్రవర్తి॥

సీ॥ పరిహాసమందైన పలుకడసత్యంబు కలనైనపరకాంత గలయగోర
డరులయందైన దోషారోపణముసేయ డర్థుల లఘుతగా నరయడె
పుడు। స్మితముఖుండై ప్రజాతతిపాలనముసేయు ప్రేమచేభృత్యుల
బెంచుచుండు। ఆర్యులగని మహాహ్లాదంబునొందును కుజనులగని
మదికోపమందు।

అవనిసద్గుణ సంఘంబులరసి సకల
పార్థివేంద్రుల జెందగా పాటిలేమి
పార్థసారథి యప్పరాట్పార్థివేంద్రు
జేరి స్థిరముగనుండెను చెలువుమీరా॥

ఉ॥ వదనమునందు వాణి ముఖపద్మమునందున లక్ష్మి యిద్దరు
న్వాదలని వైరులైన తనవల్లభతర్క బ్రియమందజేసి భూ
మదవతినంసపీఠమున మానకదాలిచి నిస్సపత్నుడై
సదయత పార్థసారథి రసాధిపుడేలును చిత్రమొంచగన్॥

గీ॥ పార్థ సారథియప్పరాట్పార్థివేంద్రు
డశ్వరాయులకుల మంతనంతరింప
తనకు మాతామహంబైన ధరణినేల
దలచి మహరునకేగెను ధైర్యమలరా॥

సీ॥ షహరునకేగి తానచ్చైన్యాత్రి శివరాజబహాదరుతోఁ జేశి భద్రముగను
రాజనరేంద్రసద్రాజాబహద్దరు దర్శనమొనరించి దయనుగాంచి
సరవినుజాగర్థుచందువారినిగాంచి వారియనుగ్రహాధారియగుచు
మొఱతెమిదుసాహెబు ముష్తాకుహుశ్శేనుదయబొంది మిక్కిలిధైర్య
మొంది.

పరగమహింబూబుదౌలసద్బాదుషాల
గారి కర్థాధికారి బషీరుదౌల
ఖాసునవాబుసాహెబు గారికరజు
విన్నపమువ్రాసి పంపిన విశ్వసించి॥

ఉ॥ అయిదుశతంబు లశ్వములు నైదుపదుల్ మదవారణంబులన్
నైదుశతంబు లశ్వలను నైదుఫిరంగుల నైదువంటెలన్
నైదు శితధ్వజంబులను నైదువిధంబుల వాద్యభేదముల్
మోదముతోడబంప నృపముఖ్యుడు సంతసమందియంతటన్॥

సీ॥ హేమాంబరముగట్టి నీమజారుదొడంగి పరగమునసబుదారిపాగజుట్టి
శిరిపెంచుతురాయి శిరమునందునబెట్టి కరమునందునపేషుకబ్జుబట్టి
పదపద్మములయందు పైజార్లుదొడగియు నీలైనశహ ల్వాలెవాటువేసి
నడికట్టుపట్టినినాణెంబుగాబెట్టి చేతజరీరుమాల్ చెలగిబట్టి

భానుడుదయాద్రిజెందినభంగి కుముద
భాంధవుడునీలగిరిజెందుపగిదిసమద
వారణము నెక్కి ప్రభుజూచువాంఛమించి
పార్థసారధియప్పరాట్ప్రభువు వెడలె॥

సీ॥ తురగఖురాఘాతధూళిచ్ఛటల్ మింట్రబ్రాక సూర్యాశ్వముల్ భ్రాం
తిజెందె। మదగజఘీంకారమహనీయరావంబు లాశాగజంబులజేసె
భీతి। తాషామరఫఢంక తమ్మటనాగార భేరీధ్వనుల్ మింటపిక్కటిల్లె
సుభటకోలాహలస్ఫుటనినాదంబులు పర్వతగుహాలన్ని బగిలజెదర

చోపుదార్లునకీబులు చుట్టునిలిచి
రాజరాజాధిరాజసద్రాజతేజ

రాజకంఠీరవాయశ్వరాయవిభవ
రాజసవ్వాయిశ్రీయప్పరాయ బహాద
రనుచు గొనియాడ పురవీధినరిగెనృపుడు॥

గీ॥ కామినీ జనమంతయు కాముడనుచు
నర్థిసందోహమంత సురాగమనుచు
పార్థివజనంబు శరధాటిపార్థుడనుచు
బాగడ పురవీధి నరిగెను భూవరుండు॥

క॥ మసిదాటి డిల్లి ద్వారం
బసదృశముగ జొచ్చి పరాజునావలగనియా
దెసనున్న చార్మినారను
వసుధేశుడుగాంచిదాని వలగొనిజనియెఁ॥

వ॥ అంత నారాజపురందరుండు పురందరమందిరంబునం బోలిన రాజమందిరంబు ముందర బృందారకేంద్రుడు గజేంద్రంబుడిగిన భంగి నిజగజాతరణంబు జేశి గజ తురగ స్యందన పదాతి వర్గదుర్గమంబైన ప్రథమప్రాకారంబు దాటి వాపీకూపతటాకోద్యానవన పరాజితంబును దాసదాసీజన నివాసంబైన ద్వితీయావరణంబు గడిచి శాతకుంభస్తంభ విజృంభితంబును నానావర్ణ దుకూలాచ్ఛాద నాస్తరణశోభితంబగు రత్నసింహాసనంబున శ్రీమన్నారాయణుని కరణికొలువున్న యన్నవాబుహుజూరుపుర్నూర్ మహిబూబుఖాలాబాదుషాగారి దర్శనంబొనర్చి నిటలతటఘటిత కరకమలుండైయున్న యన్నరపాలుని నిజకటాక్షలక్ష్మీ ప్రసాదంబున రాజ్యలక్ష్మీ పదస్థునింజేసికన్ను సన్నల శెలవొసంగిన దీవాన్ నవ్వాబు బషీరుద్దవులా బహద్దరుగారిదర్బారుకరగి తనరాక నెరిఁగించిన సంతసించి మించినప్రేమరావించి నజరిచ్చిన నుజరులేక నంగీకరించి బహూకరించి మంచి గద్దియంగూర్చుండనియమించి యిట్లనియె॥

క॥ ఆవుజీ ఓ రావుసాహెబు
దేవుజీ పీశేఖరజు దిల్సేఖుషుహా

జాపుజీ ములక్ దియాగయా
జాపుజీ యనిరుక్సతివ్వ జనె విభుడంతఁ॥

సీ॥ రాజానవాయశ్వరాయా కితాబిచ్చి యప్ప గాయ కితాబుకలరిమెచ్చి
పాల్వంచములకు కుపర్వానిగీనిచ్చి రూబ్ కార్ పతాకురూఢినిచ్చి
శిరుపేంచుకంఠని చెలువయిన దుప్ప్యాలకచిహేరి ఖిల్వతుకలిమినిచ్చి
అథరుదార్పానఁ దాను నలుచునిచ్చియు లోలుడై బహుమెచ్చి
గుక్సతిచ్చి
యనుకు శలవ్రొంది ధనతతినర్థికోటి
కొసగుచును రాజవీధి రానొప్పె నింద్రు
సభకు జనివచ్చు మాంధాతసరణి రాజ
పార్థసారధి యప్పరాట్ప్రార్థివుండు॥

క॥ నిజపురికిజనియె నప్పుడు
నిజమిత్రామాత్య భృత్యనివహముగొలువఁ
విజయ ముహూర్తముసందున
విజయుడు దిగ్విజయమొంది విచ్చేయుక్రియఁ॥

తదనంతరంబ॥

సీ॥ శ్రీభద్రగిరికేగి శ్రీరవివంశాబ్ధిచంద్రుడౌ శ్రీరామచంద్రు పాద
జలజంబులకుమ్రొక్కి జానకీసౌమిత్రి పదపద్మముల కతిభక్తిమ్రొక్కి
పూజించి సంపూర్ణ భోగంబుజేయించి గరుడసేవయొనర్చి కానుక
లిచ్చి।ముత్యాలహారంబుముదమునసర్పించికర్పూరహారతి ఘనతనిచ్చి
పుత్రమిత్రకళత్రసన్మాతృసహితు
డగుచు సాష్టాంగదండంబులాచరించి
స్వామిశఠగోప తీర్థప్రసాదములను
సాదరంబునగొని కీర్తిసాంద్రుడలరె॥

## ష ష్ఠ్యం త ము లు.

క॥ శ్రీమద్రఘువంశాంబుధి
సోమునకును విభవవిజితసుత్రామునకుం

శ్యామాభిరామునకువర
సామీరిప్రణుతపాదజలజయుగునకున్॥ ౧

వారిదసమగాత్రునకును
సారసదళనిభవిశాలసంనేత్రునకున్
సూరిజనస్తోత్రునకును
శారదకుందేందు సదృశసాంద్రయశునకున్ ౨

ఖండేందుమౌళిచాపవి
ఖండనునకు మౌనిహృదయకంజస్థునకుం
భండనవిజితాసురద్వి
ట్కాండునకుం ధృతసుచాపకాండధరునకున్॥ ౩

ఇందునిభవదనునకు శ్రిత
బృందావనునకును రాజబృందనుతున కా
నందమయునకును రాజపు
రందరమకుటస్థరత్నరమ్యపదునకున్ ౪

శ్రీశునకుభద్రశైలని
వాసునకు ధరాతనూజ వరహృత్కంజో
ల్లాసునకు హాసముఖునకు
భాసురశ్రీకృష్ణదాసపరిపాలునకున్॥

అంకితంబుగా నాయొనర్పంబూనిన నందనందన చరిత్రంబను యక్షగాన ప్రబంధంబునకు కథాక్రమంబెట్టిదనిన ॥

శ్రీరామాయనమః

క థా ప్రా రం భ ము.

క॥ శ్రీమద్ధరాత్మజాధిప
సామీరినుతాంఘ్రికమలసద్గుణశీలా
కామరిపుచాపఖండన
ధామీకరచేల రామచంద్రనృపాలా॥

గీ॥ అవతరింపుము శౌనకాద్యఖిలమునిస
మూహమెల్లను గూర్చుండి ముదముతోడ
కృష్ణునవతారకథమాకు కృపదలిర్ప
జెప్పుమని సూతునడిగిన చెలువుమీర॥

ద్విపద॥ అనియిట్లు మునివరులడిగిన జూచి
వినయంబుతో బల్కె వేడ్కసూతుండు
బ్రహ్మతత్పరులార భగవత్కథాలు
బ్రహ్మకునైనన నాఫణిపతికైన
వర్ణింపశక్యమే వసుధలోమున్ను
కర్ణపియూషంబుగాను నేనొక్క
కథవింటి నక్కథఘనులార మోక్ష
పథమగు జెప్పెద పరగగావినుడీ॥

సీ॥ శ్రీకరంబైనట్టి శీతాంశుకులమున నరుడర్జునుండను నామమునను
జన్మించెవిష్ణుండు జగతీభరముబాపయదువంశమునబుట్టెనదయుఁడైన
కంసాదులవధించె కౌరవానీకంబు సమయించిరిద్దరు సమరమునను
ఘనులారపార్థుని తనయుడు నభిమన్యుడాతని కుదయించియాదిదేవు
చక్రమున రక్షితుడునాట చక్రధరుని
చిత్తమున నిలుపుటను పరిక్షిత్తటంచు
జనములభినుతిశేయగాజనవిభుండు
కరిపురంబున నివసించె కలిమిమీర॥

వ॥ అంతనొక్కనాడుపరీక్షిన్నరేంద్రుండుమునిశాపనిమిత్తంబైన తక్షకవిషాగ్నిచే సప్తమదినంబున తనకుదేహాంతరంబు నిశ్చయంబని తెలసి సర్వంబువిసర్జించి గంగానదీప్రాంతంబున ప్రాయోపవిష్టుండై యున్నయెడ నతనిపురాకృత పుణ్యంబున వ్యాసపుత్రుండైన శుక యోగీంద్రుం డచ్చటికి విచ్చేసిన నర్ఘ్యపాద్యంబులిచ్చి పూజించి మహాత్మామీరుభగవత్సమానులుగావున భవసాగరనిమజ్జనుండనగు నన్ను మజ్జనుండని కరుణించి భగవత్కథనుపదేశించుమని యడిగిన భాగవ

తం బుపదేశించె నందు కృష్ణావతార కథాసుధారసంబు గ్రోలందలంచి పరిక్షిన్న రేంద్రుండు శుకయోగీంద్రునితో నిట్లనియె.

కాఫిరాగం—ఆట

శ్రీశుక వినుపింపు చెలువొప్పగామాకు శ్రీకృష్ణచరితాము విననోరెద శ్రీకృష్ణచరితాము॥

భాస్వరముగ పద్మభాంధవాబ్జులవంశేశులైన ధరణీశుల కథ వింటి। శ్రీశుక॥

శీలాముగలయదుసింహుల వంశములో నేలజన్మించె। యదు సింహుడు యెలీలవర్తించె। వాలాయముగ నేలీలాలు సల్పెనోబాల కృష్ణుడలకాలామునందున॥ శ్రీశుక॥

పాపములనుయెడబాపెటి హరికథలేపశుఘ్నునకైనా। తనివ య్యేనయెకృతఘ్నునకైనా। శ్రీపతిచరితాము చిత్తకర్ణానందమే ప్రొద్దువినువారి కిహపరములనిచ్చు॥ శ్రీశుక॥

దేవతలకునైన దేరిచూడగరాని దేవవ్రతాదుల। సేనాబ్ధినే తె ప్పపాపున లీలా। ధీవరఘాటిరోమావారలత్తరి భావములకు నొక్క బాలపదములీల॥ శ్రీశుక॥

మాయమ్మకుక్షిలో మహనియ్య గురుసుతమార్గాణ పీడబొంది। యున్నట్టియామందుని నన్నుజెందీ దాయాదులకు నస్మత్తాతవంశము నాకు నాభద్రదైశైలేశుడాత్త చక్రతనిల్పె॥ శ్రీశుక॥

గీ॥ లోకమందుజనులలోన తానుండియు
లోకజనముకుక్షిలోనగలిగి
జనులకిహపరములు జన్మమృత్యువులెవ్వ
డిచ్చునతని చరితమెల్లజెపుమా॥

సీ॥ యతిరాజరోహిణీసతికి రామదుబుట్టె ననియంటిరని యెట్టులయ్యె శ్రీశు। డనఘయా దేవకియందేలజన్మించె మహినేల నాయోగ

మాయబుట్టి। వసుదేవునిలు బాసి వ్రజమున కేరీతి హరిజనె నెవనింట నధివసించె। కంసు నేటికిజంపె కాస్యపిమనుజుడై వర్తించె నెన్నాళ్లు వైభవమున॥

భార్యలెందరైరి ప్రౌఢిగాజగతినే
పనులు జేసినంత బాగుమీర
విష్ణుచరితమెల్ల వినగోరియడిగితి
విప్రవర్య దెల్పు విశదముగను॥

ద్వి॥ అనిపల్క భూమీశు డామునితోడ
ఘనముగ నిట్లనె కరుణామయాత్మ
నీముఖాంబుజమున నిర్ముక్తకృష్ణ
నామామృతముగ్రోల నావంతిమాన
కాయముప్పొంగె నాకలిదప్పిమాన
మాయధీశునికథ మనమురంజిల్లె
ననిపల్కుచున్నట్టి జనపతిపల్కు
వినిపల్కె శుకయోగి విశదంబుగాను॥

క॥ మాధవుని చరిత మెప్పుడు
భూధవ పఠియించివినియు బుధవర్యులచే
బోధించు పరులకెవ్వడు
మాధవ భక్తాళిచేత మాన్యులువారల్॥

అని మరియు శుకుండిట్లనియె॥

కల్యాణిరాగం—అటతాళం.

రాజాశేఖరవినుమా। యీచరితాము రంజిల్లు నీచిత్తమూ॥ రాజాచిహ్నలచేత రక్కసులిలయేల తేజాముజెడిభూదేవి పద్మజుజేరి। యీజగంబునుమోయజాల సరోజభవయనిపల్కి కన్నులలో జలంబులుదొరుగ కరుణాలోలుడై విధిబలికెనప్పుడు॥ రాజ॥

మాయమ్మవినవమ్మా। నీవంతాలు మానూనుగనవమ్మా। కాయాజజనకూడు కడతేర్చువని యాదితేయులతోడూత దివినుంచి

జనుదెంచి । తోయజాక్షు నమేయగుణు సత్ స్తోత్రములతో నుతియొన ర్చియు వాయుపథమున నొక్కశబ్దము పద్మజుడువినిబల్కె సురలతో॥ రా॥

వినుడు దేవతలారా । శ్రీదయితూడు వినిపించె దయమీరా । ఘనులుబుట్టెడు ధరణికరమొప్ప యదువంశమున కృష్ణాఖ్యను నేను ముదమొందనుదయింతు । మునిజనంబులనైన క్షణమునమోహ పెట్టగ జాలు మాయయు ఘనముగా భద్రాద్రినిలయుని కరుణచే జన్మించునని యును॥ రాజ॥

ద్వి॥ అనియిట్లు పద్మజు డావేల్పులాను
జనుమనిబల్కి భూజలజాక్షునూర
డించి తానున్నట్టి టెంకికి నేగె
నంచితంబై నట్టి యదువంశమునను
సూరసేనుండను శుభచరిత్రుండు
శూరుడై మధురయు సూరసేనంబు
లనుదేశములకు తా నధిపుడై యేలె
మనుజేశ ధరను యే మధురాపురంబు
నారాయణున కాదినాటపట్టయ్యె
నారాజధానియా యధిపులకెల్ల
శ్రీకరుండగు సూరసేనునిపుత్రు
డేకవీరుడు వసుదేవుడాపురిని
దేవకి పెండ్లియై తేరెక్కి రాగ
భావయా కంసుండు భయభక్తి మీర
రథముదోలుచునుండె రమ్యంబుగాను
రథనేమిరవమును రమ్యమైనట్టి
భేరీమృదంగాది భూరిరావంబు
పూరితాశాంతమై పొల్పుమీరంగ
కూతువై వాహిక కుతుకయుక్తుండు
భూతలేంద్రుడు తన పుత్రికకపుడు॥

క॥ అరణంబులిచ్చె నాతడు
కరితురగరథాదికములు కాంచనముక్తా
భరణంబు లాత్మజాప్రియ
కరుడై దేవకుడు పుత్రికకు మోదమునన్॥

వ॥ అంత కంసుండు రథంబు గడుపుసమయంబున నాకాశవాణి యతని యుల్లంబు ఝల్లన పల్లవాధరీమతల్లి జయగు నీచెల్లెలి యష్టమ గర్భంబున తనయుండుజనియించి యెల్లలోకంబులందెల్ల తన చల్లని కీర్తిచంద్రిక లుల్లసిల్ల నెల్లవారలకు దుర్లభుండై మల్లంబున నీప్రాణంబులు కొల్లగొనగలవాడని బలికిన నులికిపడి తళుకుమీరు కరవాలంబు కరంబునం గీలించి చెల్లెలిం దెగవ్రేయ గమకించిన భయభ్రాంతుండై వసుదేవుండు డగ్గరియతని మధురాలాపామృతంబున నతని కోపానలంబు జల్లార్చి శాంతుంగాజూచి యిట్లనియె.

మధ్యమావతిరాగం—అటతాళము.

బావనీచెల్లెలిదిసుమ్మా। నీప్రాభవముగోరు మదినమ్మా। బావ నీచెల్లెలిది బహుమానమున కొతగు నీవనితగావ నీకిహపరంబులు గలుగు॥ బావ॥

పసులనిచ్చుటమేరగాకా। బహుకనకవసనంబులిచ్చుటాలేకా। అసమానగుణ ముగ్ధ పసిబాల వరశీల నినుమంత దయలేక కసిబూనుటిదియేల॥ బావ॥

అన్నతాటను దీని మిగులా। బాలమన్నించవలెగాక వగలా। మిన్నాదుమాటలే మేలనితలచి యీపన్నురాలగు దీని చిన్నబుచ్చగనేల॥ బావ॥

మాను క్రోము కొ్కదనీకు బావా। నన్ను మన్నించనికొతగుగావా। కానుకలువైడూర్యకట్నంబులిచ్చిన ట్టీవనితనిచ్చిన నహిమభానుసమతేజ॥ భావ॥

దోసమనియెంచునీమదినీ। మిగుల వాసిరాదిట్టి చెడుపనినీ। శ్రీశుడౌ భద్రనగరీశుడేటికినిట్టి దోసకారుల గర్భవాసమందునబుట్టు॥

వ॥ అని మరియు బావా యెల్ల దేహంబులకు మృత్యువుతోడ నుద్భవిల్లు నల్లి నేడు శతవత్సరంబులకునైన దేహాంతరంబు నిశ్చయంబు దేహాంతరంబు నొందిన పురుషుండు పూర్వకర్మానుగుణంబైన శరీరం బుధరియించు తృణజలూకంబగ్రస్థిత తృణాధారియై పృష్ఠభాగస్థ తృణంబువీడుపగిది దేవా యన్యదేహాసక్తుండై పూర్వదేహంబు విడుచు దేహంబులెన్నియైనను కర్మంబులుజెడవు. పూర్వకర్మానుసారంబుగా మనంబు నింద్రియంబులు సంచరించు నుదకపూరిత కుంభంబులందు చంద్ర సూర్యులుగాలిచే గదలుచున్నట్లు దోచు నావిధంబున దేవా పూర్వకర్మనిర్మితంబయిన శరీరంబున రాగయుక్తుండై గదలుచుండు॥

గీ॥ కర్మముననను మేలుగలుగును కీడును
కర్మముననె గలుగు కమలజాది
సురలకైనవశమె శుభములనొందగ
పరులననగ కర్మపరుల కేలా॥

ఉ॥ కానక నెవ్వడేనియును కాపథ మొందియుదగ్రవృత్తితో
మానసమందు బూని బహుమంగళముల్గన గోరి యన్యులం
మానవనాథ గీడ్వరప మాకొనినంతనె పూర్వకర్మముల్
మానునెదు స్తరంబులవిమర్త్యనకుం బిదపం దొలంగునే॥
అని మరియు నిట్లనియె.

క॥ చెల్లెలిది వావిచే నీ
పల్లవలసదధర నీదు పాపమెనుమిమ్మా
యుల్లమున దయదలంచియు
చల్లగ రక్షించుమయ్య జనులు నుతింపక॥

ద్వి॥ అనియిట్లుబల్కిన నంతకంసుండు
వనజాక్షివిడువంగ వాంఛలేకపుడు
కనులనిప్పులురాల కళవళపడుచు
గనలుచునొకచేత ఖడ్గంబుదూసి
పడతికొప్పొకచేతబట్టి తచ్ఛిరము

వడిగద్రుంచగవాడు వాంఛ శేయంగ
నంతట వసుదేవుడాశ్చర్యమొంది
యింతదుర్మార్గుల కెంతచెప్పినను
పామునకిడినట్టి పాలానుచిత్ర
మేమాయనయిన నీ యేణాక్షిపిడుచు
పగిదివిచారింతు ప్రౌఢిగాననుచు.
వగజెందకను బుద్ధివంచన లేక
తగుకార్యమొనరింప దైవసహాయ
మగుననిబల్కుడు రార్యులందరును
అశుభంబులకు కాలహరణంబె మేలు
సుశుభస్య శీఘ్రమని శూరులందూరు
విడిపించుటయె నీతివీనికి దీని
కొడుకులనిచ్చెదకొమరొప్పననుచు
సతినివిడచినపైవిచారించెదాను
సుతులుబుట్టినదాక శుభముగావీడు
మడియకనుండునె మహిమీద కాంత
దడవైన నాటికొక దైవంబులేడె
మిన్నుబల్కినబల్కుమిథ్యయేలగును
కన్నుగావీనికి పాల్పడుగాని
అందాకవిడిపింతునబలనటంచు
వందనంబొనరించి వరుసమన్నించి
యందందహాస్యంబు లాడుచు జేరి
మందహాసంబున మంచిదిబావ
వావిరిసుతులచే వచ్చు కీడంచు
బావరో దీనికిభయపడనేల
కాంతకెందరు సుతుల్ గలిగిననీకు
చింతింపకిచ్చెద స్థిరమతినుండు
మనిపల్కె కంసుండు హర్షంబునొంది

వనితనువిడచి తావచ్చెగృహామునకు
వసుదేవుడును తనవాఙ్మాత్మీతోడ
వసతికిజనుదెంచె వైభవంబొప్ప॥

అంత కొంతకాలంబు జనిన సమయంబున

సీ॥ కంసునిచేబహుకష్టంబులనుజెంది దేవకికొడుకుల దేవసముల
నెనమండ్రనొకకూతు నేరీటనొక్కనిలెక్క గాగనియెనులేమయపుడు
పుట్టినప్పుడె కంసభూపతికిచ్చెను ధృతిగల్గిసత్యపద్ధతికినిల్చి
వసుదేవుడయ్యెడ వసుధీశసత్యవంశునకు నెయ్యదిధరదుష్కరంబు
యెరుకకలుగుజనున కేది యిష్టంబీశ
భక్తియుతున కియ్యబడనిదేది
చెనటిచేత నేదిచేరాని కార్యంబు
యెరుక లేనిజనున కేదికీడు॥

వ॥ యిట్లు సత్యంబుదప్పక కొడుకులనిచ్చిన వసుదేవుంగాంచి హర్షించి బావావీనివలననాకు భయంబులేదు నీయష్టమతనయుండు నాకు వైరిగావున వానివధియించెదనని మరలనిచ్చినంగొని కంసుని దుష్టస్వభావం బెరింగినవాడుగావున వసుదేవుం డానందంబు నొందడయ్యె నంతనొక్కనాడు సకలవిద్యావిశారదుండగు నారదుండు కంసునిగృహంబునకు వచ్చి కంసా నందనుని మందంగల సర్వయాదవులనిమిషులనియును నీవు కాలనేమియనురక్కసుండవనియును సర్వదేవతాస్వరూపుండగు నారాయణుండు దేవకీదేవియందు జన్మించి దుష్టశిక్షయును శిష్టరక్షణయును గావించుననియును రహస్యంబున దెల్పిన విని దేవకీవసుదేవుల కారాగృహబద్ధులం జేసి వారిసుతులం దునుమాడి యుగ్రసేను నదలించి ధేనుక బక బాణనరకతృణావర్త చాణూరముష్టికాది దుష్టసహాయుండై శూరసేనంబులను రాజ్యంబులేలె కంసునిచే పరాజితులై కొందరు యాదవులు నిషధ కోసల విదర్భ కేకయ పాంచాలాది దేశాధీశ్వరులం గొల్చిరి, కొందరు మత్సరంబులు విడిచియతనిం గొల్చిరంత దేవకీదేవికొడుకుల నార్వురవధించినపిదప శేషాంశ

మైన హరి సప్తమసూనుండయ్యె నారాయణుండు నిజభక్తులయిన యాదవులకు కంసునివలన భయంబుగలుగునని యెఱింగి యోగమాయా దేవినిరావించి యిట్లనియె.

కేదారగౌళరాగం—అట

చనవమ్మా వేగమె జలజాక్షి మందాకు జనులు ముదమునొంద జడుడు కంసుడుగుండ। గనిన నావసుదేవుభార్యల గాశిబెట్టును కంసుడని యావనితవ్రజ వరుండు రోహిణివనజపత్రవిశాలలో చన॥ జన

దేవాకికుక్షిలో దీపించు శేషాఖ్య తేజమొప్పగనీవుదెచ్చిరోహిణి యందు జేరిజేర్చగానే నపుడె యాదేవకీగర్భంబునందున గావజగతిని గల్గెదటపైగల్గుమీవుయశోదయందున॥ జన

సలలితసత్సంపత్ప్రాసమైన నిన్నుజనములు శేవించిజయభద్రగిరి యందు। జలగుహేతుణనిన్ను నెపుడు జగతినభినుతి శేయువారలకిల నిహపరములు యొసగునటులుగ నిత్తుపదునాల్గాహ్వాయంబులు॥ జన

వ॥ ఇట్లు బల్కిన నారాయణునిపల్కులు విని మహాప్రసాదం బని యంగీకరించి నందుని మందకుజనుదెంచి॥

ఉ॥ దేవకిగర్భమందునను తేజమునొందెడు విష్ణువంశముగ
వావిరి యోగమాయగని వచ్చి జనుల్గనకుండ రోహిణీ
దేవినిచేర్చి నక్కడను ధీవర దేవకిదేవిగర్భసం
స్రావతనొందెనంచు నట నందులగొందుల వారుబల్కగ॥

గీ॥ బలముచేతమిగుల బలభద్రుడనియును
రమణుడౌట లోకరాముడనియు
జగతిబుట్టినపుడు జలజాక్షిరోహిణీ
దేవికడుపునందు దేజమలర॥

మధ్యమావతిరాగం—అట.

గర్భచిహ్నముదాల్చెను। దేవకిదేవి గర్భచిహ్నముదాల్చెను॥ గర్భచిహ్నముదాల్చె స్వర్భానునిభవేణి కబూరులదృవవిభుజుల లరగ॥ గర్భ॥

భాసురాంగికినపుడూ । కుచాగ్రములు పరగనల్లనాయెను । భాసూరుడగు పరమేశుడు కుక్షిలో వాసిగనుండుటజేసి శ్రమయు డోచె॥ గర్భ॥

హారా వల్లులు సళ్ళైనూ । దేవకి కాహారవాంఛలుమళ్ళైను । సారమైనమన్ను చవియయ్యె రోమాళియురమునందున మెరశె । భారమయ్యె దేహాము॥ గర్భ॥

గర్భాముజూపట్టెను । వనజాక్షికి కౌనువిశదంబాయను । కర్బురులను దుష్టకాళోదరులకెల్ల ఖగపతిపక్షముగాదోచె గనకుక్షి॥ గర్భ॥

ముదముసొంద నమరులు । కంసాదులు మదిగుంద నతిభీతులై సదయుడో భద్రాద్రిసదను డామదవతి యుదరములోపాల నుల్లశిల్లగ మంచి॥ గర్భ॥

చ॥ సరసిజనేత్రయొప్పె నట సారతరస్ఫుట చిద్విహీనులో
సరసకళాప్రదాయియగు శారదయుంబలె నీలమృత్తికో
త్కరకృతకుంభదీపకళికాప్రభయుంబలె దీర్ఘరోషసం
కర కలితాత్ములై బరగు కంసునిచే దృఢనాకబద్ధయై॥

వ॥ ఇట్లు దేవకీదేవి విశ్వగర్భగర్భయై కర్బురులకు నిర్భరంబుగా హావిర్భుజుల కబ్బురంబుగా గనుపట్టిన కంసుండు చిత్తంబున తత్తరపడి మంతనంబున నిట్లని వితర్కించె॥

## పున్నాగరాగం—అటతాళం.

యేమిసేతూ నేనెటులనైతూ । యేమిసేతు నీ భామినిగర్భము శ్రీమంతంబై చెలువొప్పెను నే॥ నేమి॥

మున్నుగానా । కన్నులారా । యెన్న డెరుగనీ సను
వెన్నుడు జొరినట్లున్నదిపుడు నే॥ నేమి॥ గల్గును చేడియదిట్టిన కీడం

చూడదొడ్డా । యాడుబిడ్డా
దురు ప్రజకూడదటుల

పెద్దచూలు । పేదరాలూ । ముద్దియయల్గిన మోదము శిరియు
ను తద్దయునాయువు దరుగునం(డు నే॥ నేమి॥

వావిలేనీ । వావివానీ । జీవన్మృతుడన జెప్పదురార్యులు పా
వనుడగుజను (బతుకొక (బతుకా॥ యేమి॥

వాసిగా నా । కాశవాణీ । యీసున భద్రగిరీశుడు నీకొరకీసతి
కుక్షినివాసుడౌననియె॥ నేమి॥

ద్వి॥ అనియిట్లు కంసుడు నాత్మలో దలచి
మనమున ధైర్యంబు మరిగీలుకొల్పి
శౌర్యంబుపాటించి చంపుటమంచి
కార్యంబుగాదని ఘనమైనమాని
వలెనుండి బాయనివగబుట్టిననుచు
చెలియలికప్పుడు శిశువుదయించు
ననుమానమించుకయైన లేకపుడె
మనుమాడెదనటంచు (ధువముననుండె
వైరానుబంధంబువలన నాతడు
ధీరుడై గుడుచుచు దివ్యాంబరములు
ధరియించుచును నీరు (దావుచున్న పుడు
హరినిదలంచి యీయవనియందున్న
పరమాణువునుగన్న భగవంతుడనుచు
మరిమరివీక్షించి మనమునలెన్న
నలుకును కర్ణంబులకు నెద్దియైన
పలుకబడ్డను హరి పలుకనియలుకు
కన్నులకేదైన కనపడ్డనదియు
వెన్నుడౌనని మదివెరచి దానురుకు
తనువునకేదైన దాకినదాని
ఘనసీలు కరఖడ్గ ఘాతగాదలచు
నామంబులెవ్వైన నయుముగావిన్న
శ్యామజనకునివని కళవళపడును

పరిమళంబేమైన బ్రౌఢిగావాస
జారవనమాలికా శుభగంధమనుచు
వెరగందునాత్మ నేవేళలందలచి
హరి తలంపనిబాల నలుకచే నులుకు
భోజేంద్రుడీరీతి పోడిమిమాలి
రాజేంద్రయుండె విరాగంబుబూని॥

క॥ ఆసమయంబున ధాతయు
వాసవముఖవిబుధవరులు వరనారదకా
రీశులు ముదమున వచ్చిరి
ఆసతిగర్భస్థుడైన హరినుతియింపన్.

వ॥ ఇట్లు వచ్చిబ్రహ్మాదిదేవతలు దేవకీదేవిగర్భార్భకుండైన పుండరీకాక్షు నిట్లనిస్తుతియించిరి

గీ॥ పుండరీకాక్షగోవింద పుణ్యపురుష
వాసుదేవజనార్దన వనధిశయన
కంసముఖదానవులచేత గప్పబడిన
జగతిభారంబు బాప వేజగదధీశ॥

క॥ వచ్చితిమిదేవ యీధర
మృచ్ఛిలియున్నయది కంసముఖదనుజులచే
మచ్చికతో పోషింపను
విచ్చేయుము తల్లికడుపు వెడలి రమేశా॥

మత్తకోకిల॥ పల్లవాధరిసీగు కుక్షినిపద్మలోచనుడున్నవా
డెల్లిబుట్టును మామకంసుని కెల్లభంగులకీను వా
డిల్లనున్నది వానిచేభయమింత లేదు నిజంబు మా
కెల్లవారికి యాదవాళికి నీశుడిచ్చుశుభంబులన్

వ॥ ఇట్లు హరసరసిజాసన ప్రభృతిసురలు హరింబొగడి దేవకీదేవిని దీవించి దివంబునకుం జనిరంత దేవకీదేవి నవమాసంబులు నిండి గర్భవేదనాలసయై యున్నంజూచి చెలికత్తెలు తత్తరంబున మొత్త

బులై హత్తుకొని యోమత్తకాశిని నీవిత్తరివేదనచే నోరెత్తెదవేని మత్తుండగు కంసుండు కత్తిచేబూనియున్నవాడు సమయంబుగాదు రద్ది శేయవద్దని ముద్దియనూరార్చిన కొంతదడవుశాంతించొంది దుర్భరం బగు గర్భవేదన సహింపంజాలక తద్దయునిట్లనియె

పున్నాగరాగం—అట

తాళాలేనమ్మా యీకష్టాముదరిదెల్పరమ్మా తాళలేనె వో తరుణులార మీకాళ్లకుమ్రొక్కేను కడదేర్చరెనన్ను॥ తాళా

యెన్నాడెరుగనే యీకష్టాములెందుజూడనె సన్నుతాంగులార మున్నుగన్న కాన్పులన్నిటికన్నాను మిన్నయైయున్నది॥ తాళా

మగనింకుదేరే ప్రాణేశుని మొగముచూపరె తొగలారెనిబల్ శగలకోర్వక నీమగనిగూడిన నీ నగుబాటులాయెను॥ తాళా

ఆడజన్మాము ధరనెవరికి గూడదు నిజము చేడియలకునెందు చెలవూలతో పొందు లాడికయనివిందు గూడాదటులముందు॥ తాళా

అప్పటినెనరు కష్టపడునపుడుగనరు ఒప్పాలుజెప్పెదరపుడు ప్రాణేశునిపుడేమనరాదు తప్పువారిదిగాదు॥ తాళా

కొడుకునుగన్న ప్రాణేశుడుగొనిపోయి మున్నాపుడమీశునకు నిచ్చు ఫలమందులేదా పుడమికష్టపడిన భోగాముగాదాయ॥ తాళా

జగమూలనేలు భద్రాద్రీశుజనని గామేలు తగకుక్షిలోపల ధరియించి జగమూలునగధరుండుండగ నాతరమటేమోయ॥ తాళా

వ॥ అని పలుకుచున్న దేవకీదేవి పలుకులువిని యవ్వా నీ గర్భంబున విశ్వగర్భకుండగు సర్భకుండున్నవాడని హిరణ్యగర్భాదులు పల్కిరి గావున నీ క్షణంబున నావిర్భవించు, నీకష్టంబు లీడేరుసని యూరార్చుచున్న సమయంబున॥

కల్యాణిరాగం—అట

శ్రీకృష్ణుడుదయించెను సజ్జనులాను చెలువొప్పరక్షించను॥ శ్రీ

కరముగ సర్వలోకములనుగావ శ్రీకమలాక్షినిజాకరమైబ్రోవ। శ్రీకృ
దేవాకిముదమొందగా కంసాదులు ధృతిజెడి భయమందగా
ఆవసుదేవాదులానందమందగ కావలివారంతకడుమోహమునుజెంద॥ శ్రీ
వనధులుప్పొంగగా వారిదములాలవరనాదములుగాగ ఘనమ
య్యుతారక గ్రహములతోనింగి దనరగదిశలన్ని ధవళములైదోచ॥ శ్రీ
కమలాకరములన్ని సంశోభితకమలములై దోచ విమలాపుష్క
రములై వెలయనదులు వరకమనియ్యపురవనకలితముగాభూమి॥ శ్రీకృ
విరులాసోనలుగురియగా సురలందరువినుతులుశేయగా నరచా
రణులు ప్రమోదసరగున గంధర్వులరిమురి బాడ దివ్యాంగనలాడగ॥ శ్రీ
శ్రావణమాసంబున కృష్ణాపక్షాష్టమి నర్ధరాత్రంబున పావాన
మైనట్టిబ్రాహ్మ్యర్క్షమంగున భావోచ్ఛగతి నైకటభములుల్లసిల్లగ॥ శ్రీ ॥
వెన్నానితనుగన్నా దేవకీదేవివిభవములనుగన్నా చెన్నుమీరెడు
పూర్ణశీతాంశుగన్న ప్రసన్నదిక్సతి గన్నమిన్నయిదోచాగ॥ శ్రీకృష్ణ॥
మాయానుసంహరింపా। నిజభక్తులమన్నించి రక్షింపా । తామ
సులను వేగదండింపభద్రాద్రిరాముడై సుజనులదయనురక్షింపాగ॥ శ్రీ॥
వ॥ అప్పుడు హరిహర హిరణ్యగర్భప్రముఖనిఖిల గీర్వాణకిరీట
కోటినిష్ఠపద్మరాగాది సమస్తమణిగణ మారీచమాలికాసమూహ నీరా
జితాంఘ్రిద్వయుండును, కటితటఘటితహాటకచేలుండును, ఘనాఘనాం
తరాళ విరాజమాన విద్యుల్లతాభలక్ష్మి శ్రీవత్సాంచిత కస్తూరీ ఘన
సార కుంకుమ పంకసంకలిత వనమాలికా విరాజమానవక్షుండును,
సుదర్శనపాంచజన్యకౌమోదకీగదాశార్ఙ్గాద్యనేక దివ్యాయుధాంచిత
చతుర్బాహుండును, ప్రభాతకాల విభాసమాన ప్రభాకర సుకరకర
నికరవికసిత శతపత్రపత్రనిభ నేత్రుండును, భాసమాన నాసామణిశో
భాంచిత నాసాపుటోద్గత శ్వాససంఘాత వాతపోతాహుత నాసాకాం
చన కుసుమశంకాకులితమౌక్తిక కుందకుట్మల భ్రమభ్రమితలోచన
భ్రమరుండును, చకోరనికరాహ్లాదకర జారచోరభేదకరరాకానిశాకర

బింబప్రతిమానమానిత వదనారవిందుండును, పూర్ణచంద్రమండలో పరిచ్ఛన్న నీలనీరదాభ సుస్నిగ్ధనీల నీలాలికజాలుండును, వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగేంద్ర నీలప్రవాళముక్తామణి ఘృణివిరాజిత నీలగిరి శృంగాగ్రస్థితపతంగనిభశుభకిరీటుండును, శింజానమణి మంజీర హార కేయూరకిరీట వరకుండలకౌస్తుభాది దివ్యాభరణభూషితుండును, హాలకులిశాంకుశ యవధ్వజ ఛత్రచామరాది దివ్యరేఖా లక్షణలక్షితపాదతలుండును, దిగిభరాజ శుండాదండోత్కనిభోద్దండభుజ దండమండలమండిత ఖండనత్కోమండల మండలీకృత కోదండదండనిర్గతోద్దండ కాండసంఘాతఖండితాఖండలరిపుమండలుండును, నిఖిల భక్తజనానంద సంధాయకుండునగు నీ పుండరీకాక్షుంగనుంగొని పులకాంకితగాత్రుండై యాశ్చర్యమొంది, సంతోషాయత్తచిత్తుండై వసుదేవుండు జలావగాహంబు శేయ రామి నానందరసార్ణవమగ్నుండై, భానుకులగు భూసురులకు వాసిగల శోచయంబులు మానసంబున దారవోసి, యీబాలుండు సూతికాగృహోద్యద్దీపశిఖంబోలి యున్నవాడు నిక్కంబీచక్కనయ్యమక్కువ నక్కమలజుపొక్కిలి నుక్కుమీరగన్నవాడని యొక్కింత భక్తిజాగిలి మ్రొక్కి ఫాలంబున కేలుదోయి గీలుకొలిపి బాలుడనక మేలుగా శ్రీలోలుని కొలులీలలు మానసంబునందలపోశి యిట్లని స్తుతియించె॥

సీ॥ సర్వేశనిన్నునే సర్వదర్శనిగాగ సచ్చిదానందు విజ్ఞానసహితు
సంతతుసర్వేశు సర్వభూతాధారు మాయావిదూరుగా మదిదలంచి
కంటినిచోద్యంబు గలదేనిమాయను గల్పించినట్టి జగంబులీల
త్రిగుణాత్మకంబుగా దేవేశచేశియు జొత్తువు జూచిన జొరకనుందు
వభవమహదాదులనుబోలి యెన్నివిధము
లగునటుల సూక్ష్మభూతంబులందు నమర
షోడశవికారములతోడగూడి యావి
రాట్టనం గనుబరగుదు రహిజెలంగ॥

గీ॥ అట్టి పరమాత్మ దేహంబునందునీవు
బడియు బడకను సృష్టికి ప్రథమమందు

నుండుటను వానికిని లోనుదయమెపుడు
గలుగదట బుద్ధి నెరుగునా చెలువమైన

వ॥ ఇంద్రియంబుల వెలపలనుండీమైన వాటిపట్టులేక నుండవు మహాత్మా సర్వప్రపంచంబు నీలోనిది. సర్వాత్ముండ వాత్మవస్తువవు నఖిలమయుండవగు నీకు వెలియులోనురంగలదె. ఆత్మవలనగలిగిన దేహాదులాత్మకంబె వేరనితలంచువాడజ్ఞుండు ఈప్రపంచంబు నీవెకాని వేరులేదని తలంతు.

క॥ జగములను జేయగావగ
దగలయమున జింద జేయ దనుజులదునుమన్
నిగమాంత వేద్య బుట్టితి
వగతణిముగ నన్ను గావు మబ్జదళాక్షా॥

శా॥ అన్నా మాకుజనించెదంచ నెను మున్నా కాశ మానాటనుం
చెన్నో బాధలబెట్టి మమ్ములను నీవాడీర్ష్య నిర్దృంచగా
కన్నారం నిదురించ డెప్పుడు వడిన్ ఖండించె నీయన్నలన్
విన్నా వాభటులేగి చెప్పగ నె తావిచ్చేయు శ్రీవల్లభా॥

ద్వి॥ అనుచుండ వసుదేవుడ దేవకియును
ఘననీలనీలు సుకాంచనచేలు
నిఖిలసద్గుణజాలు నిజభక్తపాలు
నఘుకోసనానలు నబ్ధిజాలోలు
సురమునిజనపక్షుసువిశాలవక్షు
నరిపన్నగఖగేంద్రు యదుకులచంద్రు
గనుగొని సంతోషకలితమైయపుడు
మనమునకంసుండు మరివచ్చుననుచు
నెరచుచు శుచియున్నై వేవేగ లేచి
వరదునిస్తుతియించె వైభవంబొప్ప
జగదీశ కృష్ణ కేశవ శ్రీముకుంద
నగధరగోవింద నలినాక్షవరద

పరమాత్మనిన్ను నెవ్వడు భజియించు
చిరతరాయుశ్శ్రీల జెన్నొందునతడు
యోగులుతమనిత్య యోగదృక్కులనన్
బాగుగాజూతురు భాగ్యంబుగాదు
యీనేత్రముల నిన్ను నెప్పుడుజూడ
గానేమినోచితో కమలాక్ష తొంటి
రూపంబుదాల్చవే రూఢిగానీకు
నేప్రొద్దు మ్రొక్కెద నిందిరారమణ॥

సీ॥ ప్రళయకాలంబున ప్రభుడవైజగముల కుక్షిలోపలదాల్చి కుదురుగాను। నటియింతువురమేశ నటుభంగినీవు నాగర్భస్థుడవటన్న కమలనాభ। నగుబాటులగునీవు నాకుజన్మించెదవని కంసుడాత్మలో నలుకబూని। కారాగృహములందు గట్టియుంచెను మమ్ము కఠినచిత్తుసివాని కాలునగరి।

కనిపి మమ్ములగావుమో యబ్జనాభ
మేము నోచిననోములు మెప్పుగలిగి
నీమనోహర రూపమై నీరజాక్ష
సఫలమయ్యెను నేటికీజగతియందు॥

వ॥ అని యిట్లువనజాక్షి వినయంబుగా బలికిన వనజోదరుండి ట్లనియె. అవ్వానీవు స్వాయంభువమన్వంతరంబున పృశ్నియను మహాపతివ్రతవు, వసుదేవుండు తపుండను ప్రజాపతి, మీరిరువురు కమలజుచే నియమితులై శీతవాతోష్ణంబులు సహించి పండ్రెండు దివ్యవత్సరంబులు తపంబుచేసి నన్ను గనుంగొని యర్చించిన మెచ్చి వరంబులిచ్చెద వేడుమనిన మీరు నామాయచే మోహితులై బిడ్డలులేని దొడ్డవగనపవర్గంబు గోరక నాయీడు కొడుకునడిగిన నిచ్చెదనంటి నాసాటి కొడుకులేనికతంబున నాదిభవంబున పృశ్నిగర్భుండనై జన్మించితి, రెండవభవంబున నదితికశ్యపులగు మీకు వామనుండనై బుట్టితి, మూడవజన్మంబున దేవకీ వసుదేవులగు మీకు తనయుండనై యొప్పితి నెప్పటికి మీకు జన్మంబుగలుగదు. నందనుండనియును బ్రహ్మంబనియును పర

మానందంబు నొందెదరుగావున మీరు నాయందు ప్రేమచే పెన్దరవున బొందెదరు సందియంబులేదని యమందంబుగా నిందిరేశుండుబల్కి మాయమేయ రూపంబువిడిచి యప్పుడుగన్న చిన్నిపాపనిగొప్పున మోహంబుప్పతిల్ల జేసెనంత మరియును.

క॥ వనజేక్షణు డిట్లనె నను
గొని వేగమె నందకే౽ గోపికయా నం
దుని పత్నిశయ్యశేరిచి
గొనిరమ్మందున్నయట్టి కూతురినిటకున్॥

## మధ్యమావతి రాగం—ఆది.

చనుదెంచె శౌరి మోదమునా। మందాకందముగా। చనుదెంచె శౌరి మోదమూన॥

చనుదెంచెరు తాజంకుచు మనమున వనజేక్షణుగొని వైభవమలరగ॥ చనుదెంచె॥

పురిటిల్లువెడలి యొప్పిదముగా। తాజేయు కార్యకరమంత దెల్పబడియు లోగా। ముద్దూబిడ్డా నీవగరూపమునకు మెచ్చివేగా। సన్నుద్ధుడయ్యి కరమూల నుకమూననుమా బాగా। సరగున నలమియుజనుచు మెల్లన ధరణిపైన తనచరణము విడచును॥ జను॥

లలనాబుట్టెను యోగమాయా। యశోదకు శుభఫలసూచకముల జెందజేయా। నాద్రేయి శౌరి చెలిముంద పుత్రునందు దాయా। గొనిపోవ కంసునిబలమూల నెల్లగప్పెమాయా। సులభంబుగ తలుపులు విరియగ పురి సలలితమగు వరసాలముగడచియు॥ చను॥

ఫణమూలు వేయు శోభిల్లాగ। వరమణి ఘృణులున్నదిశలా దేజరిలగా శేషూడపూడు వెనుకొని ఘడియలు వేశిరాగా। శౌరీకందముగ ఫణమూలు విప్పిచెప్పిబాగా। వెనుకొనినడువగ వేగముతోడుత ఘనమగుపురములు గడచిముదంబున॥ జను॥

యమునాయుచ్చాన్నుత్రోశా। సజ్జనులూ పాపసముదాయ వార్ధి

దాటునావ (శ్రీ)రామునకభిలమిమార్గ మిచ్చినట్లుపహావా।యిచ్చెనపుడు కమలాక్షుడరిగె వ్రజముగావ ప్రమదముతోడుత భద్రగిరీశుని కమని యాన్యాసన కంజముజూచుచు॥ జను

యిట్లుజని

సీ. నందునిమందలో పొందుగాజొరియందు మందనిద్రలజెంది యం
దమరల । నున్నట్టివారల తిన్నగాగనుగొని మేలుకొల్పకనందు
మెలతశయ్య । సయ్యనవప్పుడా యయ్యనుయిడి నాతిపయ్యదగ
ప్పియూపక్కనున్న । తొయ్యలిగొనివచ్చి తొలుతతానున్నట్టి
కారాగృహంబున కాంతప్రక్క
నమరజేర్చి మిగులనజ్ఞునిక్రియ నిజ
పాదములను మరల పదిలముగను
సంకెళలనులెస్స సవరించుకొని ధృతి
చెడక బెదరికటుల జేసెనధిపా.

గీ॥ అప్పుడయ్యశోద యజ్ఞాక్షుదెచ్చుట
కూతువేడ్కతోడగొని రయమున
నేగుటయును దా నెరుంగకనుండెను
నిద్రచేత రేయి నెలతజూక్కి॥

వ॥ తదనంతరంబ దేవకీదేవి శయ్యయందున్న బాలికమేలికగొని యూవులించెటి చప్పుడాలించి కావలివారలీవలావలివారల లేవగొట్టి మున్ను తాము తిన్నగాబెట్టిన తలుపులు తాళంబు లున్న వున్నట్లుగా జూచుకొని సయ్యనకంసుకడకేగి యయ్యనీచెల్లెలు నీళ్ళాడెవిచ్చేయు మనికుయ్యిడ శయ్యడిగి చిడిముడిపాటుతో తడబడు నడకతోకడు వెర చుచు నుడుగని వైరంబున నపుడబ్బుడుతనుజంపు తెంపున పురిటింటి జాడ నేగుతరి దేవకీదేవి బిడ్డకునడ్డంబువచ్చి కంసునితో నిట్లనియె॥

పున్నాగరాగం—ఏక

వద్దోయన్నా। రద్దినీకు వద్దోయన్నా। వద్దురద్దియన్న ముద్దియ యిదియన్న తద్దాయుదయమాలవద్దు దుర్బుద్ధినీ॥ వద్దో

కొడుకుగాడన్న। నీకు మేనగోడలోయన్న। పుడమిలో నే కోడ బుట్టితిగాని యె। న్న డుమంచియెరుగను కడుపగ యేకాని॥ వద్దో

చెల్లెలినన్నా। నేకోపించ చేటునీకన్నా। కల్లారు లేగెటిగతిబోవ వద్దన్న ముల్లోకములకీర్తి నుల్ల సిల్లుమన్నా॥ వద్దో.

కోపమేమన్నా। నేజేసినపాపామేమన్నా। ఆపాదయడనైన భూపాతులకు నాడపాపానుజంపుట పాటిగాదనివిందు॥ వద్దో

పుట్టింటియాశ। నాకు నాడెగట్టిగ బాశె। కట్టడివైనన్ను ఖండించ జూచితి వట్టినీవు నాకు బెట్టే దేమున్నాది॥ వద్దో

తండ్రికోతరము। బోవునసుట తథ్యాము వినుమూ। నిండుగ నిన్నాళ్ళనుండి యుండితిగాని ఖండితముగ దిట్టకుండాశ లేమింక॥ వద్దో

దోసాము వినుమూ స్త్రీవధనీకు మోసముగనుమూ। వాసిగ భద్రగిరీశుడె నినుజంపడాసునప్పుడేమి జేసేదో చూచెద॥ వద్దో

ద్వి॥ అనియిట్లు పయ్యోద నతివ నవరించు
కొనిభ్రమచేకూతు కొమరొప్పనక్కు
నను జేర్చి చెక్కిటనాని కరమ్ము
తనపైట చెరగునాతన్వి పైగప్పు
నప్పుడబ్బాలిక యాపులించేటి
చప్పుడువినివాడుజ్వలితుడై కోడ
బుట్టుచిట్టగచేత పొసగగాగాళ్ళు
బట్టిభూమినవేసి బాదగాజాల
నేలబడకను లీలనెగసిమింటికిని
మేలిసుపుష్పస్రగ్మిళిత హారాళి
యగుచు గదాబ్జ చక్రాంచితచాప
యగణిత చర్మశూలాంచిత హాస్త
ములు నెన్మిదియు నొప్పు ముదమందుచూను
మొలకనవ్వులు తనమోమునదోప
సిద్ధచారణముని సేవిత యగుచు

తద్దయునిట్లన తగకంసుతోడా

ఆరభిరాగ—ఆట

కానికానియ్యోరికంసా । నీకావరంబణగునృశంసా । కానికాని
య్యోరి కఠినచిత్తుడవయ్యు మానినుల జంపగనుబూనితివిగదరింక॥ కాని

తల్లికేరాయనీవాడు । మదియందుదాదినెటు మన్నించుచూడు।
చెల్లెలినిజంపంగ జెర్పించునీకు మేనల్లుడనకోడలననెంతరానేజెల్ల॥ కాని

అన్నతోపగబూనినావా। భూమిపైకొన్నిదినములు మనఁగలేవా।
మన్నించకను చాలమాతల్లి నేచితివి విన్నావ యీవ్రునుగ వడిలోన
తాకురా॥ కాని

పుట్టినాఁడోరిమాయన్న నిన్నునట్టేటిలోబడగదన్న కట్టడివినీశిర
ముఖండించి యీమధురపట్టంబు తాతకేగట్టువాడనుకోర॥ కాని

చూడరాదోరి నీమోమూ నాకుజూపితివి నీదుబల్ సామూ ।
వోడకను మాయన్నయొక్కడె నీపండ్లనూడదన్నుర రాలియుర్విపై
బడునట్లు॥ కాని

చూచెదేమోరిపాపిష్ఠి। నీచూపుసృక్కిపోగదరోరికష్ఠి వేచు
చున్నదినిన్నుజూచి నామది నీచలేచిపోవేమిరా పాచిపీనుగబోలి॥ కాని

ప్రాణములపైనింత యాశా। చిన్నిపాపలను జంపుకేవాశా।
కానకనుజేయునాకర్మఁ మనుజులకెపుడుమానునాధరలోనతానసుభవిం
పకను॥ కాని

మందనున్నాడు మాయన్న। చాలమాయగలవాఁడు నీకన్నా ।
కందర్పశతకోటి సుందరాకారు డరవిందాప్తనిభతేజు డెందుబోవెద
వింక॥ కాని

యీశాదివందితుడుసుమ్మీ।నిన్నుమోసపుచ్చునుమదిననమ్మీ
శ్రీశుడాభద్రనగరీశుతోపగబూని వాసవాదులకైన వచ్చునాబ్రదు
కంగ॥ కాని

వ॥ అనిపల్కి యోగమాయ ధరణీభాగంబున నాగమోక్తవిధానంబుల బహుదేశంబుల ననేకనామంబులం బూజింపంబడియె నంత కంసుం డంగనావతంసు పలుకులు చెవులకు ములుకులై యులికిన నలుకుగదురుమనంబున కారాగృహంబునచిత్తంబుల చింతలం జెందియున్న దేవకీవసుదేవుల రావించి వివిధసత్కారంబులు గావించి దరియంజేరి యిట్లనియె.

సీ॥ పాపాత్ముడను నేను పరమనీచుడ మీదుపాపలజంపితి భ్రమతజెంది
బంధువిరక్తుండ బద్ధపామరుడను దుష్టుండ సజ్జనదూష్యజనుడ
కోపయుక్తుండను కుత్సితుండను చరన్మృతుడ బ్రాహ్మహణుడ గత
యశుండ । మింటిమాటలునమ్మి మిగుల మీసుతులను జంపితి నా
తప్పు సైచరయ్య ।
నాదుపాపంబులెంచక నయముగాను
కరుణజూడరె జగతిలో కర్మవశత
ప్రాణులొకచోట నుండవు పరగనొక్క
దేహమందుండి వేరొక్క దేహమొందు॥

గీ॥ మోహబద్ధులగుచు ముదిరాకవోకల
జిక్కువడుచు తుదను జేరలేరు
చంపువారలెవరు జచ్చెటివారలె
వ్వరు దలంచకిటుల వగవనేలా।

క॥ శత్రులచే జెడితిననుట
శత్రుల జెడజేతుననుట చాలనిప్రజ్ఞల్
శత్రులు లేరాత్మకుమరి
మిత్రులు లేరవియుగర్మమే దలపోయగ॥

వ॥ అని పలికి కంసుండు కన్నుగవ కన్నీరుమిన్నగానించి దేవకీవసుదేవుల పాదంబులు మోదంబునబట్టుకొని సంకియలు పొంకంబున నూడ్చి మిక్కిలి యక్కరగల వాక్యంబుల నైక్యంబు నెరపిన వారలు సంతుష్టులైయుండి యపుడు కంసునితో వసుదేవుం డిట్లనియె॥

ఉ॥ సత్యముబావ నీపలుకు సర్వశరీరులు జ్ఞానహీనులై
నిత్యము లోభమోహమద నిస్తుల మిత్రతమోదశోకముల్
కృత్యములంచు నొండొరుల గొట్టగజాతురుగాని దేవసం
స్తుత్యుడు విష్ణుడీశుడని దోచకనుందురు మోహబద్ధులై॥

వ॥ యిట్లుబల్కి సుముఖులైయున్న వారల యనుజ్ఞవడసి గృహంబునకుంజని యారాత్రిగడపి మరునాడరుణోదయంబున లేచి నిత్యకృత్యంబులుదీర్చి సభామంటపంబునకుంజని ఆరాత్రి యోగమాయ వలన వృత్తాంతంబంతయు మంతనంబున దెలిపినవిని వారలిట్లనిరీ॥

రేగుప్తిరాగం—ఆది.

చింతించెదవేమయ్యా యింతవింతా। మాయంతవారలుండ నీకి దెంతా। అంతైతే మేమంతగూడి రిపునంతమునకై లోకాంతము శేయమ॥ చింతి॥

పురములన్ని వెదకివెదకి చూతుమూ। ధరలోబుట్టిన శిశువ్రాల జంపివైతుమూ। కరువలికన్నను కడురయముననీ ధరపైబోదుము దొర సెలవియ్యుము॥ చింతి॥

భవదీయబాణాళిచేత భగ్నులై। సురలు దివమువిడిచి జనిరెంతో నుద్విఘ్నులై। భవునో నీరజభవునో కమలాధవుచేరి దాలెస్సధర ణిదూలిరో॥ చింతి॥

వైరూలానెప్పుడు మరువవచ్చునా। వారు వసధిలోజొచ్చిన విడువవచ్చునా। మరపింతురు తెరిదొరిగి యేద్తురును పరులరిపులను వలయుజంప దప్పకను॥ చింతి॥

సురులకెల్లా ముఖ్యుడాదివిష్ణుడూ। అతనికరుణా సత్యపరమా గాణవర్ధిష్ణుడూ। పరమమునీంద్రుల బ్రాహ్మణవరులను హరియింప గలవాడంతము నొందును॥ చింతి॥

అమరూలజంపామూ వేగసాగీ। సంయములూ దునుమాడామూ యుపుడేమేగి। ప్రమదముతోడుత భద్రగిరీశు పరమభక్తులనా జము కడకనుపమ॥ చింతి॥

వ॥ యిట్లుబలుకుచున్న మంత్రుల పలుకులువిని దేవబ్రాహ్మణ విరోధంబు నిషేధంబని తలంపక నిలింపవైరియనుకంపలేక తెంపరియై దక్షిణాపుదార గూడు తెంపున ధరానిలింపుల సాధులజంపుమని పలాశిబృందంబులంబాపి యంతఃపురంబునకుం జనియెనంత పెక్కండ్రు రక్కసులు వెక్కసంబున మొక్కలంబుగ సజ్జనుల పజ్జంబడి పాపంబులాచరించిరి॥

గీ॥ దైత్యబలములు సాధుల దరిమిచంప
వారిబలమును శిరియును వరుసనణగె
సూరిజనముల హింసింప శుభము జయము
ధర్మమును శిరి యాయువు దరుగకున్నె॥
అంతనక్కడ వ్రేపల్లెయందు॥

ద్వి॥ నందుడపుడు మహానందంబునుండ
మందలోపలనుండు మదిరాక్షులపుడు
నందనుండుదయించె నయ్యామికిపుడు
కందర్పశతకోటి కమనియ్యగాత్రు
డిందీవరనిభాంగు డిందునిభాస్యు
డిందిందిరాలకు డిందిరాధీశు
డనిజెప్ప ముదమొంది యవనీశుడపుడు
ఘనవేదవిధులను కరమొప్పబిలిచి
వినయంబుతో జెప్ప వినివారలపుడు
జననాథ విష్ణుండు జన్మించెమీకు
మనుకులేంద్రునివలె మన్నించుమనల
ననిజెప్ప నందుండు హర్షంబునొంది
జలకంబులాడిమై చందనంబలది
సలలితచేలముల్ సకలభూషణములు
ధరియించి తనప్రాణదయితతోగూడి
సరగుననూతికా సదనంబునందు
జొరివిప్రవరులకు జోడుగామొక్కి

సరగున పుణ్యాహ సన్మంత్రిములను
జదివించి భూసుర జనముచేనపుడు
విదితంబుగాజాత
దేవతలను పితృదేవతలాను
వావిరిపూజించి వాలాయముగను
భూసురులకు నాత్మబుధజనంబులకు
వాసజాంబూనద వరహేమకుంభ
తైలశైలములను ధరణీశుడిచ్చె
శాలునకపమృత్యు పరిహారముగను
శ్రీకృష్ణుడనియెటి చెలువైనపేరు
వాక్రుచ్చిపెట్టిరి వరశాస్త్రవిధులు
నాశీర్వదించిరి యగ్రజులపుడు
మ్రోశిరిదుందుభుల్ మోదంబుతోడ
పాడిరిగంధర్వపతు లప్సరాలు
కూడి వందిజనంబు గొనియాడెనపుడు
పాడిమొదవులు లెస్స పసమీరియొప్పె
వాడల గృహముల వరశోభనములు
వేడుకజేసిరి వెలదులు పతులు
కూడి ప్రేపల్లెను కోర్కెమీరంగ
విద్వాంసులకు సర్వవేదవేత్తలాకు
సద్ధర్ములకు బహుసర్వజ్ఞులాకు
గోరకమున్నిచ్చె గోధనంబులాను
ధారుణీశుండపుడు దయమీరగాను॥
అట్టి సమయంబున.

ఉ॥ శిరములమీదపాగలిడి చెల్వగు కాంచన భూషణంబులుం
స్మెరయగదాల్చి గోపకులు మేచకవర్ణుని జూడగోరి మేల్
సరసపదార్థముల్ గొనివెసం జనుదెంచి ముదంబుతోడ భూ
వర ఘృతతక్రతైలములవాడి వసంతములాడి రయ్యెడ॥

అట్టి సమయంబునా॥

ఆనందభైరవి రాగం.

వచ్చిరపుడు గోపకాంతలూ । శ్రీకృష్ణుజూడ వనదనిభసుచికుర కాంతలూ । హెచ్చుగాను మనయశోద బుచ్చికొమరు గన్నదాని వచ్చెవార్త వీనులలర చెచ్చెర శేవింతమనుచు॥ వచ్చిరపుడు॥

మేలిబంగరు సొమ్ములన్ని । మైనిండదాల్చి జాళువాంబరములు కొన్ని । లీలగట్టి మేలిశిఖలపూలుజుట్టి కనుల కాటుకచాలబెట్టి కానుకలన్ని కేలబట్టి దిట్టముగను॥ వచ్చి॥

చందురూనిగేరు మోములా । మేలైనమంచి కుందమూలతీరు రదములా । మందగతులడిందుపడగ గజేంద్రతతులు నేత్రము లరవింద నిభములంఘ్రులకెన కెందవిరు లనందగియటు॥ వచ్చి॥

అలరువిలతు విశృబిూరు । కన్బెమల సొరులహివరుల నూగాలుజగేరూ । కలభరిపులదూరు కొనులలశుకముల నేలు పలుకు లెలగొను నీలముల నెరులు నలవికుచములా కుచములనగ॥ వచ్చి॥

హంసవదనలయ్యు వారలూ । భద్రాద్రిపతినిజాసిభక్తి లేచి ధీరలూ భాసురముగనూ నెబోశి పాపనికితలంటి పసపుబూసి జలము బోసి రక్ష జేసి తొట్లిజేర్చిపాడగ॥ వచ్చి॥

వ॥ యిట్లువల్లవకాంత లుల్లంబులు పల్లవింప యీసల్లసయ్యెయుల్లలోకంబులకు వల్లభుండని దలంచి తొట్లియందు మొల్లంబుగ నక్షతలుజల్లి శ్రీవల్లభుపల్లవ సదృశంబులగు కరపల్లవంబులు వల్లగాని ఒకలగా వర్ధిల్లుమని యక్షితలుజల్లి యుపొ్పంగుచు రంగుగా మంగళహారతులన్ని పాడదొణంగిరి॥

ఝంఝూటి రాగం.

మంగాళమనరె । అంగానలారా మంగాళామనరె । మంగళమనరె కురంగనేత్రు లుప్పొంగుచు శ్రీయదుపుంగవునాకూ॥ మంగాళ॥

నీరాజాత్మూనకూ। బలఖరుపాల నీలగాత్ర్యానకూ। నీరజభవముఖ నిఖిలామరవరచారు కిరీటోజ్వలచరణునకూ॥ మంగా॥

శృంగారకారికీ పటుసంగార భంగీతవైరికీ। రంగుగ గరుడతురంగము నెక్కి జెలంగుచు కోర్కెలొసంగెడు హారికీ॥ మంగా॥

పువ్వ్వాలూజల్లరె। వసంతమ్మూలు నవ్వ్వాచుజల్లరె। నవ్వ్వమ్మొగమునను నివ్వాటిలగ మన నెవ్వగలనణచు నృసింహులకిపుడూ॥ మంగా॥

పాటాలూబాడరె। కృష్ణునిసన్నిధినీ కూటామ్మూగూడరె। బోటులార యీసాటిశేవయే బోటులకబ్బు నిశాటదమనునకు॥ మం॥

యేమానవచ్చునూ। మనయింట పరంధాముడె జొచ్చెనూ। భామలార శ్రీ భద్రాచలపతి కామంబుననిడు కల్యాణంబులు॥ మంగా॥

గీ॥ మంగళములుబాడి మదిరాక్షులందరు
పొందుమీర తొట్లియందు జేర్చి
జలజనయనునూచి నిలచి జోజోయని
పాడిరప్పుడు గొల్లపణతులంతా॥

జోలపాట.

జోజోయదువంశ సోమశుభనామా। జోసద్గుణస్తోమ జోపరంధామా॥

నీలనీరదగాత్ర నిర్మలచారిత్రా। ఫాలనేత్రసుమిత్ర పద్మాభనేత్రా। పాలితాసురపుత్ర పటుయుద్ధజైత్రా। బాలనందసుపుత్ర పద్మాకళత్రా॥ జోజో॥

నిగమాంతసంచార నిర్మలవిహారా। ఖగవాహనసుధీర కంధిగంభీరా। జగదార్తిసంహార చండరణశూరా। నగధరామరవైరి నగవజ్రధారా॥ జోజో॥

నీలకుంతలజాల నిజభక్తపాలా। ఫాలనిర్మితచంద్ర లీలగోపాలా। శూలి బ్రహ్మాదిసుర పాలవ్రజఖేలా। లాలితాబ్ధిజరాజరాజ భూపాల॥ జో॥

పరమపదమందునా బంగారుమేడా। సురగేంద్రుపాన్పునను॥

దధిజాతో రా । వరనారదాది సద్వైణికులు బాడా । సరసంపు క్రీడలను సల్పుబల్ ప్రోడా॥ జోజో॥

కోరి బ్రహ్మాండమున కొమరొప్పుచూనూ । క్షీరవారాశిలో చెలువమరగాను । చారుతరఫణిరాజ శయ్యయందుననూ । శ్రీరమా రమణితో చెలగి యాడుచునూ॥ జోజో॥

ధాతాదిసురవరుల్ దగసన్నుతింపా । భూతలంబున దుష్టభూధవులజంపా । మాతవైనయశోద మన్నించిపెంపా । ప్రీతితో వ్రేపల్లె పెరిగి తనుకంపా॥ జోజో॥

మధరూపముదాల్చి మదించిదనుజూ । తెచ్చి వేదములజున కిచ్చితివిలీలా । కచ్ఛపాకృతిదాల్చి గట్టెత్తిసురలా । కిచ్చుగానమృతంబు మెచ్చిచ్చితౌరా॥ జోజో॥

వారాహరూపివై వరహిరణ్యాక్షూ । పోరిలోజంపియు పుడమెత్తినావ్రా । నారశింహుడవయ్యు జీరి వసుకశపు । సారమతి ప్రహ్లాదుశ్రమబాపితివిరా॥ జోజో॥

బడుగురూపముదాల్చి బలిదైత్యవరుమూ । డడుగులను యాచించి యతనిబంధించీ । పుడుగ నైశ్వర్యంబు వృత్రారికొసగీ । కడుతల్లి దండ్రులను గాచితివి భళిరా॥ జోజో॥

పరశురాముడవయ్యు పార్థివుల నెల్లా । నిరసించివిప్రులకు నేలయిచ్చితివీ । నరవి దశరథ రామచంద్రరూపుడవై । ఖరుని దశకంధరుని బరిమార్చితివిరా॥ జోజో॥

బలభద్రకృష్ణుడవయ్యు మునమునెల్ గొల్చు । త్వద్దాసవరు కృష్ణదాసు నేలితివీ । బుద్ధరూపుడవయ్యు పొల్పొందితీవీ । యుద్ధణికల్కివై యింపొందినావ్రా॥ జోజో॥

లాలిపాట.

లాలి శ్రీకృష్ణలాలీ । కరుణావిశాల శ్రీలోలలాలీ । లాలిశుభలీల లాలీ । యదువంశపాల గోపాలలాలీ॥

నవరత్న ఖచితమైనా । తొట్లిలో నవ్యమృదుతల్పమునను । నవ మోహనాంగ రమతో । శయనించునాయన్న యదువల్లభా॥ లాలీ॥

సనకాదిమౌనులెల్లా । వినుతించి సామగానము శేయగా । ఘన ముగా నారదుండూ । తుంబురుడు కలగీతములు బాడగా॥ లాలి॥

విమలాస్యలిరువంకలా । కరములను వింజామరలువీవగా । కమ లాక్షి భామినీలు । విడములను కడువేడ్క నందివ్వగా॥ లాలి॥

వందిమాగధ జనములూ । నీకథలు వర్ణించి బొగడగనూ । కందర్పజనక శ్రుతులూ । పాదముల నందెలై మెరయుచుండా॥ లాలి॥

కమలాసనాదిసురలూ । ప్రార్థింప కరమొప్పయదుకులమునా । కమలాక్షిబుట్టినావూ । సజ్జనులను కరుణతో రక్షింపనూ॥ లాలి॥

శారదాంబుజలోచనా। ఆశ్రితాసూరి పాపవిమోచనా । సూర్య చంద్రవిలోచనా । సజ్జనాధార కౌస్తుభభూషణా ॥లాలి॥

రాకేందుసదృశవదనా । సద్భక్తరాజచిత్తాబ్జసదనా లోకేశకుం దరదనా । శ్రీరమాలోలాబ్జవదన మదనా॥ లాలి॥

యీశాదిలేఖపాలా । భద్రాద్రివాస సుగుణాలవాలా । హాస జితరాజలీలా । శ్రీకృష్ణదాస చిత్తాబ్జఖేలా॥ లాలి॥

వ॥ యిట్లు గోపకాంతలా రమాకాంతుని తొట్లియందుంచి జో కొట్టి యశోద యనుజ్ఞవడశి ప్రర్చందన తాంబూలాదులు గ్రహించి నిజగృహంబులకుంజని రంత్రా॥

గీ॥ పనులు జేయునెడల బ్రహ్మకైవడి హర్ష
కలితుడైనయపుడు కమలనాభు
పగిది కోపమొదవుపట్ల రుద్రునిభాతి
బాలుడొప్పె చిన్ని పాయమునను॥

సీ॥ జగములనన్నింటి జలములోపలగల్పు జలజాతుడాపు రాజలజము ఖుల । కరపల్లవంబుల కరమొప్ప జలకంబులాడె విశ్వంబెల్లవాడి నిద్ర । జెంద జోకొట్టి తా జెందకయున్నట్టి కందర్పజనకుడా కుంద

రదను లందంబుగా తొట్టియుంచుంచి జోకొట్టకంన్దోయి మూసితాక
పటనిద్ర ।

గైకొనియె నేమనగవచ్చు కర్మసమితి
ఫలదుడౌ హరి జాతాది భవ్యకర్మ
ములను జెందెను జగముల ముదముమీర
గాచు హరి వల్లవులచేత గావబడియె॥

వ॥ తదనంతరంబ నందుండు రోహిణీదేవిని రావించి వస్త్రాభర
ణంబులిచ్చి మన్నించిన సంతోషాయుత్తచిత్తయై యుండె నదిమొదలు
నందుని మందగల యాలమందలు విశాలంబులై పాలుగురిసె, నంత
నందుండు మందకు దక్షులైన రక్షకులనియమించి కంసునకు కరంబు
గట్ట మధురానగరంబునకరగి యాదు యథోచితంబుగా వసుదేవుం
గాంచిన నతండు తనయునిమీది వినయంబున నతనింగౌగలించుకొని
సుఖాసీనుంజేసి కనుగవల నానందబాష్పంబులొలుక నిట్లనియె॥

శా॥ నందా నీకుసుఖంబె నీసతికి నానందంబె పుత్రుండు మేల్
బొందన్ గల్గెనె మిత్రుగాంచుటలు మున్ జన్నట్టి ప్రాణంబులన్
జెందం భాసిలు బొందికైవడి నినుం జెల్వొప్పగాజూచితిం
సందేహంబులు వాసె నాసుత నీ సాన్నిధ్యమందుండినన్.

వ. అనిన నందుండిట్లనియె.

సీ॥ నీతనూజుల నెల్ల నిర్దయకంసుండు వధియించె నంతట వనితయొక తె
చేదప్పి యాకాశసీమ జేరెను యిదివిధికృత మిందుకు వెరగుపడు నె
ప్రాజ్ఞుండు వగవకు పరమధర్మజ్ఞ నీసూనుడుగాడె నాసూనుడరయ
ననవసుదేవుండుహర్షించి పొమ్మిటజాగేల మందను చాలభయము
బుట్టనున్నది యటకీవుబోవవలయు
నన్న రథమెక్కి నందుండు యపుడె గదలి
విన్నమాటకు నలుకుచు దన్ను గొలుచు
గోపకులగూడి జనుదెంచె ఘోషమునకు.

ద్వి॥ అంతపూతన కంసునాజ్ఞచేతాను
వింతగా పురములవీధులందున్న
పురిటిండ్లలోజొచ్చి పుట్టినశిశుల
నరశిజంపుచు మందకావేళ్ళవచ్చి
యిల్లిల్లువెదకంగ నెవ్వనిపేరు
చల్లగావినువారి సర్వభయంబు
లణగునాహరి యున్నయట్టిమందిరమున
పణతిరూపముదాల్చి భాసిల్లుచూను
బాలనినాదంబుబడ చెవులయందు
మేలైన మాటల మెలతలమోహా
జలధిలోపలముంచి జలధితనూజ
యిలపాలనము శేయు నీరూపమునను
వచ్చెనోయని గోపవనితలుజూడ
మచ్చికపర్యంకమధ్యంబునందు
చెన్నారు కృష్ణుని చెలువవీక్షించి
చన్నులవిషమూని సయ్యనజేరి
యరనిద్రజెందిన యబ్జాక్షిపాన్పు
దరియంగజేరి పైదయమీరశిరము
కరమొప్పమూర్కొని కాంతయిట్లనియె
సరగున గోపికాసమితిజూడంగ
చిన్నికృష్ణమ్మ నాచిట్టి యాకొంటి
వన్నచనుగుడుపుము వరుసనాచన్ను
బాలుగ్రుక్కుడుదాగ ఫలియించుకోర్కె
మేలుగానాదన మెలతయశోద
వేవేగ జనియెను వెలదిరోయటకు
పో వద్దువద్దమ్మ పోలతినీపాలు
మాపాపడొల్లడీమాయలేటమ్మ
కోపింపకేగుమీ కువలయనేత్రి

యనిపల్కు పల్కుల యామినీచారి
వినక లోకదినంబు వెలపలమంచి
దెలుపుచు బాలుని దెసజనిఫణిని
దెలియక గుణమనిదివియుచందమున
పొంకంబుగా కృష్ణు పొలతియంకమూన
జంకకనిడుకొసిజమరుచు మేను
అప్ప చనుగుడుపుమాయయ్య శ్రీకృష్ణ
గొప్పగా నాకొంటికోమలదేహ
చప్పరించుమటంచు సయ్యాన పైట
గప్పుచునున్నట్టి కాలంబునందు.

బిలాహరిరాగం

విను రాజశేఖర విశదంబుగాను। వనరగపూతానవధను జెప్పెదను॥

నందనందనుం డింపొంద మేల్కాంచి। కన్దోయివిచ్చి రక్కసి కాంతజూచి। యందాముగా చేతులటు సాచిహెచ్చి। చందోయికబళించి సయ్యనవచ్చి॥ విను॥

గుక్క గుక్క గుటుకు గుటుకంచు పాలూ। చక్కెరకన్నను చవియైనట్టులూ। గ్రక్కున తనరెండు గ్రుక్కాలలోను। రక్కాసిప్రాణముల్ సొక్క జేసెను॥ విను॥

అంతారక్కాసి గుండెలవిసి భీతిల్లీవంతజెంది శిరము వ్రాల్చి చింతిల్లీ। యింతాటివాడని యెరుగాకనీదూ। చెంతజేరితి నెంత చెనటి ననియెనూ॥ విను॥

విడువర చనుగవ కుడువనింకేలా। తడబడె ప్రాణముల్ దయనుంచు బాలా। బుడుతలు నీసాటిబోలరో బాలా। దుడుకాడవని యెనాడు ర్మార్గశీలా॥ విను॥

ధృతిచెడి దప్పిచేకుతికెండి చాలా। మతిదప్పిరక్కసిమహిమీాద గూలా। నతిఘూర్ణితములయ్యె నంభోదులెల్లా।గతిదప్పెతారకగ్రహములావేళా॥ విను॥

గొల్లాలమనమూలు ఝల్లనగాను। ముల్లోకములవాడు తల్లడిల్ల గనూ। కల్లారినిశిచరికాస్యపిబడెనూ। డుల్లివృక్షములన్ని తుముకుల య్యెనూ॥ విను॥

యేభయమునులేక నెదపొందుగాను। శ్రీభద్రగిరిరాజసింహు డుండగను । రాభయమున గోపరాజులందరును । శోభనమస్తనుచు చూచుచునిరి॥ విను॥

వ. అంత నారక్కసి వికృతాకారంబుదాల్చి ధరింబడిన గోపకాంతలు రోహిణీయశోదలం గూడుకొని యార్తాత్మించరి దేహంబునమిత్రు నిభంగి వర్తించుచున్న చిన్నికృష్ణువిం బిలిచి కౌగలించుకొని చక్కనయ్యా నిన్ను రక్కసి స్పృక్కజేయందలంచి ఫలభ్రాంతిదీపశిఖకబిలించు మిడుతచందంబున డింపుపడియె నింపుకు వెరగందితివాయని యశోదగోపసుందరులం గూడుకొని యంగరక్షలు గావింపదలంచి మాంత్రికులచే సర్వాంగంబుల బీజయుక్తంబులగు మంత్రంబుల సంగరక్షలు గావించి సర్వకాలంబుల సర్వస్థలంబుల భూతభేతాళాది గ్రహంబులవలన ద్విపచ్చతుష్టజంతువులవలన దుస్స్వప్న దుశ్శకునంబులనైన భయాపమృత్యువుల సంహరించి బ్రహ్మాదిదేవతలు నిన్ను రక్షింతురు గాక నదీవించి తొట్టియందుంచి జోకొట్టిరంత.

క॥ నందుడు రక్కసిగని భయ
మందుచు వసుదేవుడధిక యోగియని మహా
నందంబునొంది పూతన
పెందేహమునరికి యగ్ని బెట్టించె నృపా.

తదనంతరంబ.

సీ॥ పూతనమైపొగ పుణ్యగంధంబయ్యెహరిచేతదురితములపహరింప కలికిదేహంబున కరపదంబులుమోప జననికైవడిమోక్షసదనమబ్బె విషకుచంబిచ్చిన ఝషనేత్రి దివికేగచన్నిచ్చిపెంచిన సతికిజన్మ గలదెపాలిచ్చిన గరితయెల్లినను పరగదుగ్ధములిచ్చు పశుగణంబు

యెట్టిముక్తిని జెందెనో యేమివింత
యనుచుగోపకులాడగ నధికప్రేమ
మీరనందుండు మందకుజేరనరిగి
కొడుకు ముద్దాడి శిరముమూర్కొని ముదంబు
నొందెనని పల్కె భూమీశుడెందమలర.

చ॥ సరసిజమిత్రవంశవరసాగర పూర్ణసుధాకరాత్మ వి
త్సరసమనోంబుజ ప్రకరసారసమిత్ర పురారిపద్మజా
మరవరవందితాంఘ్రియుగమంజులహస్తయుగాత్త వైరిభీ
కరశరచాప రామనృపకార్యపి పుత్రహృదీశ కేశవా.

తరణికులపవిత్రా దానవారాతి మిత్రా
ధరణి సుతకళత్రా దైత్యనీలాబ్జమిత్రా
సరసిజనిభనేత్రా చారుమత్తార్క్ష్యపత్రా
వరదశరథ పుత్రా వారిముక్చారుగాత్రా.

గద్యము.

ఇది శ్రీరామచంద్ర చరణారవింద నిష్యంద మకరందబిందు సందోహ
పానమత్తమధుకరాయమాన మానసపవనాత్మ కృపాలబ్ధ కవితా
మాధురీధురీణ శారదావరప్రసాదసమాసాదిత మనీషాప్రాభవ
శ్రీముద్గాడెంవంశపయఃపారావార రాకాసుధాకరకాస్యప
సగోత్రపవిత్ర వీరరాఘవార్యపుత్ర సకలసుకవివ్యాజన
కృపాపాత్ర శ్రీకృష్ణదాసప్రణీతంబైన శ్రీమహాభాగ
వతపురాణాంతర్గత దశమస్కంధసంబంధ నంద
నందన చరిత్రంబను యక్షగాన ప్రబం
ధంబునందు కృష్ణావతారఘట్టము
ప్రథమాశ్వాసము.

---

శ్రీకృష్ణ పరబ్రహ్మార్పణమస్తు.



శ్రీ రామచంద్రాయనమః.

శ్రీ శారదాంబాయైనమః.

శ్రీ హయగ్రీవాయనమః.

# నందనందన చరిత్రము.

---

క॥ శ్రీమద్రఘువంశాంబుధి
సోమసురానీకకుముదశుభహిమధామా
కామారిజపితధామా
రామారామాభిరామ రాజలలామా.

వ. అవధరింపుము తదనంతరంబ పరిక్షిన్న రేంద్రుండు శుకయోగీంద్రుంగనుంగొని

సీ॥ బోధించితివినాకు పురుషోత్తముని యవతారలీలల నింకదనివిదీర
దక్షలేశుగుణములునిఖలసంపత్తరంబులుగానవినియెదముదమువీర
ధరణీసురోత్తమ దయగలదేనియు దెల్పుము మావంటిదీనజనుల
భవసాగరములందు బడనీకదరిజేర్చదలచినాదింతియధరణిమీకు
కార్యమేమున్నదని రాజుకరుణదోప
బలుకమునితనమొగమున మొలకనవ్వు
లొలుకబలుకుల నమృతంబుజిలుక రాజ
తిలకుగని బల్కె తనుభృతపులకుడగుచు.

ద్వి॥ అంతనందుని పత్నియైన యశోద
సంతసంబునపుత్రజన్మోత్సవమనుచు

విబుధులరావించి వేదమంత్రనూాల
నభిషేక మొనరించి యఙ్ఞాత్మునపుడు
జోకొట్ట నిదురించి సొబగుగా లేచి
శ్రీకరాంకుశపద్మచిహ్నితంబైన
పదమున శకటంబు బగులదన్నంగ
నదిభగ్నమైపోయె నంతయశోద
మొదలైనవారలు ముదమొందగాను
యిదియేమిచిత్రమో యిపుడీబండి
మిన్నున కెగసెను మిగురగావీడు
చిన్నిపాపడుపదుల్ జేరరిచ్చోట
నున్నదేమొవింత యూహింపగాను
వెన్నుండుదన్నగా వినువీధికెగసె
ననిబాలకులుదెల్ప నతివలాశ్చర్య
మున జెందిరపుడు ముదితయశోద
కొమరునక్కునజేర్చి కొమరొప్పగాను
ప్రమదంబుతో మత పాలిచ్చెనపుడు.

వ. తదనంతరంబ యశోదబాలునకు బాలగ్రహంబులు సోకవు గదాయని మాంత్రికులచే నరకరక్షలుగావించి విద్వజ్జనంబులకు బహు ధనంబు లొసంగి వారియాశీర్వాదంబులగైకొని సుఖంబుండిరంత.

సీ॥ తనయునియొక నాడుదయమిూరతొడలపైనిడుకొనిముద్దాడిపడతియుండ। పర్వతనిభముగా బరువయ్యెనిదియేమిచిత్రమోయని లేచిచెలువజూచి। ధరమిూదడించి యీధరగావబుట్టిన హరిగాని యీతడు నరుడుగాడ। టంచు చిత్తములోన నెంచుచున్నంతలో కరువలిరక్కసుం డరుగుదెంచి

సురసురయటంచు దిరుగుచు సుడివహించి
చిరుతపాపనియఙ్ఞాత్ము జేరనరిగి
వేగమునగొని దివికేగ వేడ్కమిూర
కడుభయంబున గోపకుల్ సుడిబడంగా.

వ. తదనంతరంబయశోద తనయునిగానక నిట్లువిలపించె.

పున్నాగవరాళిరాగం

రారనందనందన నినుజూడకుండ లేర భక్తచందనా। రారమన్మథసుకుమార మచ్చిత్తాబ్జకైరవాహిత యదువీరాయిదిమేర॥ రార॥

యిక్కడ నినుడించినా। నాబుద్ధియెంతో రక్కసిదనియెంచినా చక్కనయ్య నిన్నుక్కనచేర్చి నేమక్కువనుండిన చిక్కపుగాలికి॥ రార॥

సుడిగాలి యటువచ్చియూ గొనిపోవగ కడుభయమునవొచ్చి। కొడుకాయేమాని సుడివితో నిన్నెడబాసి నేనొక్కగడియ యుండగ లేను॥ రార॥

శ్రీశుని నినుగంటిసీ బహుపుణ్యము జేసితినను కుంటినీ। వాసిగ భద్రగిరీశుడ నన్నెడబాసి పోవనుకొంటి బంగారమాయిటు॥ రార॥

వ. ఇట్లు యశోదవిలపించుచున్న సమయంబున గోపగోపికా జనంబులు వగలం బొగలుచు దరియం జేరి యూరార్చుచున్న సమయంబున.

చ॥ చక్రసమీర రాక్షసుడు చక్రిని వేగొనిపోయి మింటికిం
మిక్కిలిభారమై యతని మేనతిభారమటంచు భీతిచే
స్రుక్కుచు నిట్టిబాలకుని జూడనుమున్నని యార్తిజెంది యే
దిక్కటు శేయువాడునని దీనతదోపగ బల్కుచున్నెడన్.

సీ॥ హరితనకరముల నతనికుత్తుకబట్టి దిగబడ్డ వాడును దిగులుజెంది
ధరపైనబడి ప్రాణతతిబాసిబో గోపవనితలు జూచి యవ్వనరుహాక్షు
గొనివచ్చి నందుని కువలయాక్షికొసంగి చింతింపబోకమ్మ చెలువ
నీదు। సుకృతంబుచేతను సుడిగాలిరక్కసు డంతంబునొందెనో దం
తిగమన।

రక్షకులు లేకనైన సురక్షితముగ
సజ్జనుండుండు కుజనుండు సర్వరక్ష
ణములు గలిగియు హతుడౌనునయము లేమి.

కృష్ణుగంటిమి మనపురాకృత శుభమునా॥
అని పలికిరంతా॥

గీ॥ తల్లి యొకనాడు సుతునంకతలము జేర్చు
కొనియు చన్నిచ్చి నెమ్మోము గొమరుమిగుల
నివురుతరి యాపులించిన నందిరేశు
వదనమునగాంచె సర్వప్రపంచమెల్లా॥

వ॥ యిట్లుగాంచి యాశ్చర్యంబు నొందెనంత కృష్ణుండు మందిరంబులయందు దుండగీయుచున్న వాడని శౌందంబుల నీషణ్ణ్యాలంజెంది గోపసుందరులు నందసతితో నిట్లనిరి॥

పున్నాగ రాగం.

కలదా లేదా । కృష్ణునికాజ్ఞ కలదా లేదా॥

చెలు వాపూయిలుజొచ్చి కలపాలుద్రావి నెచ్చెలులాకుబోసి చట్లుల గల్పె నేజెల్ల॥ కలదా॥

పెరుగంతదాగా । కోడలుజూచి పెనగాగసాగా । పరువీడుచు నుజేతి పెరుగుమూతినబూయ మరిదొంగయనియత్త మదిఁగాంచెనేజెల్ల॥

యిళ్ళాలోజొచ్చి చెలులగూడి గొళ్ళెముల్విచ్చి గోళ్ళుయెత్తులు గట్టి తుళ్ళుచు గట్టుంద కెల్లకుండలకింద తూళ్ళు జేసిద్రావె॥ కలదా॥

సుతులులేరాని । బాలికగొఱ్ఱు మతిచింతబూని । యతివాయుండగనీ సుతుడొచ్చినను నీవు పతిగాగైకొన్న నీవెతదీరున నమ్మ॥ కల॥

వారింటికేగీ । పాలు నెయ్యివావిరిదాగీ । వారింటికడువాలు వీరింటనిడియేగ వారివీరికి దొడ్డవాదయ్యె నమ్మయ్య॥ కల॥

వెన్నంతదినగా । పొడగాంచి మాపిన్నాదిజనగా । చన్నుబట్టి బంతిగన్నాననుచులాగి పిన్న పెద్దలుజేరి చిన్నబుచ్చెనుదాని॥ కల॥

చూలాలొకతె । దారిబోవజూచి వోవనితా । వాలబోయిననే చూలాలనంటకు బాలన చూలేమూలముమానని॥ కలదా॥

నిద్దూరబోఁగా । పిల్లనిచుంచు వద్దిక తేగా । రద్దిసేయక రోఁక
సద్దినట్లుగఁగట్టి పెద్దవీధినిదోల నద్దద్దయనియూర్చె॥ కలదా॥

వెన్న దియ్యఁగనూ । వంగియున్న కన్నె వెనుకనూ ! సన్నాఁగఁజేరి
యాచిన్నాది మొఱబెట్ట చెన్నుమీరఁగ మొగని చిన్నాలుసలిపెను॥కల॥

యిలవేల్పులాకు । తరిజుట్టిన రలదానమీఁకూ । యిలవేల్పునా
కంటె గలడానిభద్రాద్రి నిలయుడెంగిలి తాఁచలమూనఁజేసెను॥ కల॥

వ॥ మరియు యశోదా నీతనయుని యవినయంబులు సవినయంబుగావిన నవధరింపుము నాయిరువ్వునకు బిరబిరనఁగుదెంచి సరసీరుహా కిరణ వికశితశతపత్ర పత్రనిస్సృతమరంద నిభనేత్రారవింద విగళితాస్రు పూరుండై యిట్లనియె. నీకోడలుహారిణపోతఖురాఘాతంబున నితాంత శ్రాంతయైయున్నది. చన్నరమ్మనినది చిన్నబోయిన మనంబున యెక్కడెక్కడచూపుమని పిన్నపెద్దలంగూకుకొని వెన్నుదగిలిన రహస్యస్థలంబునవిస్రస్తచేలయైయున్న కన్నియఁజూపె, నింకొక్కొక్కపద్మానన సద్మాంగణంబున తనయుని చేఁగటఁదకుకొని మెలంగుచున్న గనుఁగొని పల్లవపాణి యీపిల్లడెవ్వడేయని మవ్వంబుగా నడిగిన జవ్వని యిట్లనియె వల్లవబాల కల్లగాదు నాగర్భంబనుఁగనె వలనబుట్టిన మణియననే బల్లిదుండు నీవమను కొల్లబుచ్చి గర్భంబనుఁగనె ద్రవ్వి యీమణిదెచ్చెనని నచ్చట నలువక విచ్చేశెనమ్మకొమ్మ. వొకతె యుదరభారమున గదలలేక చంగట మెలంగుచున్నఁగనుగొని వోయంగన నీయుదరంబు బొందియున్న దేమన బాలుండుగాన నెరుంగక నడిగెనని కడువేడునిట్లనియె. నీవంటి బుడుతడిందుండి రెండురుతువులకు వెడలంగలండన నలరి యోసుందరీ యిందుకేనా నీయుందకాఁడు సందెయందుమంద కేగక మందిరంబున నిన్ను మూదరనిడుకొని తొందరపడి కిందుగా భారంబున ద్వారంబుశేయ సమకట్టినదియునుంగాక॥

మ॥ వృకపూబోణినిగాంచి లేమ వినునేనొప్పారగాజూచితిం
నికలి ద్వారబిలంబునన్నపుడు నీనేస్తుండు కామ్మావి గం
టకమొప్పం గరచాజురుక్కనగ ప్రౌఢావాడు క్రిందాయనా
గక కోపంబున మీదనెక్కితివి బాగాయేలనే యీపగల్॥

వ॥ అని మరియు వల్లవకులదీపికలైన గోపికలోపికలులేక యశోదతో నిట్లనిరి॥

యమునాకల్యాణిరాగం.

యిందీవరాక్షి యేమందుమమ్మా । కృష్ణు నిందీవరాక్షి యేమందుమమ్మా॥

సందూనచిన్నది పొందూగజల్కమాడ నందాముగా వలువలందీ బొబ్బాలుబెట్టి॥ యిందీ॥

రాతీరియింటిలో విఖ్యాతిగానూ । కూతురల్లుడునుండ కోర్కతోనూ । యేతీరునోవచ్చి యెర్రానితేలుదెచ్చి యీతీరేమని వారియిద్దారినడుమవైచె॥ యిందీ॥

పిన్నాపాపాడు నాడుచున్నజూచీ । పెన్నాకడివెడు నింటనున్నదీశీ తిన్నంతకడుపునిండ మిన్నాగనిడగ నసువులున్నావోలేవో తెలియకున్నాది జూపెదాము॥ యిందీ॥

పోయెదమెట్లైన పొలతీమేమీ । మాయదారితో నెటుల మనగలేమూ । మాయన్నలానసుమ్మీ మరువాబోకుము మమ్మా కాయాములేభద్రశైలనాయకునివాని నమ్మీ॥ యిందీ॥

మ॥ మగువా యేమని తెల్పు నీసుతునకేమర్యాదయుఁ లేదుమా
మగవారిళ్ళను తేనిచో దగమమ్ముఁ మంత్రంబునంబిల్చి యో
మగువా న్ననతికేళిగూడుమనుచుం మాట్లాడగాసాగె నీ
జగతింగంటిమె యిట్టిబాలకులనో చంద్రాస్య యేమందుమే॥

సీ మరియునూ.

ద్వి॥ పద్మాక్షిరోవినుపరగనీసుతుడు
సద్మముజొరునని సకలంబుదాచి
తలుపులు దాళముల్దగబెట్టిబోవ
యెలనాగ జొరు జనులెరుగకుండంగ
నొకయింటిలోనాడు నొకయింటిలోబాడు

నొకయింటిలోనవ్వు నొకటలక్షించు
నింతవింతలుసల్పి యేమానొమాకు
నింతైనదెలియదో యిందీవరాక్షి
దొంతులూరికెనుండు తోయజనేత్రి
కాంతుడుగనరాడు కనిపెట్టిచూడు
కడుభాగ్యమున్ననో కమలాయతాక్షి
కుడుతురు ముడుతురు కోర్కెమీరంగ
కొడుకులనిటువంటి కొంటెల జేసి
విడుతురే వాడల వీథులయందు
పడలేమెయిటువంటి బాధలమేము
తడవేల శలవిమ్ము తరుణీలలామా॥

వ॥ అని మరియు ననేకవిధంబుల బాలకృష్ణుని వినోదంబులు మహాప్రసాదంబులని యెరుంగక దూరుచున్న గోపికలకు యశోద యిట్లనియె,

ఘంటారవ రాగం.

ముద్దూకృష్ణునకింత రద్దేలనమ్మా । వద్దూపోగదవమ్మ వనజేక్షణలార॥ ముద్దు॥

తప్పాటడుగులుసేర నప్పానిమీదా । గొప్పాతప్పులు జెప్పనొప్పనుగదా । యెప్పూడు నాదండ దప్పడుగదమ్మా । యప్పాను మీయిళ్ళ చొప్పెరుగడమ్మా॥ ముద్దు॥

వెన్నామీగడయింట నున్నాదిచాలా । గిన్నెలోపలనుంచి మన్నించిలీలా । అన్నాదినుమన్న వలదన్న వాడేలా । సన్నుతాంగులు ముచ్చటన్న నానేలా॥ ముద్దు॥

అయ్యాపాలిత్తురావయ్యాన వినడూ । సయ్యానమాట లందియ్యానేరడూ । వెయ్యాకురేనింద లయ్యానినిజమూ। కయ్యామేలముం దరయ్యానిఘనమూ॥ ముద్దు॥

లేక లేకనుయింతటి కాలమునకూ । శ్రీకరముగ మేలు చేకూర మాకూ । యేకర్మమెరుగాని యీకందునాకూ । తేకురమ్మరద్ది దెల్పెద మీకూ॥ ముద్దు॥

కళ్ళుదెరువనియట్టి కమలాక్షుడెటులా। యిళ్ళలోపలజొచ్చి నెరుగాలేరెటులా । హాళ్ళు హాళ్ళనియంత తుళ్ళిగుకుటిలా । మెల్లభంగులమీకెజెల్లు పొందటులా॥ ముద్దు॥

మేరమాలిమీరు దూరెదరింతా । సారసేక్షణలార చాలునీవింతా । సారెకు భద్రాద్రి సదనూనిచెంతా । జేరకుండమీకు జెల్లదిసుమంతా॥ ముద్దు॥

వ॥ యిట్లు శ్రీకృష్ణుని దూరుచున్న గోపకాంతల శాంతింబొందించి యంతికంబుల కనిపిన తదనంతరంబ బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినెనని యశోదతో విన్నవించిన చిన్నికృష్ణుని సన్నిధికరుగుదెంచి లోకరక్షణకరంబైన యతని దక్షిణకరంబు తనకరంబునం గీలించి యశోద యిట్లనియె.

సీ॥ మన్నేలభక్షించెదన్న మాయింటిలో వెన్న మీగడచాలనున్న దరయ
నన్న సంగడివారలన్నారు వింటివాక న్నెత్తవేమిరా కమలనేత్ర
అనితల్లిబల్కగానల్కుచునోయమ్మ మన్నేలదిసెదన్ను గొట్టు
కొరకునైజెప్పిరికోపించకోయమ్మ యాకొంటినో లేకనల్పమతినో
నమ్మవేనిమరలనాముఖాంబుజగంధ
మమలకమలనేత్రి యానిచూచి
శిక్ష చేయుమనుచు చెలువుప్పగాజూపె
నబ్జసదృశమైన యభవు డొగమూ.
యిట్లుజూపిన

శుద్ధసావేరి

మగువగన్గొనియెను మాధావుముఖముననగ శీతజగమ్ములను। విష్ణుమాయదెగ చేయగావేగమూ । జగముసేతలనగజనేతను తొగల

రాయుని జగముకన్నును నగవిరోధిని తగరుసాదిని ఖగపతిని పన్నగ పతినిదగ॥ మగు॥

దిశలు భూనభవనదేవరాక్షస మానుషపశువ్రజమూలను।పర్వతభూవసనాబ్ధిపురమూలను। కుశికనారదవ్యాస దేవల ఋషులకింనర బిసరుహాక్షుల సుసరిదంబుదతారకగ్రహ విసరముల భాసురముతో డను॥ మగు॥

గాంచి మనముభ్రమించినదోలేక నంచితముగస్వప్నమో। యిట్లుగానుపించ కారణమేమొ। యెంచలేనెటుచుంచు బాలుని కొంచ మగు వదనంబులోనవిరించి సదనముగానుపించె దలంచ చిత్రమటంచు నెంచుచు॥ మగు॥

బాలమాతృడైనబాలుని మొగముసేలీలా విశ్వములుండు। నిజముభద్రశై లేశుడితండు। మేలుగాశ్రీలోలుడై ధరపాలనము శేయంగ దలచెనీలవర్ణు డుబుట్టినట్టిసు బాలరూపుని దలతు నేనని॥ మగు॥

సీ॥ యిట్లుచింతించుచున్నట్టి తల్లికి జగరపుట్టితాముసుపటిపట్టుభంగి
దోచెనంతటకంజలోచన హరిమాయనాచని ప్రేమచే జూచిసుతుని
అంకతలంబున పొంకంబుగా జేర్చి కొంకక పాలిచ్చె కోమలాంగి
దూటుచుగుడిచె నిశాటాంగన స్తనఘటితక్ష్వేళపానకలుషితాత్మ
సంస్థితాఖలజగములు చల్లజేయ
తల్లిముదమొంద శత్రువులెల్లగుంద
పల్లవాభాధరంబెల్ల నెల్లజెంద
వల్లవీజనవదనాబ్జవనజసఖుడు॥

వ. అంతనొక్కనాడు కృష్ణుండుతనయాదుకాళ్ళంలో నాడబోయి ననందసుందరియుందంబుగా మీగడ పెరుగు కడవలంగూడబోసి విస్రంభంబున తరికంభంబునందు రజ్జుపలవరించి పెరుగుదరుచు సమయంబున నిఖిలసద్గుణాలంకరిష్టుండగు కృష్ణుండు వెడవెడగంతులువైచుచు కపటాశ్రుపూరిత నేత్రుండై యమ్మా పాలిమ్మని కృమ్మరుచు మంథానమ్ము కరమునంబట్టిన నమ్మగుడ తల్లిరమ్ము కృష్ణమ్మాయని నెమ్మితోడ కర

మునపయ్యెదజిమ్మి ముదమున పయోధరము వదనంబుననుంచిన గృమ్మి పాలుగుడుచు నతనిశిరము మూర్కొని చుంచుదువ్వుచున్నతరి పొంగా రెడిపాలుడించబోవ బాలునికాంచన పీఠనంబునడించి చనుదెంచిన నతనిమించినకోపంబున నగ్రంబుననున్న వాడిశిల్పచేదధికుంభంబుభగ్నం బుచేసి మిసిమిగలమీగడ మెసగి యాడంజనిన బిసరుహాక్షి విసికి కసి మసంగి బాలుని శిక్షింపదలంచి యక్కడక్కడ వీక్షింపుచు నొక్క యింటను లూఖలంబెక్కి చొక్కంబగువెన్న మెక్కి తనకు మిక్కిలైన నొకముక్క కోతికందిచ్చు చక్కనయ్యను గాంచి మిక్కిలి యలుకచే గ్రక్కునశలగోలకేలనమర్చి బాలా యింతదుడుకేలా నిన్ను శిక్షింపనే లని జాలిచేమాలితిగాని శిక్షింపజాలనా సలునిలుమని గద్దింపుచు వెన్ను నంటిన వెఱగుపడక వెఱగందిన చందంబున నందంబున పాదంబులం దునందెలుమ్రోయన మందమారుతంబు చందంబున డిందుపడకపరచు కొడుకునుంగని కురంగనేత్రి కురులువీడ హారంబులుజార నుదలశ్రమ బిందువులు బొడమ మంజమంజీరకంకణాది విరావంబులు జెలంగకుచ భారంబున కౌనువడంక నీటుగుల్కు పైటచెరం గస్రాగ్రంబున నాట లాడ నిఖిలముని నికరంబుల మనంబులకందని ముకుందునందంజనిపట్టం గమకించిన నతని స్తంభాధికంబులడ్డంబు చేసుకొని గిరకలిడుచు నమ్మా యెన్నటికీలాటి చిన్నిపనులుసేయ నిపుడీతప్పు సైరించి మన్నించవే యని కన్నిరొలుక బలుకుచున్న చిన్నికృష్ణునింబట్టి వెన్నదొంగా మున్నెవ్వరిచే జిక్కవని నిక్కంబుగా దెలిశె నాచేజిక్కితింకెక్కడికేగ దవని ముజ్జగంబులనేలునతని. బొజ్జరజ్జువుచే రోలగట్టినతూలంబులీల నీ ష్చుకొని పరచు సమయంబున నర్జునతరువులడ్డంబైన నులూఖలంబు నడ్డంబుబెట్టి బిట్టులాగిన పట్టూడి ధరంబడియె నపుడు.

సీ॥ అందుండి కృష్ణుని సందర్శనము గోరుచున్నట్టివారలుమున్ను బ్రహ్మ
సుతుశాపనిహతులుశుభలుమణిగ్రీవనలకూబరాఖ్యులునయవిచారు
లంజలిబద్ధులై కంజలోచనుజేరి మంజుభాషణముల మురినుతించి
శాపవిముక్తులై శ్రీపతియాజ్ఞచే నుత్తరదిశకేగిరత్తరిఘన
వృక్షపాతవిపుల రూక్షరావమునిని

నందుడలిగి గోపబృందములతో
పొందుమీఱ తరులసందున మెలగెడు
బంధమోక్షువిడిచె డెందమలరా.

వ. తదనంతరంబెనంమంను వ్రేపల్లెయందు బహూత్పాతంబులం గనియునుండశంకించి గోపగోపికా జనంబులంగూడుకొని శకటంబుల యందుగృహోపకరణంబుల నిడుకొని బృందావనంబునకుంజని సుఖం బుండిరంత.

తోడిరాగం

శ్రీనందనందను సుందర చరితమానందము వినుభూవరా। అం దాముగా గోపబృంద మానసము లానంద మొందించు సత్కందమైత గు॥శ్రీ॥ నంద॥

యమునానది ప్రాంతమున గోపకులతముగూడి లేగలమేపగా। వత్సాధమరాక్షసుడు పగజూపగా। వచ్చి కమలాక్షునగ్రమందేపుగా। వత్స సముదాయములతో క్రీడింపగా। జూచితమయన్న కెరిగించెనే పుగా। వీటిసమముగాదని తంటబాపగా నొక్కకమనీయ్య సాలా ముచేపగా। దీరసమయుంచె వత్సాని బాగుగా। నూరిసమరూపయా గోపసమితి ముదము నొంద కమనియ్య గుణుగనియమరూలు మొక్క శ్రీ॥ నంద॥

బకుడానురక్కసు డకలంకముగ గంతుసుకుమారు మింగద లంచియూ నొక్కబకరూపమై చెంత గాంచియూ। సుకనకనగ భాతిమె న్వంచియు। కృష్ణునికటాముసను చెల్లబొంచియు। మింగనికదిగకను తల్లడించియు గ్రక్కియుక నెట్లనిచింతించియు చెంచునకలంకముగబట్ట గాంచియు। జించెసకలాధీశుడు రాత్రించరు। మెంచి ప్రకటముగను సుర నికరముకరమర్ధిమకరందభర కుసుమములు గురిశిరి శ్రీ॥ నంద॥

అగణితబలుడగు నఘుడన్నమృతి వినిమిగిలినకోపాముచేతను। ముజ్జగములు మింగుటకై తనూతపంనగరూపమును దాల్చివాతను। బద్ధమృగములభక్షించి పూతను। గోపులగమనుచును భ్రమచేతను।

నెగడగవత్పములతోడ మూతనూ। నిల్వఖగవాహనుడు ధృతిచేతను। జొగనెగసి ప్రాణము భద్రనగథాములో జొరవగదీరి గోపకుల్ మిగుల మోదించు శ్రీ॥ నంద॥

వ॥ ఇట్లు మత్సరులైన వత్సాసురప్రభృతి రక్కసులం దును మాడి బృందావనమ్మునన్న గోపబృందంబుల నానందంబు నొందిం పుచు నిందిరేశుం డొక్కనాడు తనసహచరులైన గోపకుమారులం గూడి క్రేపులమేపంజనిచని.

సీ॥ కన్గొనెకృష్ణుండు కమలాగ్రసంచరద్భ్రమర సతీగానబంధురంబు
రంగ దుత్తుంగ తరంగాగ్రడోలికాలాలిత కలహంస రాజితంబు
కమనీయకోమల కమలకల్హారాది సకలసుమామోద సంకులంబు
తాలహింతాలతమాలపల్లవ పుష్పఫలవృతపాదపబహుయుతంబు
మకరకచ్ఛపరాజీవమహితజలజ
వాసమమలాంబుపూరసంవాసితంబు
మంజుకూజాభిరామంబు మహిత చక్ర
సారసనివాసమైన కాసారమపుడు॥

వ॥ అట్టి కాసారతీరంబున జాళువాపుట్టంబుకట్టిన జగద్ఘట్టిసం గడిపట్టులం గూడుకొని తమతల్లులుగట్టిన చల్దులు పల్లవంబుల కరపల్ల వంబుల నిడుకొని మెల్లంబుగా కమలకర్ణికావరణపత్రంబులభంగితనను పరివేష్టించియున్న సమయంబున॥

యమునాకల్యాణిరాగం

గోపాలకృష్ణుడు చల్దులుకోర్కెతో భుజియించెను। క్రేపూలమే పుచు సొంగడిపాపాలదాపునబెట్టుక॥ గోపాల॥

మాటిమాటికి చల్దిజాపి దీటులానూరించియూ। మేటియూరూ గాయకన్నుగీటిమ్రింగియు నోరుజాపుచు॥ గోపాల॥

పెట్టెదారారమ్మురమ్మని పెట్టకనేతామెక్కియు। గట్టిగావే లట్టిమీదికిబెట్టి లేదని మొట్టుచు॥ గోపాల॥

అందరము ఒక పొత్తుయిందు విందురమ్మ్మ రంమనీ । పొందుగా చల్దూలు దెచ్చిన నిందువద్దు పొమ్మనీ॥ గోపాల॥

అప్పాలు బెట్టేను రంమని యొప్పుగా నాకొలానిలో । కొప్పుగా భద్రాద్రినిలయుడు తప్పకరినగె వానిచేతిలో॥ గోపాల॥

యిట్లు చల్దులుగుడుచు సమయంబునా.

ద్వి॥ గోపాలకృష్ణుండు కొమరొప్పగాను
తాపింఛనీల సర్ధాముడైయొక్క
కరమున దధ్యన్న కబళంబువాము
కరమున వేణువు కర మొప్పదాల్చి
శిరమునందున మేలిశిఖపింఛ మొప్ప
సురగణమధ్యస్థ సుత్రాముబోలి
చల్దులుగుడిచెటి సమయంబునందు
చెలికాండ్రు లేగలీ చెంత లేవనుచు
జలజాక్షుతో దెల్పి సయ్యనతాము
నిలువక లేగల నెమకగనందరును
భుజియింపకను లేచి పోవంగజూచి
గజరాజవరదుండు కాపరులార
గజిబిజిబడకుడు కాననం బెల్ల
నిజముగావీక్షించి నీరుద్రావించి
లేగలదెచ్చెద లేవకుడనుచు
యేగెనాజాడ నయ్యింది రేశుండు
అఘుడ దిగాగల యామినీచరుల
మఘభుజానుజుడట మడియించెననుచు
విని ధాతజనుదెంచి వేగంబుగాను
మనమున శంకించి మాధవుమాయ
గనుగొందునని లేగగములనుదాచె
వనమంతయప్పుడు వదలక వెదకి

యంబుజాక్షుడు చింతనటసార సాక
రంబు చెంతకు జేర రమ్యంబుగాను
అంబుజాసనుడిపు డక్కడిగోప
డింభకులనుదాచ దెలిశియుహరియు
మేలు యీలాగు దుర్మేధుడైబ్రహ్మ
బాలుల లేగల పరగంగదాచె
యేలచింతింప నేనెప్పటియట్ల
బాలుల లేగల పగిదిరూపంబు
లీలదాల్చెదనని లీలావతారు
డలరుచు దాలిచె నచ్చుగానపుడు
మచ్చిక తల్లులు మదిసంతసించి
మెచ్చుచునుండిరి మేదినీరమణ
వత్సరంబయ్యెను వనజాసనుండు
వత్సలదాచి శ్రీవరు గాంచెనపుడు॥

వ॥ యిట్లువచ్చి బ్రహ్మ గోవత్సరూపధారియైన శ్రీకృష్ణునిట్లని స్తుతియించె॥

రేగుప్తి రాగం.

శ్రీరమేశ నీచరితముదెలియదు శ్రీకంఠునకైనా। బాలుడ నీచుడ పరమకోపనుడ భారమునీదయినా॥

ధాతననుచు నేసీతిదప్పి నిను చేతనుగా మదిచేతదలచి కంజాతములో దశవత్సరములు భీతినున్న ననుబ్రీతిజూచి కృపచేతదెలుపబడి భూతలసృష్టికి నేతన తిత్వజ్ఞాతుడనగు నాత్రాతఫలంబిడి శ్రీతలోదరీజాతుండైన నాత్రాతగన్నదామాత భూమిలో॥ శ్రీరమే॥

లోకములన్నియు నీకుక్షినినిడి ప్రాకటముగ నీలోకంబులలో నేకుడవయి బహు శ్రీకరరూపులు నైకొని యుండతి భీకరులగు దోషాకరులుండి శుభాకరులగు మునిపాకారుల దోర్వీకముగా పటుధాకశేయు నిను ధాత్రివేద ముల్లోకముగావ శుభాకృతిదాల్చితి॥ శ్రీరమే॥

సలలితముగు నీచరణాబ్జజసజ్జలము పవిత్రము సల్పునుజనులను జలజేక్షణ నీచరితము ధరదుష్కృలి కల్మశధరకులిశమెన్నగను జలజాసన హార శంభురూపముల నిలలోదాలిచి యెల్లజగంబుల గలుగగ జేయను గావ దునుమగానిల శ్రీభద్రాచలపతివైతివి॥ శ్రీరమేశ॥

అని యిట్లనేక ముఖుండనేకంబుగా స్తుతియించి గోవత్సంబుల గోపడింభకుల కర్పించి జనినత్తదనంతరంబా॥

క॥ నందాత్మజుడా క్రీడనా
నందాత్మకుడగుచు కాననంబున గోపీ
బృందములు వినగనడవిని
సుందరముగ వేణువంది శుభముగ బాడెన్॥

ద్వి॥ యిటురామకేశవు లేపుమీరంగ
నటవిని చెలికాండ్ర నాదరింపుచునూ
గోగణంబులతోడ కౌమరొప్పతరిని
భోగీంద్రదమునుని పొడగనిసఖులు
పూతన మొదలయిన పుణ్యజనములాను
ఖ్యాతిగాజంపి విఖ్యాతివహించి
మించిమాకెల్లను మేలుజేశితీరి
యెంచలేమయ్య మీయిరువురిశక్తు
లంచితంబుగ యీవనాంతరమందు
సంచరించును సర్వజనుల హింసించు
ధేనుకుండనువాడు దేవవిరోధి
మానుగాతాళాగ మధ్యంబునందు
సకలఫలంబుల చవిగానివాడు
నకలంకుడైయుండు నటకురానీడు
బలవంతుడగువాని బట్టివధించి
ఫలరసమ్ములనిమ్ము ప్రార్థించెదాము
అనిబల్క చెలికాండ్రు నబ్జాతనేత్రు

దనుజుసమేతుఁడై యటకేగితరుల
ఫలములుడుల్లగా బట్టియూపంగ
జలజలరాలెడు చప్పుడాలించి
కనలుచు జనుదెంచి గర్ధభాసురుడు
ఘనముగారాముని కడకేగితనదు
పదములదన్నియు వదనంబుదెరచి
మదమున గరువంగమూర్ఖున్న వాని
పదములు నాలుగుబాహువులబట్టి
కదలంగనీక నగ్గర్ధభాసురుని
దట్టించిరాముడు తగవానినపుడు
బట్టెర్ఘిరఘిరద్రిప్పిబీరంబుదూల
కాలునిపురికంపి కరమునమొక్క
తాళవృక్షమువీక దాకంగనేయ
నొండొంటిపైబడుచుండి మారుతమున
ఖండితవనమట్లు గహనంబుగూలె
నపుడుగర్ధభు ననుజులేతెంచి
దెప్పరంబున వారిదెసజనహరియు
కప్పుచీకటిద్రుంచు ఖరకరుమాడ్కి
నుప్పుగాదైత్యుల నుర్విపైగూల్చె
వెసఫలంబులువారు వేడ్కభక్షించి
పసులనులెస్సగా పచ్చికమేపి
జనుదెంచెముదమున సారసనేత్రు
దనుజసమేతుఁడై యమరులుమెచ్చ

పంచచామరం

వచ్చినహరింగని మహోచ్ఛయముతోడుత వియచ్చరమ్ముగీద్ర
శుల కెచ్చయినకాంతల్ । మెచ్చుచు సఖాళితో ముచ్చటల
నాడియపు డచ్చుతుడు తల్లికడవచ్చినను ప్రేమన్ । బుచ్చినగు
గల మొగముమెచ్చి తానివిరిశిరమచ్చుపడ మూర్కొనె వడిచ్చ

లూరంగఁ । లచ్ఛిద్రోరజలకంబు విచ్చచేనాడి తడిబుచ్చిచేల
ముదాల్చి భోజనమొనర్చెఁ

వ॥ ఇట్లు సర్వరసోపపన్నంబుగా నన్నంబు భక్షించి యన్న
యుదానును మృదుశయ్యల నిద్రించి మరునాడరుణోదయంబున లేచి॥

మ॥ చెలికాండ్రందరగూడి దక్కహారియుఁ శ్రీకృష్ణుడేగెఁ లస
త్ఫలపుష్పావృతషా వనాంతరముపయఃపానార్థమై గోపకుల్
నలినీబాంధవజాహ్రదాంబుల నానంనిర్గతప్రాణులై
యిలగూలంహరివారించెను దయాహేలాసుధాదృష్టిచే॥

సీ॥ వారలగాచియు వనజాక్షుడప్పుడు కాళీయఫణిచేత కలుషమైన
జలముపవిత్రంబుసల్పగాదలచి యాశ్రీవిష్ణు వెడలంగ జేసెననుచు
బల్కినవిని రాజుబహుగభీరంబగు మడుగెట్లుజొచ్చెను మాధవుండు
కాళీయఫణినెట్లు ఘనశక్తి వెడలించె బహుకాలమందేల ఫణివసించె
యెరుగజెప్పవయ్య యిందిరాహృదయేశు
చరితమెవ్వడైన శ్రవణములను
జాలనేరనట్టి పెద్రులుగలరె యీ
వసుధలోన విప్రవర్యయనినా॥

వ॥ అని రాజడిగిన శుకయోగీంద్రుడిట్లనియె॥

భైరవిరాగం

రాజాగ్రణిఫణిరాజమర్దను కధరమ్యంబుగావినుమూ। యీజగ
ములకెల్ల రాజుగావున దుష్టరాజినణంచు సద్రాజసమొప్పగ॥ రాజా॥

కాళిందిమడుగులో కాళీయుడను దుష్టకాకోదరుడుండి। వాలా
యముగ విషజ్వాలాలచే నీసుగాలిసోకిన భూతగణముసణంచును॥ రాజా॥

వడినేగుఖగములు బడిమగ్గునందూన వసుధచేరించెవంత్తా।
టుడుకుచుండునుదాన నుదకమెప్పుడు వడికడుబొంగుచుండు నందునుదు
గదెప్పుడువేడి॥ రాజా॥

కనుఁగొనిహరిదాని కడుభయమునఁజెంది కలుషసంహారుడంత । జనులబాధించు కుజనుల శిక్షించు సద్ఘనసీలుడాగ్రహ కలితుడైయొప్పెను॥ రాజా॥

ఖలుడగుకాళీయుఁగరయుక్తమై నట్టికాళిందినేఁటిపుడు । సలలితమైనట్టి జలగజేతు భద్రాచలరాముడని నన్ను జనులునుతింపగ॥ రా॥

వ॥ యిట్లని హరితత్తరంబున నున్నకదంబ భూజంబుచెంతకరిగి॥

బిలహరిరాగం.

ఖగరాజవాహుడపుడు కాళింద్రిప్రాంత । నగముపై నెక్కి మొగశిరిదెలుపుచు సొగసుగనురికెను॥ ఖగ॥

హరిపాదసారాసములా కిరువైనయట్టి । తరుపూర్వజన్మకృతధన్యతలేమని గణ్యతశేయను॥ ఖగ॥

కటియందుచేలముజుట్టి ఘనకేశపింఛమటు చక్కజేసి తనదోస్తలములు జరచిదిక్తటమద్రువంగను॥ ఖగ॥

ఉరికి భద్రాద్రిరాముం డురగేంద్రుడు బెదరా। సరసీలోగుభగుభ రావముసయ్యన జలగగనొయ్యన ధుమికెను॥ ఖగ॥

యిట్లధుమికినా

సీ॥ పూతనరిపుపటుపాతవేగంబున దుర్విషభీషణలోయకలిత
భంగపూరితము పైపొంగె ధనుశ్శతమాత్రదూరంబునామడువుతప్త
జలబుద్బుదోగ్రమైచెలియించెమునువార్ధిరాజీవరూపుడై తేజమొప్ప
దారిద్ర్యము నీదుగరిమగల్గుటజేసికాళీయుహృదయంబుగలుగరోష
వహ్ని లెగయ బాహువల్లులనీదెను
తుంగభంగములను దురవలోక్య
మయినమడుగునపుడరివర్గభీకర
రూపుడైన శౌరియొప్పమీరా.

వ॥ ఇట్టిరుసమయంబున కాళియుండుతన మనంబున నిట్లనివితర్కించె॥

బిళహరీరాగం

బాలుడెవ్వడో వచ్చిభయమింతలేక । లీలానీదునువాని కేలాయిగా కాకా । కాళియుండిందున్న వాడని కానడేమో హానియాటను॥ బాలు॥

జలము కల్లోలమై చెలియించె ప్రహ్లాదము । చలముమానక సీద సాగెను ఘనము॥ చులుకనైతిని మద్విషాగ్ని స్ఫురణముల భస్మంబు జేసెద॥ బాలు॥

జనములెపుడు దీనికనుగొనరారు॥ కనభద్రాచలపతియైన దుస్తరము ఘనముగానాకోప మవనినిగానగ మానగా జేసెద॥ బాలు॥

ద్వి॥ అనియిట్లు కాళియుండాగ్రహంబొప్ప
కనులరోషానల కణములుప్పొంగ
కనలుచునంటెను కాశేయవాను
వనమాలికాధారు వనధిగభీరు
ఘనపయోదాకారు కంపవిదూరు
వనమధ్యసంచారు వల్లవీజారు
నంటియంతటబోక నతనిమేనెల్ల
కంటకంబున తనకాయంబునాను
వడిజుట్టుకొనియెను వసుధేశయపుడు
వెడచూపులనుచాల విషమొల్కగాను
భోగిభోగావృతపురుడైనహరిని
వేగంబుగాగని వేడ్కలుమాని
చెలికాండ్రుమనముల చింతించిరిటుల
యిలలోనమాకు దిక్కెవ్వరుచూడ
నెవ్వరడ్డము మనకీవగదీర్ప
కొవ్వునసర్పంబు కృష్ణునిజుట్టు
కొనియెనటంచును గుద్దుచున్నంత
జననాధకావురుచదలను గప్పె
భూతలంబువణంకె భూతముల్ గలగె

నాతతంబుగనుల్కలప్పుడు రాలె
ప్రేతలకును గోపవీరులకపుడు
బ్రీతిలేకుండెను పృధివీశయటను
దుర్నిమిత్తంబుల త్రోవవీక్షించి
వర్ణించలేక శ్రీవరునిశౌర్యంబు
లెక్కడజిక్కెనోయిందిరేశుండు
నిక్కంబుగానని నెవ్వగమీర
నందయశోదలానందంబులేక
గుందుచునపుడు గోపికాగోప
బృందమ్ములనుగూడి బొక్కుచుఘోష
మందుండివెడలగా నప్పుడురాము
డెరిగివారల నూరడించకనుండె
హరిశౌర్యమెరుగుట నవనీశయపుడు
కాంతారవీధిని కడుచింతనేగ
నంతంతయవకులిశాంకుశపద్మ
శంఖచక్రధ్వజచామరశార్ఙ
రేఖలచే శుభలీలలనొప్పు
శౌరిసరోజాభచరణాంకమైన
దారినకాళిందితటమందుజేరి
వారిమధ్యంబున వరమణికాంత
పూరపూరిఫణాపుటభుజగేంద్ర
కాయవేష్టనమున కదలకనున్న
మాయధీశముకుంద మాచిన్నికృష్ణ
రావేమిరాయిటు రాజీవనేత్ర
యేవేళనినుజూడ కెటులుందుమయ్యా
కనులెత్తిజూడరా కల్యాణగాత్ర
యనుచుచీరుచు చాలనలసిచింతించి
దైవంబుదిట్టుచు తడబాటుకొండ

కావరేదేవతల్ కరుణనేదనుచు
మ్రొక్కుచుండిరిగోప ముదితవరులపుడు
చక్కగానుయశోదసాన్నిధ్యమునను.

ఘంటారవరాగం

రారాముద్దులకృష్ణ రాజీవనేత్రా।కూరిమీనాబంగారుసుపుత్రా। పుట్టినప్పుడెవచ్చి పూతానవిసము। బెట్టిచన్గుడిపెనప్పట్లానిమనసమూ। గిట్టకపోదయ్యో నట్టినీకుయీకట్టాడిభుజగముగరమెక్కనే మందు॥ రా॥

పగవారితోడుత పాటయ్యెనజూడూ। నగుబాటులాటకు దగియె నిప్పుడు। జగతిబుట్టిననాటి జన్మఫలంబేమో । పగవారిచేతులో బహుట మానదాయ॥ రారా॥

మోముజూడక నిల్వలేమూ కుమారా । బామూలబడజూడ లేము సుధీరా। మేమునోచినయట్టినోము ఫలంబిపుడేమాయ నింకనేనే మందు నయయ్యో॥ రారా॥

అయ్యయ్యో నినుగన్నప్పటినుండి । దయ్యాలతోపోరు దప్పాక నుండె । ఉయ్యాలలోపలనుంచి యూపుమాని । పయ్యాదబట్టికానయ్య లెవ్వరుమాకు॥ రారా॥

అందెలుపదమూల పొంకుగమ్రోయ । సందీటి తాయితు లం దాముశేయా। అందముగా నాముందరనాడు నీచందాముజూడాక డెం దామునిలువదు॥ రార॥

బాలాలతోడూత బాగూగనాడీ । చాలాప్రొద్దెక్కరా నయ్యాన శలాగోలజూపినే కోపింపగానా । కేలుబట్టి పైకెగసువారెవరింక ॥రా॥

నీవులేనియట్టి నిలయములేలా । గోవులేలను మంచిగుమ్రాములేలా । లావూగ భద్రాద్రి రామూడవైనట్టి । నీవుగావలెగాక నిఖలజగములేల। రారా।

గీ॥ వారలిబ్బంగి బలుకుచు ఘోరమైన
వారిజోరుటకుయుత్నుగా వారిజూచి

శౌరియన్నయు వారించి మీరుమీరెది
దారెరుంగరు భయమేమి శౌరికనియె॥

మ॥ తనపైచూపులునిల్పి గోపకులు సంతాపించుటల్ గోపికా
జనమార్తింబడియుండుటల్ బశువులుంశంకించి గ్రాసంబులం
దినకుంటల్ జనకుల్ మహాభయముచే దిక్కెవ్వరంచుండుటల్
గనియుండెన్ నరుమాడ్కి తాద్విఘటికా కాలంబు భూవల్లభా॥

సీ॥ అంతకృష్ణుడు మేనువింతగాబెంచిన సంతప్తగాత్రుడై చక్రిభోగ
సంతతుల్ జెదరంగ-చాలించి కరచుటల్ నిట్టూర్పు నిగుడించి బిట్టు
శ్రాంతి । జెందియాదలలెత్తి చేష్టలుదక్కి దుర్విషమునాసాసన వీ
ధులందు । గ్రక్కి చింతించి నల్దిక్కులు జూచుచు దప్పినిల్చెను
ధూమదారుకరణి ।

మేటివీరుడు నొక్కచే సూటిజరచి
కంధరముబట్టి ఫణివైరి చందమునను
జరజర విషానలము కళ్ళగురియనెత్తి
లీల జరజరద్రిప్పొకమూలవైచె॥

వ. యిట్లు వేగంబున నాగంబు పీచివైచినందున పట్టిరెట్టించిన
కోపంబున పడగలపై నెక్కి తాండవంబు సల్పెనపుడు॥

మధ్యమావతి రాగం.

తాండావంబాడె కృష్ణుడూ । కాళియ్యాభోగతట రంగాలంక
రిష్ణుడూ । తాండావంబాడె కృష్ణుడు దండశూలేశు ఫణమూల నుందా
రతరముగాను ధింధింధింధింధిమ్మనియనుచును॥ తాండా॥

యమునాకల్లోలా ఘోషమూ । సరస మృదంగసముగ సాధు
బృందావన । భ్రమరాగానాము సజ్జన భవ్యగానముగాగ కమలాయు
తాక్షుడప్పుడు ధిమి తక్కిటకిట ధింధిమ్మనుచును॥ తాండా॥

కలహంసాసారాసరవమూ । తాళములుగాగ బలభేది ప్రభృతి
సురసంఘాము । చెలువాగు సభ్యులుగాగ జలరుహానేత్రు పదముల
జలుగు టందెలరవములు ఘులుఘులుఘులుఘులుఘుల్లనిమ్రోయుగ॥ తాం॥

మాణిక్యస్థగితమైనయట్టి కాళియ్యభోగ మంటాపమూన కృష్ణుడనెటి । మానానియ్యాత్రినటుడు మంజలముగజేతి కంకణములు చెలువుగ ఝుణఝుణఝుణఝుణఝుణ యని యనగను॥ తాండ॥

లోకాములన్ని కుక్షిలోనూ । కుదురూగదాల్చి కాకోదరు నిఫణములాను లోకేశుడపుడు నవ్వుచు పైకస్వరంబున బాడు శ్రీకరముగనాడెను తాకిటకిటకిటతాధిమ్మని యని॥ తాండ॥

సిద్ధాలు సాధ్యచరణాలు । భద్రాద్రివాసుని వద్దికగూడి గంధర్వాలు । దద్దాయునాడ సురలు వద్దికపువ్వుల వానలద్దేవుపైన గురియ తద్ధింమితాతాధింమని యన॥ తాండ॥

వ. యిట్లు కృష్ణుండు తాండవంబుసల్పిన పడగలవిశి యండజేంద్రుండు గుండెజడి తనమనంబున నిట్లని వితర్కించె॥

గీ॥ వేల్పులైన నాదు విషవహ్నిశిఖలచె
భస్మమౌదురెంత బలియొయితడు
విషహుతాశికింత వెరువక మత్ఫణా
శతము భంగమును సల్పెనహహా॥

సీ॥ యీతడు సర్వలోకేశుడ నంత్తుండు ధాత భూతేశాధి నేతగాన
వైరంబుజేసిన పారంబుకల్గునే సూరిజన స్తుతసుకవిచరణ
రాజీవములబడ్డ రక్షించునీతడు తప్పులెంచరు ధర గొప్పదొరలు
భూరికృపాళులు బుధజనాధారులటంచు చిత్తములోన నెంచిశరణు
బొందదలచెటి పెనిమిటి పోడిమంత
వింతగాగాంచి చింతించి వేడియూర్పు
లెసగ పసజెడియున్నట్టి యీశునసువు
లడుగుకొను వేడ్క జనుదెంచి రతనిసతులూ॥

పున్నాగరాగం.

నాగకన్నియలపుడొచ్చిరీ । తమనాయాకు ఫణమూల నర్తించుహరిగన॥ నాగ॥

మొగులశిరులను మిగులుకొప్పులు వగలవిడేవడి దిగులుచేనటు ॥ నాగ ॥

కుచభారమున కౌనులోంణకగా । హారనిచయాముల్ జదరాక పెణ
కగా । రచిత కస్తురి తిలకములు ముఖరాజిపై చెక్కులను జారగ॥నా॥

ముందార కొమకూలనిడుకొనీ । తమడెందామూలను భక్తిగై
కొనీ । యిందిరేశ ముకుంద భద్రగిరీంద్రనాయక వందనంబని॥ నాగ॥

వ. యిట్లువచ్చి నాగకన్నియలు నిటలతటఘటిత కరకమలులై
యిట్లని స్తుతియించిరి.

సీ॥ హరినీవుధరలోన నవతరించుటయల్ల క్రూరులదండించు కొరకుగాదె
క్రూరాత్ముడీతని కోపించుటలుమాకు క్రూరభావముగాదు చారు
గుణము । పగవారిసుతులపై పగయించుకయులేక ఖలులశిక్షింతు
రుగావధరణి । నుగ్రులదండించు టుగ్రకార్యమెమహానుగ్రహంబ
గాకనుగ్రవృత్తి।
చాయజేసినారు పరమతపంబేమి
సల్పెనితడు పూర్వజన్మమునను
పరమయోగులైన పాటించిగననట్టి
పాదపద్మరజము పరగగలిగె॥

పున్నాగ రాగం.

నీరజాక్షా । సురవైరిశిక్షా । నీరజాక్ష మా నేరములెంచక భూ
రికరుణచే బ్రోవవయ్య ఓ ॥నీరజాక్షా॥

మంచివాడనుచు నెంచముయీడి వంచనజేసితి మంచిదిచా
లిక ॥నీర॥

పడగలదిశెయీ ఫణిపతిడస్సెనుఉడిగెను ప్రాణములుంచదలం
చుము ॥నీరజాక్షా॥

నేడ దిగనిక నీపాదంబులతో దుసమ్ములమాదుష్పధమెల్ల డు॥నీర॥
వాసవనుతలక్ష్మీశ భద్రగిరి వాసయేలు నీదానునికరుణను
॥ నీరజాక్షా ॥

ద్వి॥ అనియిట్లు ఫణికాంతలంజలిశేసి
వినుతింపకృష్ణుండు వినిశరగార్థి
జనరక్షణముశేయ జనుననిదలచి
ఫణిఫణంబులమీద పటుతాండవంబు
చాలించె నంతట సర్పంబుమరల
దాలిచి ప్రాణముల్ తడబాటుతోడ
జలజాక్షునిజూచి జాగిలిమ్రొక్కి
యలుకుచుమెల్లన నతడిట్టులనియె॥
జగదీశ ఖలులము చండకోపులాము
తగనిగర్వాంధత తలపోయమాకు
దుర్విషాస్యులము మాదుఃబుద్ధివలన
సర్వజనంబులు సహియింపరెపుడు
నలినాక్ష ప్రాణులనైజగుణంబు
లలవియే మాన్పంగ నబ్జజుకైన
మేలొనర్చితిరయ్య మీకృపచేత
నేలగాదలచిన నేలుముమమ్ము
శిక్షింపదలచిన శిక్షించుమయ్య
రక్షకులెవరింక రాజీవనేత్ర
చిత్తమెట్లగు నటుశేయగాన్ దగును
మత్తారిగజహరి మాచిన్నిశౌరి
నాతపంబెంచగా నలవిగాదయ్య
ధాతాదులకునైన తరముగానట్టి
నీపాదరజమబ్బె నెటులైనతెస్స
పాపాల్ధరియింపబడియె నాచేత
ననివినుతించిన నబ్జాక్షుడపుడు
ఫణితోడనిట్లనె ప్రాణభవంబాప్ప
గోవర్గములు జనుల్ కోర్కెమీరంగ
ద్రావుదురీనీరు తగదింక నీవు

వసియింపనేగుమీా వనధికీవేళ్ల
వసుమతిలో నెట్టి వారలునైన
నిన్ను నేశాసించు నిర్మలకథలు
పన్నుగావిన్నను ఫణివిషజయము
గలుగును కాళింది గతజలస్నాన
ములు జేసి తర్పణములు జేయువారు
సకలాఘములుబాశి సాయుజ్యతాదు
రకలంకముగ నేగుమని యిట్టులనియె॥

గీ॥ వైనతేయుని భయమున వనధివిడిచి
యిందావసియించితివిగాన డెందమునను
సందియంబేల మత్పద సారసముల
చిన్నులుండుటజట్టదు పన్నగారీ॥

వ॥ అని యిట్లు గోపాలకృష్ణుండానతిచ్చిన కాళియుండు తోయ్యలును దానును కృష్ణునకు నవ్యదివ్యాంబరాభరణంబులొసంగి నీలోత్పలమాలిక సమర్పించి పుత్రమిత్రకళత్ర సమేతుండై బహువారంబులు కైవారంబుజేసి రమణక ద్వీపంబునకుం జనియెనంతా॥

యిందు రేశు డానందముతో నుత సుందరమగు మణిసందోహములం
పొందుగ గైకొని డెందమలరమడువందునుండి వెడలందమవారల్
మోదమందె ప్రజమాదరమున నందాదిజనంబుల ఖేదముబాసెా
సాదరమున తనసోదరుతును బిలభేదోపలనిభు బ్రీతి నుతించెా॥

గీ॥ నిష్ఠురంబగు ఫణిచేత నేడువిడువ
బడియెనట భాగ్యమేమంచు బ్రాహ్మణులును
వచ్చియాశీర్వదించిరి వాసుదేవు
నాదినుతుపులనర్పించి రఖలసురలు॥

కం॥ అయ్యా క్రూరభుజంగము
నయ్యెన నినుజుట్టుకున్న సమయంబున మా

యయ్యో యేమని యంటివు
కయ్యారీయని యశోదపయ్యెదగవో॥

వ॥ యిట్లు పరమ సంతోషంబునం జెంది సుఖంబున్న యెడ॥

సీ॥ గోపాలకులగూడి గోగణంబులతోడ కాళిందితటమందు కాంతిమీర
నిద్రియున్నంత నీరజనాభుండు వనవహ్నిజనియించి వసుమతీశ
వారిపైగవిశిన వారింపజాలక వారిజేక్షణుజేరి వారలపుడు
రక్షించుమనివేడ రాజీవనేత్రుండు తత్క్షణంబున ఘనదానవహ్ని

హారుడు బడబానలము మ్రింగుకరణి తనదు
మాయచేమ్రింగె దిశలన్ని మ్రోయజయము
వ్రజముకరుదెంచె గోపగోవ్రజముగొలువ
పటుపరాక్రమశాలి గోపాలమౌళి॥

వ॥ యిట్లు రామకేశవులు బాలవేషంబుల క్రీడించుచున్న సమ
యంబున॥

శా॥ చండాంశుండు గృశించు ధాత్రిగనియుం జెల్వొప్పగా జేతులం
మెండౌ యప్పులొసంగ పూర్ణ యయినం మేలంచు దావేషినం
నిండా మోమటుజూపకున్న మరి సీనీతింకెకా యంచునా
చండాంశూత్తమ దూతనంపెనన గ్రీష్మంబంతటన్ వర్ధిలెన్॥

గీ॥ పవలు బహుళమయ్యె పర్వతవనములు
దవహుతాశిచేత దగ్ధమయ్యె
నదినదంబులింకె నధికరజంబయి
పుడమియందు సస్యపుంజమారె॥

వ॥ అట్టి గ్రీష్మకాలంబున కృష్ణుండు బృందావనంబున నుండు
టంజేసి వసంత సమయంబునుంబోలి పల్లవితకుసుమితఫలితలలిత వన
ప్రదేశంబును, వనప్రదేశజనిత సరసిజముకుళాగ్ర సంచరచ్చరీక సమా
చితానావధూరీకృతనారీజనంబును నైన బృందావనంబున రామకృష్ణులు
గోగణానుచర సమేతులై క్రీడించుచున్న సమయంబునా,

నాటరాగం.

ధరాధిపావన విను మురారిచరితము సురాదులకు బహు చో ద్యముగనుగొన॥ ధరాధి॥

ప్రలంబుడనునొక పలాశనుండటు చలంబుమీరగ జనుదెంచి యుతా । దురంబు శేయగ తరంబుగాదని ధరావరుని యనుచరులతో నాడెను॥ ధరాధి॥

రమావహుడు వానిమాయనుగనుగొని కుమారహితుడై సఖుడా రమ్మని । యమాయికునివలె సఖులక్రీడలు క్రమానసల్పెను కడపట జం పను॥ ధరా॥

హలాయుధుండా యిలాపతియు సమబలాలబంచుకా బలుమో దముతో । శిలా కందుకములలావు బోరినాడియు హలాయుధునితో హరియిట్లనియెను॥ ధరా॥

జయాపజయములు చాలగల్గెనిక వయారముగల్గె పిన్నావాహక్రీ డా । న్నయా సల్పుదామనియొక్కను తాదయాదృష్టి శ్రీరామాఖ్యుని పై॥ ధరాధిప॥

తోయజనేత్రుని తృణావరుడట ప్రమోయగజాలక మోసమందె నని । డాయకరాముని దగ్గరిగొని దైతేయుడు భద్రాద్రీశుని విడిచెను॥ధ॥

వ॥ యిట్లు క్రీడాకల్పిత వాహనుండై ప్రలంబుండు బలభద్రుని గొనిపోవుచూ.

సీ॥ ధరణీధరముకన్న గురుభారమైనట్టి హరియనంగనుగొని వెరచివాడు
మేరుశృంగాకృతి తోరంబుగాదాల్చి శిరినిగొనిపోయె శీఘ్రముననను
హలధరుండనువాని పలలాశియని మదిచింతించి వెరుపక చెదలుముట్టి
గొనిపోవురక్కను కోపంబుతో జూచి శిరము బట్టగలంగ శిరిముష్టి
బొడిచెనంతట వాడును పుడమియందు
పవనిహతి పర్వతముభాతి బడిరొమొదల
రక్తమొలుకంగ వాగ్రబోయుక్తముగను
రాముడప్పుడు విచ్చెతె ధామమునకూ॥

వ. యిట్లు ప్రలంబుని వధియించి వచ్చిన రాముని౦గని సురలు కుసుమవర్షంబుగురిసి రంతనిశానమయంబగుట బలరామకృష్ణులు వేణునాదంబులు జెలగ గోపజన జేగీయ్యమానులై గోష్ఠంబుప్రవేశించి సుఖంబుండిరంతా॥

క॥ వర్షాగమంబు హెచ్చెను
కర్షకమనములకు సర్వకాలమదమగుచున్
హార్షమయి చాతకాళిక
మమర్షంబయి హంసపంక్తి మదిభీతిల్లన్॥

శా॥ కాంతారంబులదావ వహ్నులరిగెం కాదంబనీజాలముల్
వింతై దక్షిణగాములయ్యె మెరుపుల్ విత్తేశునాశందగన్
సంతాపంబులుబాశె భూజనులకుం శక్రాయుధంబస్తగి
ర్యంతాశంగనుపట్టి మారుతము పూర్వాశాభవంబైదగన్॥

సీ॥ రాజహంసలచిత్తరాజిభీతిల్లెను రాజహంసలచిత్తరాజియలరె
పద్మాకరములన్ని పరిపూర్ణతవహించె పద్మాకరములన్ని ప్రభర
హించె। వనచరాళికినెల్ల వైభవంబైదోచె వనచరాళికి మనోవ్యధ
జనించె। ద్విజరాజకరములు దీనతవహియించె ద్విజరాజకరములు
దిశలుమించె।

సస్యములు నంకురించె ప్రశస్తముగను
నదులు ప్రవహించె పాంధహృద్వ్యధజనించె
తనదుకరముల రవిగాలిన వనముమరల
నిచ్చెననగను జగతిపై హెచ్చెవానా॥

అట్టి వర్షాకాలంబునా॥

మధ్యమావతి రాగం.

వనజదళాక్షుడుగన బృందావనమున మేలుఘనాఘనమైరయొప్పెన్। ఘనమునిజన సంఘంబను చాతకగణము ముదంబునగనుగొని వేడగ॥వ॥

విన మోహనమా వేణునాదమట ఘనగర్జితమై కమనియ్యంబగు తనహాసము సౌదామినిగా శిరమునగల పింఛమ్మును హరిధను వుగ॥ వనజ॥

కరుణారస దృక్కాంతిసుధారస కణములువార్షిక కణములు గాగ । వరభద్రాచలహరి మునిచాతకదురవస్థల బోద్రోలగజాలిన ॥ వనజ

కం॥ శ్రీవల్లభుడయ్యనుతా
నావులవృషభములలెస్సనచించె శుభం
బావహిలవర్ష సమయ
శ్రీవనితను బూజచేసె చిరతరభక్తిన్॥

వ॥ యిట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు బుచ్చెనంతా.

కం॥ వచ్చెశరత్కాల ముతటి
దుచ్చయములుబాయ నురుములు దుగవనముల్
హెచ్చుగ జొంపములైదగ
విచ్చెను మేఘములు గగనవీధినరేంద్రా॥

ఉ॥ రాజు దివంబునన్మెరశె రాజులకెల్ల మహోత్సవాదినీ
రాజన సంతతుల్ జెలగె రాజసహోదరి శారదాంబికా
పూజలుధాత్రిపై జనులు పొల్పెసగన్ సకలార్థసిద్ధికై
రాజకులీనజేసిరి ధరాపతులుం జయయాత్రలై రొగిన్॥

అట్టి శరత్కాలంబునందూ॥

గీ॥ అలరువిలుకాడు తనచేత చెరుకువిల్లు
బూని కరకమ్ములైదును దానగూర్చి
మానమువహించు బలములబూని విరహి
జనజయార్థము వెడలెను జగతీయందు

వ॥ అట్టి శరత్కాలంబున గోవిందుడు బృందావనంబున గో బృందమ్ముల మేపుచూ.

రేగుప్తిరాగం.

వేణునాదము జేసెను । గోపాలుడపుడు విబుధాలునుతిశేయ

నూ ! వేణునాదము జేశె కృష్ణుడు నాదైకముగ గ్రావ్యాగ్రమ్మందున పాణి చేకాళిందితీరజ వేణువందియు జాణతనమున|| వేణు||

కర్ణావతంస్సిత కర్ణికారశోభగండ భాగద్యుతిగడలుకొనగ తన ! వర్ణనియ్యా భ్ర్యావిలాసము వామభాగానతే మొగంబునజెన్ను మీరగ వామకరమున చెలువుగావంశము ధరించియు । అపటికరమ్ము దులాంగుళి చతురత్వమేపుమీరగ స్వరము లింపుగా బాడుచు । డాపదంబున భద్రనగపతి సాపినిల్పిన పదనఖద్యుతి శ్రీపయోజాతాక్షి యురమున శ్రీపటీరము చెలువుదెలుపగ|| వేణు||

వ|| యిట్లు హరివేణునాదంబుచేశిన మారవికారహేతువగు తద్గీతమాలించి గోపికలు మక్కువయి పిక్కటిల్ల చిత్తంబులనుత్తలపడుచు తమతమ పొత్తుకత్తెలుందామును పదుగురేగురు తుటిములు గట్టికొని బిలిబిలి ముచ్చటలకుం జొచ్చెరపుడూ.

కాంబోది రాగం.

చూచితివాచెలియా నీవూ । సుందరాంగుడైన శౌరిని । భాసురముగ వేణునాదము జేసుచున్నాడాల వెంబడి|| చూచి||

చక్కరాకన్నాను మిక్కిలి చొక్కమా తనయధరామృతముచే మిక్కిలి వంశామునింపుచు సొక్కజేసె మనలందరిని|| చూచి||

రాజీవనేత్రిరోవినవే । రమ్యమైన బృందావన । భూజాములుపల్లవింప పొల్పుగా బాడుచుంనాడు|| చూచి||

సవ్యాపసవ్యములాచే సరభమైన భ్ర్యావిలాసముచే । భవ్యమైననటునీ భంగి బాగుగానాడూచున్నాడు|| చూచి||

చిత్తామునిలువాదునాదు చెలియ కృష్ణుని వేణునాదము । మెత్తాగ వీనులసోకిన తత్తరించు నేనేమిశేతు|| చూచి||

వాతోడూతా రాజేనీవూ । నలినాయతాక్షి కృష్ణుని । ప్రీతితోడబల్కరించి ప్రేమ భద్రాద్రినిలయుని గలిపెద|| చూచి||

మ|| అనియిబ్బంగినిబల్కి గోపికలు కామానందమింపారగా
జని గోవిందునిడాసి మూర్ధసములం సంతుష్టులై నందనం

దను నాలింగనమాచరించి పిదపఁ దామోదరుఁ రాముని
గని యానందముతోడ నీట్లనిరి తత్కాంతామణుల్ ప్రీతితోఁ॥

కాంబోది రాగం.

చెలులార గనుగొంటిరే। అలరువిల్తునికన్న చెలువైన రూప
ముల విలశిల్లుచున్న మనబలరామ కేశవులు॥ చెలులార॥

నలిననీలోత్పల వనమాలికావస్త్ర కలితులై శిఖ పింఛ కమని
య్యులై విలశిల్లు గోష్టమను విశదరంగమునందు కలిమికవయానటా
కారులా ధీరులను॥ చెలులార॥

పలుమాటలింకేల పరికింపగావినుడు యిల నేత్రయుగమున్న కలి
మిమనకూ। బలరామ కేశవుల బరికించుటయెసుండి యిలనింతకన్న వే
రేల జన్మఫలంబు॥ చెలులార॥

మనకింత లేకుండ వనజాక్షు కెమ్మోవి ఘనసుధారసమంతా కాం
క్షగ్రోలీ। పెనుమ్రోత మ్రోయు నీఘనవంశ మేమేమి తనపూర్వజన్మమున
తపమాచరించినదో॥ చెలులార॥

కాళిందిజలముచే గన వేణువింతయ్యోగాన భద్రాద్రీశుగాంచి
ప్రేమా। కేళిసల్పును హంసపాళిరావము పాటనాళీకపుల కూర్మిజాల
కరములుగాగ॥ చెలులార॥

క॥ హరిభక్తుని కులజులు
పరమానందంబునొంది బాష్పాకులుతా
వరుసతను పూదేనియ
లరిమురిగురుసునదె గంటిహరి గానముచేఁ॥

పున్నాగ రాగం.

వింటివా వో చెలియా। యీముద్దుకృష్ణుని గంటివా వో చెలి
యా। వింటివాకాళిందితటి నాతోంటిజ న్మపునోముఫలముల పంటచే
జన్మించినను యీ వెంటనానుదు శౌరి యధరము॥ వింటి॥

కాళిందితటినా వేణువై పుట్టినజాలు నింతటిసా। బాలరో నో
పాలునధరముగ్రోలు వంశముగాగ నిలసేలీల నోమగవచ్చునో నవలీల
నో మెదదెల్పుమమ్మక॥ వింటి॥

వనితికృష్ణుడు ఘనమనీ । యీ వేణురావము వినియు గర్భితమ నివనీ । గను మయూరములాడుచున్నవి కాంతరో హరిపాదచిహ్నిత వనము సురపురికన్న మిక్కిలి వజ్రయుగములచేత భాశిలు॥ వింటి॥

సురపురంధ్రులిప్పుడూ । నాకసమునందున వరులగూడుకా నొప్పుచు మురళిరావము చెవులసోకిన మరచిమేనులు నీవులూడగ వరులయంకములందు వివశత వ్రాలిశిగ్గులు మాలినారదె॥ వింటి॥

కానలోపలి మృగములూ । వేణు రావామృతము గానమున గాబోలూ । మేనులెల్లనుమరచి చూడ్కులు మానుగా భద్రాద్రివాసుని మేననిల్పెనుగాన చతురతలేని జాతుల భ్రమజేశెను॥ వింటి॥

ద్వి॥ కనుగొంటివేనీవు కంజాయతాక్షి
వనజరథాయక వజ్రాంకుశాది
వనిలోనకృష్ణుని వంశనాదంబు
విని వత్సములుపాలు విడిచి దూటకాయును
కనురెప్పవెయ్యక కంజాయతాక్షు
గనుగొని గోవులకరమొప్పగాను
వినబడగను హరి వేణురావంబు
మోముల ఎత్తగ బహు మోదంబుతోడ
రోమందములుమాని లోకేశుహృదయ
కమలంబులనునిల్పి కమనియ్యముగను
విమలగానామృత వృష్టిదేలాడు
కనులనానందాశ్రు కణములురాల
గనగబ్రతిత పశుగణములభాతి
గనుపట్టుచున్నవి కంజాయతాక్షి
వినుమేనుజెప్పెద విశదంబుగాను
ఖగములు వీనులగాన మాలించి
నగములపైనెక్కి నలినాయతాక్షి
రూపంబు హృద్వీధి రూఢిగాదాల్చి
యేపుమీరగను సర్వేశునిజూచి

మునులకై వడితాము ముదమునజొక్క
గనుగొనవెనీవు కరిరాజయాన
ధారాధరములు శ్రీధరునిరూపంబె
సారంబుగావిని సరసపుష్పముల
వానలుగురిశియు వరుసతో తనదు
మేనుఛత్రంబుగా మింటనుజేసి
నీడగావించెను నీరజనేత్రి
చూడుము చంచిత సుందరులాను
మంచిఫలంబులు మమతతో చేత
నుంచుకా తమకొను లాటాడగాను
శౌరికిచ్చెదరదె చంద్రాస్యగనుము
వేరేలజెప్పగా వెలదిరొగిరులు
జలములయ్యెనుజూడ జగతీ జలములును
లలితపల్లవములై రాజిల్లెగనుము
శౌరిగానామృతము సారాప్తివలన
వారిజాననలార వత్తురేచూడా॥

వ॥ అనియిట్లుబృందావనంబున విహరించు గోవిందుని సందర్శించి మందయానలు కందర్పబాణభగ్నహృదయలై యేకాంతంబున తత్పరతంత్రలై యుండిరంతా.

సీ॥ ఉదయించినది మొదలుగ్రాంశుడస్త్రాద్రి కురుకుటచేదక్క ఖరకరత్వ
మంబినాధుడౌ శంభుడు ఫాలమందగ్ని దాల్చుటదక్క నుగ్రశబ్ద
మహీరాజశాయు శ్రీమహిళాకుచాద్రుల దాపుజెందుట సర్వవ్యా
పకత్వ। మమరేసురేంద్రుడు మహికిక్రొడైవచ్చి కూసెను చవిచేత
గాసిజెంది।

యిట్టివారలు చవిచేత గట్టబడిరి
గట్టితనమేలనని జనులట్టివణకి
చెలుల చనుగట్టులను చాటుచేసుకొనుట
మనిమొ గాకున్న జగమంత మడియకున్న॥

గీ॥ హిమముచేత హరుడు శ్రమమునొందగ లేక
మేన హస్తిచర్మమూనె గరళ
మూనె భస్మమంత మేనదాలిచె దాన
దరుగకున్న చలియె తాపు జేసె॥

వ॥ యిట్లు నితాంతంబైన హేమంతకాలంబున తొలుదినంబున నందుమందగల మందయానలందరు ప్రొద్దున మేల్కాంచి కాళిందీతటంబు జేరి యందు జలకంబులాడి సైకతంబున కాత్యాయనీరూపంబు జేసి పరిమళితకుసుమంబులర్పించి, శ్రీగంధంబలంది, ధూపదీపంబులిచ్చి బహు విధోపహారంబులు సమర్పించి తల్లీ ముల్లోకంబులకు వల్లభుండగు యదువల్లభుండు మాప్రాణవల్లభుండైనవాడు నుల్లంబులుపల్లవింప కొల్లగా పాలనేత జల్లులాడి జాతరసేయుదుమని ప్రీతిపూర్వకంబుగా చేతులెత్తిమ్రొక్కి మాసవ్రతంబు సల్పిరంత.

క॥ కాంతాజనంబులందరు
సంతసమున నుదయవేళ సంరంభమునం
వింతగ నలంకరించుకొ
చెంతల సఖయలనుజేర జేరుచు వేడ్కన్॥

సీ॥ యమునాతటము జేరి యబ్జాతనయనలు పద్మాక్షు బాడుచు పరమ
భక్తి। విజనస్థలంబుల విడిచియువలువలు లొంకులైతమకెందు శంక
లేక । వనజాక్షు బాడుచు వనములలోజొచ్చి వనవిహారము శేయ
వనజనాభు। డతిదూరగుండయ్యు నదియొరుంగుటజేసి చెలులగూడి
యువచ్చి చెలువుమీర ।
కదలకుండనిహారల కన్నుసన్న
నిల్పి మెల్లనపదమిడి నీరజాక్షు
డదనుగోరుచు యడయడ నాచిలేచి
డాసి వలువలు దొంగిలె భాసురముగ.

కాంబోది రాగం.

వలువలంది కృష్ణుడపుడు వనుమతీజమెక్కెను। చెలులరాకుడనుచు తనదు చేతిసన్నల నిల్పికాంతల॥ వలువ॥

మదగజేంద్ర గౌరవమున మంజులంబుగా । మదవతీలలామల యభిమాన పేటికలైనయట్టి॥ వలువ॥

గోపకాంతలు పండుగలను కోర్కెమీరగా । శ్రీపతినిగూడు వేడ్క చెలువుమీరగ దాచికట్టి॥ వలువ॥

ఘోరు పదసరోజ మంజీరలగ్నవి । స్వారసారసాంచలామ వార ఘటితమైనయట్టి॥ వలువ॥

ప్రణయకలహమునను పతులు పరగ వేడగా । రణము శేయ భద్రశైల రామచంద్రుడు గొన్నయట్టి॥ వలువ॥

వ॥ యిట్లు వలువలుగొని మహీజంబెక్కిన కృష్ణునింగాంచి యంచయానలిట్లనిరి.

ఘంటారవం.

వలువలుగొనిపోవవద్దు శ్రీకృష్ణా । చెలులమానములుగొన జెల్లదు శ్రీకృష్ణ॥

యిలనుపురుషులు జలరుహాక్షులు జలములాడేటివేళవచ్చియు చలముచే వస్త్రములుగొన్నను చులుకనౌదురు బుధులసభలను॥ వలు॥

బహుజీవనముతోడ భాసిల్లుటిదియో । అహాహా గోత్రమునిల్పి హర్షించుటిదియో । మహియుద్ధరించుటా మనుజసింహమ్మవయ్యు నహితుబలినిబట్టి యరికట్టుటయొగాక । బహుగజరాజుల గెల్చుటోయిది పరగగా గురునాజ్ఞశేయుటా బహుబలప్రఖ్యాతి గాంచుటా భళి ప్రబుద్ధత కల్కితనమో॥ వలువ॥

కొంటివి వలువాలుగొంటివి మమ్మా గొంటివి మనములు గొంటివి శిగ్గూ । గొంటివింక నేమికోర్కెగలదో నీకు వంటారిగావచ్చి వన గూర్పజూచెదు । యింటివారలువిన్న నీ మాతంట శాపగజాతు రింతట కొంటెతనములుమాను నిన్నిక కొంటెవని యెరిగుంటిమయ్యయో॥ వలు॥

రాజాస్యలమమ్ము రాపాడుటది యేమి । రాజధర్మమ్మునీకు రాజీవనయనా । రాజాన కెరిగించి రాజెల్లునా నీవె రాజవెధరకెల్ల రమ్య

భద్రాద్రీశ ! తేజమానీవిట్లు జేదన భూజనములో పిన్న పెద్దలు పూజని య్యెడ వనరుకాంతలలో జరించిన రాజసంబటె॥ వలువ॥

మ॥ అనియిట్లంగనలాడినన్విని మహాహర్షంబుతో నందనం
దనుడా సుందరులందరున్వినల సన్మందస్మితాస్యుండునై
య్యనియెం భామినులార దూరెదరు మీాయందేమి నేరంబులే
దని నాచెంతకువచ్చి పుచ్చుకొనుడే నట్లిచ్చెదం చేలముల్॥

వ॥ అనినవిని యండజయాన లొండొరుల మొగంబులుజూచుకొని మనోత్ఘాటనంబులగు మాటలకు మారుబల్కలేక నగ్గలంబైన సిగ్గుచే కంఠప్రమాణ జలంబునందుండి డోలాయమానమానసలై యిట్లనిరి.

సీ॥ మాచేలములుగొన మర్యాదయేనీకు మహినల్పుడవె మరుగుగలదె
కాంతాజనంబులు కడువేడ్కజలకేళి సలుపంగవత్తురే జగతిపురుషు
లటువచ్చిరేనియు యిటులవింతలుశేయ కుటిలురైదలతురే కువల
యమున ! మటుమాయలెన్నన్నొ మరినీదుతలబుట్టె హాటమేల నీ
తోబ నయ్యకృష్ణ !

వచ్చెదము చీరెలివ్వుము మచ్చికలర
నిచ్చెదము నేమిగోరిన యెటులశరణు
జొచ్చెదము జొరుమన్నను సొబగుమీర
మెచ్చి కృపశేయుమయ్య యో సచ్చరిత్రా॥

ద్వి॥ అనియిట్లుబల్కిన నంతకృష్ణుండు
వనజాక్షులార యోవల్లభుడధిపు
డౌటకీతపము మీారాచరించెదాగు
కౌటిల్యమును లేక గట్టిగదెల్పు
డెవ్వనిపైకోర్కె లెవ్వాసుమీాదు
జవ్వనంబునకెన సరసుడెవ్వండు
యెవ్వనిపైమోహ మింతగామీాకు
నివ్వటిల్లెదుకూర్మి నెమ్మదితోడ

నెరుగంగ జెప్పరే యేనన్యుఁడాన
మరుగేలనన్నను మదిరాక్షులపుడు
మాకుబల్కఁగలేక మారునిబారి
జేరియున్నంతట చెలువుడిట్లనియె
నాకుదాసులరయ్య నాయాజ్ఞమీరు
గైకొనినడచిన కమలాక్షులార
నంబరంబులుమీకు నపుడేనిత్తు
నంబువుల్ వెడలిటు లరువుండనిన
చలిచేతవణకుచు జలజాతముఖులు
నిలువనేరక సామినీవేయటంచు
వెడలుదమందరు వ్రీడచేనొకరు
వెడలగూడదటంచు వివశులైచాల
తడబడుచుందురు దయమాలెశౌరి
వెడలకుండిననింక విడుచునామనల
తడవేలమనదె యీతప్పనువారు
కడువేడ్క వెడలిరి
సరగున జాణతా సఖియలముందు
నిడుకొని నవ్వుచు నీరేజనాభు
కడకేగిముందట ఘనఘనాంతస్థ
శంపాలతలభాతి చెలులుండజూచి
సొంపుగుల్కుచుబల్కె శుభచరిత్రుండు॥

కేదారగౌళ రాగం.

శిగ్గేలనిటువచ్చి శృంగారవతులార చేలాముల్ గొనిపొండీ। కర ములెత్తియు చెలగుచు మ్రొక్కండీ। శిగ్గులేలనే బాల్యమాదిగ నగ్గు లేకను నాతోనాడరే తగ్గనాథుని గోరకిటువలె మొగ్గుగల్గిన వ్రతము శేతురే॥ శిగ్గేల॥

మొగుగాన మీమర్మమెపూడు మీలోన దిరుగుచుండుదు నాకు దెలియకుండగ మీరు। సరగునను వ్రతనిష్ఠలై యిటుజొరుదురే జల

ములను చీరలుదనుల బెట్టియు పరులగానక మరతురే తమ మానుమం
బులు॥ శిగ్గేల॥

మీరాకాత్యాయని వేలరా దప్పగ జేసి యారీతి నెరామెద రా
రాడిజెందగ। గోరుడిక నన్నైన మీరలుగొబ్బునను వ్రతఫలములిచ్చె
దను సారసాక్షులు కరములెత్తిటుజేరి మ్రొక్కిన చీరలిచ్చెద ॥ శి ॥

అనినాకృష్ణునిజూచి ఘనవేణులందారు వనజాక్షుదర్శించ వ్రత
ఫలంబులు నబ్బు। ఘనుని శ్రీభద్రాద్రినిలయుని కరుణగల్గిన నేమియు
నికరవనజములు శిరమునను జేర్చియు వచ్చిమ్రొక్కిరి సచ్చరిత్రలు॥ శి॥

సీ॥ వచ్చిమ్రొక్కినయట్టు సచ్చరిత్రలజూచి లచ్చిరేడెదలోన మెచ్చివలు
వ। లిచ్చియిట్లనియె మీయిచ్చయెరుంగుదు పచ్చవిల్తుకు కోపమె
చ్చి శరము। గ్రుచ్చి బాధలశేయజొచ్చిన ననుగూడనిచ్చగల్గెను మి
మ్ము వచ్చునేల। చెచ్చెరమిముగూడక మచ్చికతో మత వచ్చెదచం
ద్రిక లెచ్చినపుడు।

ననుచువారలతో బల్కి వనజనాభు
డంబరంబులు కృపశేయడంబుమీర
కంబుకంఠులుదాలిచి సంబరమున
నంబుజాక్షునిజూచుచు నరిగిరపుడ ॥

వ॥ తదనంతరంబ యొక్కనాడు శౌరికాంతారతీరంబున గోగణం
బుల మేపి నీరుద్రావించి తరుల నీడలనున్న తరి గోపకుమారులాకలిగొం
టిమని విన్నవింప జన్నిగట్టుల వన్నెలాడులపై వెన్నుండుప్రసన్నుండై
యిట్లనియె నీవనంబున చతురానన సదృశులగు విప్రులాంగీరసాహ్వ
యా సత్రంబున సల్పుచున్నవారు మీరువారికడకేగి మాపేరులుగ్గడిం
చితిరేని మీకోరికె లీడేరుననిబంపినంజని విప్రోత్తములారా యీ
కాననంబున బలరామకేశవు లాకలి యన్నంబుకయి మమ్ముబంపిరన
వారలనుకంపలేక తెంపరులయి యన్నంబుబెట్ట సమయంబుగాదనిన
మరలి వచ్చి విన్నవించినవారి భార్యలనడుగుమనిబంపిన వారలే తెంచి
విప్రభార్యలతో విన్నవించిన నాయంచయానలు దంచితసంభ్రమంబు

న పంచభక్ష్య పథార్థంబులు కుంభంబుల నిడుకొని

రేగు ప్తిరాగము.

వచ్చిరప్పుడు వేగవనజాతనయనాలు వైభవములుమీరగా । మచ్చికలరగ మగలుబిడ్డలువచ్చి యడ్డమువలదు వలదన ముచ్చటించక నడులు వార్ధికి నచ్చురీతిన సచ్చరిత్రలు॥ వచ్చి॥

వనచరూలకు ముఖ్యవాసా శోభనాశోకవసుమతీజముకిందనూ । తనచెలికాని పై దయమీరమొక కరవనజాతమునుంచీ । వనజామొక్కటి వేరుకరమూనదాలిచి వరలీలనుచూచుచునూ । ఘనముగాకొప్పునకు నందనికాలమేఘ సమానమా ముంగురులు మొగమునుచంద్రుపై పైబొరలుచుండెడి హరినిగనుగొన॥ వచ్చి॥

పసిడివన్నియగల పటముచెంగులుపోసి మిశిమిమీరగగట్టియూ । నళితాబ్జములిరు దెస కర్ణపుటములకొస బాగుగబెట్టియూ । పసమీరతలచుట్టు వెసకేకి పింఛాము శశిమీరగాజుట్టియూ । కిసలయంబులు పుష్పములు పొల్పెసగదాలిచి వీనులందున రసికుడాభద్రాద్రి నిలయూని రాజసముగనుగొనగ వేడుక॥ వచ్చి॥

గీ॥ ఇట్లువచ్చి కాంతలిందిరేశునిజూచి
హృదయజనితతాప మొదవకుండ
నతనిరూపమెల్ల నాలోకనములచే
దావిశాంతలయిరి దైతలపుడూ॥

వ॥ యిట్లవారితకామలయివచ్చిన వారిజేక్షణలంగనుంగొని హరియిట్లనియె.

కేదారగౌళరాగం— లెవ్వడుశీలంబులెవ్వడువహ్వా.

వచ్చితిరా నన్ను జూడ వనజాతనయనలార । యిచ్చేదగోరూడి మీరలకిష్టార్థముతెవ్వైన॥ వచ్చి॥

మచ్చకంటులారా మీకోటి సచ్చరిత్రలుగాంతురు నాసేవమెచ్చినామది నిహపరములిచ్చి వరాల మెచ్చుచుందు॥ వచ్చి॥

మంగళామే మీకిపుడు మగువలారా మీరేగుడింఢ్లకు । మగ లుమీతో యజ్ఞసంపూర్ణము మమతతోయాగోరియున్నారు॥ వచ్చి॥

అనియిట్లూ శౌరిబల్కగ నంగనాలందారువిని । వనజాక్షాయి। టులా బలుకావచ్చునా మాయెడనదీ వచ్చి॥

మగలు బిడ్డాలు సోదరూలు మమతాలో మాకడకూవచ్చి తగను మీరేగనన్ను మీపాదతామరసముల దరిచేరితిమి॥ వచ్చి॥

మగువలాయిాలాటి వాడీమాటాల నాడాగదగునా ॥ తగదు దాసీజనులగామమ్ముదలచికైకొను మనవినియిట్లనియె॥ వచ్చి॥

నావద్దానున్నారు మీరాని నాథులుగారు నురలు మిమ్ము। భావింతురు నాయంగసంగము భవ్యరాగజనకముదలప । గావునాభద్రాద్రివాసు కైంకర్యాధ్యానా కర్ణనగానములను మానసములబూని నన్ను జేరెదరటుపై॥ వచ్చి॥

సీ॥ యిట్లుబల్కియు శౌరియింతులుదెచ్చిన భక్ష్యభోజ్యంబులు పాయ
సములు। చెలులగూడియు తానుచెలువొప్పభక్షించి చెలగుచునుండె
నుశ్రీశుపేరు । నుడివి భిక్షముపెట్టను నుడుగని కైవల్యఫదము నొందు
మరండ్రుప్రాజ్ఞులెల్ల । నట్టిశౌరికిభక్తిబెట్టి యన్నము తమదారలు
మిగుల కృతార్థులగుట

యెరిగివిప్రవర్యులేకాంతములచాల
చింతనొంది తమరువింతజెంది
కంతుజనకుమాయ సంతరించగనెర
మింతజడులమైతి మెటులననుచు ॥

ద్వి॥ అయ్యాయోమనకింత నజ్ఞానమేల
తొయ్యలులతోసాటి దూగలేమైతి
మెటు హరిగాంతుము యేమిదుర్మార్గ
నటులమైతిమి మననైష్ఠికంబేల
తపమేల వ్రతమేల ధర్మంబులేల
కపటాత్ములకు యజ్ఞకర్మంబులేల

జపదానకర్మముల శేయనికాంత
లపరిమితంబైన యట్టి కైవల్య
పదవిజెందిరి భక్తిప్రాబల్యమునను
అదిలేక చపలత హరిగానలేము
యెవ్వనిమాయచేనఖల మునీంద్రు
లివ్వసుంధరలోన నింపారమోహ
బద్ధులైయుందురప్పంక జనాభు
బుద్ధినెరుంగని పురుషాధములాను
మోహపెట్టకయున్న మురహరుమాయ
యేహరియాజ్ఞశు డెవడు మంత్రంబు
లెవ్వ డింద్రాదుల కీశుండువాని
కేముత్రొముక్కెదమిపు డింది రేశునాకు
ప్రేమతోననుచునూ పృథ్వీశుపర్వు
లాతరిగాంచగా నరగకకంన
భీతులైయుండిరి ప్రేమతోనధిపా॥

వ॥ తదనంతరంబ సర్వదర్శియగు హరియింద్రయాగంబు శేయ నుద్యోగించి ॥ తనతో విన్నవించవచ్చిన నందునితో హరియిట్లనియె ॥

మ ధ్య మా వ తి రా గం.

అయ్యయాగము శేయ నాయత్నులైనార లియ్యాగమున ఫలం బేమయ్య దీనం । జెయ్యదగినది యేమి శేయసాధన మీశుడయ్యెండు వాడెవండాగమోక్తంబో॥

శాస్త్రీయమో జనచారమో యిదితెల్ప నెయ్యంబుగా నాకు నెరిగింపుమయ్యా । శాస్త్రమూవ్యంబైన సర్వకర్మంబులు సత్ఫలంబుల నీవుసద్గతియు లేదూ॥

అనియిట్లుబల్కు తన తనయుగన్గొని నందుడనియె పుత్రకదీనిక ధిపుడమరేంద్రుం । డనిశంబున తనాజ్ఞనంగీకరించి భువిఘనముగురియు ను దానగలుగుసస్యంబు॥

సస్యంబుఫలియింప సకలధర్మార్థకాంబుతో లెస్సగలుగును ప్ర జలుడస్సకుండెదరూ । నశ్యులయి యింద్రునకు వసుమతీశ్వరులెల్ల నై శ్వర్యకాములయి యాచరించెదరూ॥

కామలోభద్వేష కలితులైరెయెవరేని యీమఘము .శేయుకను యిలనుండిరేని । కామించి యశుభంబుగల్గు వారికిపుత్ర నీవడుగజెప్పితి ని నిశ్చయమునమ్మూ॥

కం॥ యింద్రుండు సంతసించిన
సాంద్రముగా వానగురియు సకలోర్విపై
ల్పొందగ కసవభివృద్ధగు
మంద్రరధరకసవుమేసి మనగోగణముల్॥

చం॥ ధేనుగణంబుమేసి బలుతేజమునొందిన పాడిగల్గున
ద్గానిని మానవుల్ సురలుతాగి సుఖంతురుగాన పుత్రనే
నానగభేదికై వెరచి యాస్తుతజేసెదనన్న తండ్రితో
నానలినాక్షుడిట్లనియె న్యాయపథంబగు వాక్యసంతతిన్॥

సీ॥ కర్మంబుచేబుట్టు కర్మంబుచే మనుకర్మంబుచేజెడు కర్మజంతు । వులకుదేవతయయ్యె నుర్విని సుఖదుఃఖకారణంబయ్యెండు కర్మము లకు । దగుఫలంబుల నియ్యదారాజని నిష్కర్ముల కెవ్వాడుగాడు రాజు । గావున కర్మానుగతములౌ భూతంబులకు నింద్రుభయమేమి లావునేమి

పూర్వకర్మానుసారమై బొరయుకర్మ
ములను దప్పించుకొనలేరు మునులునైన
ననగనితరులజెప్పగా నలవియగునె
లోకమంతయు కర్మలో లొంగియుండూ॥

గీ॥ దేహికర్మవశంబున దేహమొందీ
విడుచు గురుమిత్రరిపులను వివిధభావ
ములును కర్మంబు జీవుండుమెలగుకర్మ
వలనదేవతకర్మంబు వసుమతీశా॥

మత్తకోకిల

కర్మచేతను మెలగుచుండియు కాని దేవతపూజనల్ । కూర్మిజే
సెడువాడు భామినిగోరి యన్యునినాయకుం । ధర్మహీనత బాయుభంగి
నదాను విప్రుడులేదళ । సత్కర్మచే రాజవనిపాలన కాంతుచే బ్రతు
కందగుః॥

వ॥ మరియు వణిజుండు కృషివాణిజ్యగోరక్షణంబుల శూద్రుం
డు బ్రాహ్మణసేవచే బ్రతుకవలయు నయ్యాసత్వ రజస్తమో గుణంబు
లుత్పత్తిస్థితి లయకారణంబులందురజోగుణంబున జగంబుగల్గు దానప్రే
రేపింపబడి మేఘంబులుగురియు దానసస్యంబు ఫలియించు దానం
బ్రజావృద్ధియగు నింద్రుండేమి శేయగలవాడూ.

రేకుప్తి రాగం.

యేమిటికయ్యా యింకా । యీయింద్రునకయి బహుశంకా
తానుసింపసీతని కేటికిపని తామసించె నాత్రీన జెడునిక॥ యేమి॥

భూములుబోవునోగాకా । బహుపురములూడును లేకా । గ్రా
మములుండవో మీకా । బహుధాన్యములున్న వా వీకా । భూమీధర
వనభూములదిరుగుచు కామించాలను గానుగొల్లలకు॥ యేమి॥

పశులమందలకు లీలా । ధర బ్రాహ్మణ పరులకుచాలా । అస
మాద్రికి బహుహేలా । మఖమాచరించ నదిమేలా । అసమానంబు
గ నఖిలవస్తువులు లెస్సదెప్పింపుడు వేగబంపుడిక॥ యేమి॥

హోమంబులు సేయింపూ । ద్విజకామంబులు దీర్పింపూ । సీమ
ము గిరిపూజింపూ । మతినిశ్చలతను శేవింపూ । కామముదీర్పగ కడ
జాత్యధముల కామోదముతో నన్నమిడుండిక॥ యేమి॥

గంధముకస్తూరిబూసీ । మేలందపుసొమ్ములు వేశీ । కందువ వలు
వలుదాల్చి । మీబంధువులతో భోంచేసి । సూదరముగ గోబృందాన
లగిరి వందనములు నానందత శేయుడు॥ యేమి॥

నాపలుకులు మదినమ్మా । గిరినారాయణుడనుకొమ్మా । దా

దాపక జెప్పితినుమ్మా । యిటుధన్యమౌను జన్మంబూ । గోపభద్రగిరి
శ్రీపతిగొల్చిన పాపమొదవకను ప్రాజ్ఞధర్మమగు॥ యేమి॥

సీ॥ అనిపల్కుచున్నట్టి యజ్ఞాత్మపల్కులు విని నందు డపుడు వినయ
మొప్ప । మేలు మేలని మెచ్చి మేచకవర్ణుని వాక్యపద్ధతి జేత వార
లపుడు। పుణ్యాహవచనముల్ పాలుపొందజదివించి భూసురోత్త
ములకు భోజనంబు । లిడి ధేనువులకపుడిచ్చి పచ్చికలట నున్నంత కృ
ష్ణుండు చెన్ను మీర

శైలరూపంబు దాలిచి చెలులగూడి
తానుబూజించి శైలదత్త ప్రసాద
మారగించియు ప్రత్యక్షమగు నరువలె
గానుపించియు వారితోగలసిదిరిగె॥

ద్వి॥ వినుడి గోపకులార విశదంబుగాను
ఘనశైలమిది సదాఖలుల వేధించు
వనము బెట్టిన యట్టిమంజులాన్నంబు
దిని మెచ్చి మనములో దీపింపకరుణ
జేసెనటంచును చెలులతోగూడి
వాసియోగికిని వరుసగా మ్రొక్కి
భూసురాశీర్వాద పూర్వకంబుగాను
వాసికెక్కినయట్టి వరధేనువులను
ముందరనిడుకొని మోదంబుతోడ
వందనంబొనరించి వరుసప్రదక్షి
ణమ్ములుగావించి నగమునకపు
డంబుజాక్షులగూడి యలరుచు తాను
మందకుజన నాలమందలతోడ
నంతయువిని యింద్రుడాశ్చర్యమంది
చండకోపంబున సంవర్తమేఘ
మండలి రావించి మరియిట్టులనియె
పెరుగులు నేతులు పెల్లుగా దాగి

యెరుగరు గోపకులింద్రుడటంచు
శౌరిజెప్పగ తాము శైలంబునిపుడు
మీారిపూజించిరి మేరలుదప్పి
బాలుని గురుదేవ బాహ్యునిమిగుల
శైలకాననముల చరియించువాని
పరిమాణహీనుని వరగుణశూన్యు
వరుజేసుకొని నన్ను వదలిరాగొల్ల
లవసియాత్మజ్ఞాన మనువిద్యచేత
గవయలేకను మునుల్ కైవల్యపదము
ఘనకర్మచయమను కలముచే పాప
వనధితరింపగా వాంఛించెదారు
తమసంపదలునమ్మి తామరసాక్షు
మమతచే వెర్రులై మద్యాగమిపుడు
విడిచిరిగావున వేవేగనేగి
కడువిద్యుదములచే గర్జలచేత
వడిరాలవానచే వసుధగోజనుల
కడుమృత్యువశముగా గావించిరండు
నేను సురలనుగూడి నేర్పునైరావ
ణానేకపము నెక్కి యటువచ్చిశౌరి
మందలకొందల మందశేయంగ
నందంబుగా మీారలదుగుడటంచు
ననిపల్కి యింద్రుడయ్యంభోధరముల
ఘనసంకశిలనూడగా జేయనపుడు॥

సీ॥ మందపైజని శిలా సందోహములవాన పొందుగాగురియగా నందు గోప । బృందమ్ములప్పుడా మందలనుండియు తొందరపడి యొటు దోచకడవి । యందుండ మేఘముల్ దుందుసేయుచు గర్జలందం దిసేయార్తి జెందియడవి । యంచుండిగోవుల ముందరనిడుకొని నం దివృద్ధులు జెందిభయము

లినగవులు మోమునందు న్నవ్వెల్ల శైలము తనలనద్వేల కేలఁదాల్చి చేకి తగోగోపాల పంక్తియురెల్ భక్తియున॥ గోవ॥

తాతండ్రి రమ్ముతల్లి । గోగోపాల వ్రాతముతోడఁగూడి । క్ష్మా తలంబుననుండుడీ మీకేతలంపులు లేక గనుగొను శీతమంబున మీకు ప్రియమోజేతునట్ల నిర్భీతులై యుని॥ గోవ॥

చిన్న వాడనుకోకుడీ । భద్రాద్రి పతిధరమిన్ననదనుకోకుడీ । పన్ను గన్నుకులశైలములతో నున్న కుంభిని బిడ్డనాకేత్తైన్న జెదరదు శంక తెలను తిన్నగా నిలువుండటంచును॥ గోవ॥

వ. అని యిట్లు బల్కుచున్న మందరధరుని పలుకులువిని గోగోపగోపికా జనంబులు నెమ్మనంబులనమ్మి పుత్రమిత్రసమేతులై జనార్దను కరుణామృతావలోకనంబున నాకలిదప్పిమాని కృష్ణకథా వినోదంబులు సల్పిరంత॥

ద్వి॥ హరిభుజదండంబు నధికమౌ కామ
ధరగుబ్బశిఖరంబు తభీకరములు
దరులముత్యంబులు తరుణులహాస
కరరుచులరత్నముల్ వసుధాధరంబు
ఘనఛత్రమైయొప్పె కంజాక్షుచేతి
వనజాతమైదోచె వసుమతీధరము
ఘనరాజవై నొప్పు కమనియ్యభృంగ
మనబలభేదిచే నటబంపబడియు
నుడుగకజడిగాన నుర్వీశయపుడు
జడియకనుండి రిజగదీశుచేతి
శైలంబుచాటున చక్కగావారు
బాలులతోడను పశుగణంబులతో
సుత్రాముడపుడు చోద్యంబునొంది
గోత్రభంజనుడయ్యు గోత్రంబుచేత్రంబుచేత
వంచనబడియెగొ వనదంబులోడ

మించినసిగ్గుచే మేఘవాహుండు
నంతనాకసముంతనపుడు సూర్య
కాంతిచే నొప్పనుగని శౌరిగోప
జనములోనిట్లనె జడిమానెమీరు
మనిటిరికొడుకులు మనమంద్రతోను
గోగణంబులతోడ కోర్కెమీరంగ
బాగుగావెడలుడు భయమేమిలేదు
అనిశౌరిబల్క వారందరాశైల
మునునుండివెడలిరి ముదమొందుచూను
శౌరియప్పటిచోట శైలంబుడించి
భూరిపరాక్రమ స్ఫూర్తిచేనొప్ప
నందయశోద లానందంబుగాను
యిందిరేశుని కౌగలిచ్చియునుండ
పాడిరిగంధర్వపతులప్సరాలు
వేడుగసల్పిరా వేళభూజనులు
గోపాలకులఁగూడి గోవిందుడపుడు
యొప్పుమీరగ మందకేగెమేలొంది॥

వ. అయ్యవసరంబున కృష్ణు చరితంబులుదలంచి వెరగుపడి గోపజనంబులు నందునకిట్లనిరి.

కాంభోది రాగం.

నందనీసుతుడు చేయుచెందమెన్నగా। నరవిందసాభవునకు నైనపొందుగాదు లెక్కశేయ॥ నంద॥

పూతనానుజంపె విఖ్యాతిగాని। భీతిగూల్చె పయాడు నెలల పిల్లడయ్యు శకటమిపుడు॥ నంద॥

వచ్చితన్నుగొన్న తృణావర్తుగూల్చెను। మచ్చికలర తనను రోలమాలగట్ట మద్దులుగూల్చె॥ నంద॥

పసులకాపులగాచుచూను బలుకుజీరెనూ। వెసనువత్సుజంపె

ఖరుని వేడ్క సంహారించెచూడగ॥ నంద॥

వరప్రలంబుమునిమి ్రమింగె వనదవాగ్నినీ । సరభసరమున కాళియాహి సారముడిపి శూరుడగుడు॥ నంద॥

మనము జూడశైలమెత్తి మందగాచెను । మనుజాడే భద్రశైల మందిరుడా నీసుతుండు॥ నంద॥

గీ॥ అనుచుబల్క నందుడానందమును జెంది
గర్గుమాట జెప్పి కమలనాభు
నంశమనుచుబల్క సంశయంబులుమాని
కృష్ణుగొలిచిరంత విష్ణుడనుచు॥

మ॥ తనకేలంగిరి యెత్తిగాచె వ్రజముం దామోదరుండంచునా
ఘనవాహుండు త్రిలోకరాజ్యమదముం గర్వంబుజాలించి యా
వనజాక్షుణ్ శరణంబు వేడె సురభివ్రాతంబుతో గూడి తా
గనియెన్ పద్మదళాయతాక్షు మునిలోకత్రాణునారాయణున్॥

వ॥ యిట్లుగాంచి పూజించి నిటలతటఘటితకరకమలుండై యిట్లని స్తుతియించె.

కల్యాణి రాగం.

కావలేకకమలాక్షా । కరుణజూచి కరిరాజరిపుశిక్షా । దేవదేవ నిన్ను తెలియాకనిటువంటి కావారమైనట్టి కార్యము జేసితి । యీవసుంధరలోన సుజనులగావ ఖలులనుజావజేయగ భావభవహర పద్మజార్చితనీవవై యుదయించినాడవు॥ కావలె॥

నావంటి వెర్రూలను । శ్రీవల్లభనీవు శిక్షశేయనూ । కావరములుమాని కనుపెద్దలరిగేటి త్రోవబోదురు బుద్ధిదోచిన జూచిన భావమున నేనొక్క లోకముగాన నేరక నృపులమనియెటు కావరంబులు దాల్చు మూఢులు గలుగుదురె నీమాయదెలియగ॥ కావలె॥

మగటుశేయలేరనూ । కోపముచేత మందమీదవాననూ । ఖగవాహానుడ మేఘగణమూలతోడను పగదీరశిలలా నేమరగవషీం

ఛితి । జగతినాయక నీమహాత్మ్యము చాలాదెలియక జేసినాడను పగద లంచకు నీదుదాసుడ పరమకారుణికోత్తమాననూ॥ కావ॥

సరసిజాసనుడాదిగా । నీమాయదెలియజాలా నెరురెన్నగా । పరమజడుడనెంతో పరమార్థహీనుడ వరగర్వనిష్ఠుడవంచనశీలుడ । పరమపదగోవింద మాధవపద్మనాభ జనార్దనామురారి వరదకేశవవాసు దేవావందనము భద్రాద్రిమందిర॥ కావ॥

వ॥ అని స్తుతియించినవిని మేఘగంభీర భాషణంబులజిష్ణునకు విష్ణుండిట్లనియె.

సీ॥ సురలోకరాజ్యంబు సుఖముగా భుజియించు పుట్టంధుడవునిన్ను పొ
సగవంచ । నను సేయదలచియు నయముగాజన్నంబు దప్పించితిని
నన్ను దలచకుండు । వారలెవ్వరు వారివారక దండింతు దండధారి
ని నయ్యుధరణి నెవని । గావదలంచినగావింతు నధనునిగావునవా
యాజ్ఞ గడవదగదు

నీవురాజ్యంబులోపల నేర్పుగలిగి
రాజ్యమదముసజెందక రమ్యముగను
శ్రీయుతుడవయ్యు ననుదలువుచెలువుమీర
శ్రేయములుగల్గు పొమ్మికశ్రీసురేంద్రా॥

వ॥ అంతగోగణసమేతయై కామధేనువన యీశ్వరునిట్లనిస్తుతియించె । దేవనీవుమాకు పరమదేవతంబవు । భూసురగోసురసాధుసంరక్షణంబుకొరకు నిన్నింద్రుంజేసి పట్టంబుగట్టుమని విరించి బుత్తెంచె నీవు భూభారనివారణంబుసేయ ననతరించిన హరినిస్తుతియించె నంతా.

## రేగుప్తిరాగం.

అభిషేకమొనరించె నంభోజనయనునూన కమరేంద్రుడు వేడ్కనూ శుభకరంబుగ సారభముచే సురుచిరంబుగు కామధేనువు విభవములనదు క్షీరములచే వేడ్క మీరనిలింప గణముతో॥ అభి॥

దంతీంద్రవరశుండదండసిత గంగధారా శ్రీకరములచే । పింత గాసురమాతనురమునికాంత సంతతులెల్ల గొలువగ సంతసంబున శే షశయనున కెంతో భక్తినితాంతమతియై॥ అభి॥

సురసిద్ధసాధ్యతుంబురు నారదాదులు హరికథలను బాడగా। సరగునను కింపురుషకాంతలుపరగ వీణలుదాల్చి యిరుగడ సరసిజాక్షు ని గొలువగా వరజాణలు గంధర్వులుబాడగ॥ అభి॥

పంచవాద్యములు మ్రోయించగ దుందుభులెంచి జనులుబాడ గా। పంచబాణుని జనకుపై సురలంచితంబుగ పూలుగురియ విరించి శంకరు లంబరములపైనుంచి శిరములువంచిమ్రొక్కగ॥ అభి॥

భావించిసురనాథ పరమమునీంద్రులు బహుప్రస్తుతించాగనూ। దేవదేవుని గొప్పగావరదేవమునినికరాధిపత్యము గవిజేసియు బల్కిర పుడు దేవభద్రాద్రి శయనును॥ అభి॥

గీ॥ యిట్లు గోపతిత్వమింద్రుడు జేసి గో
విందయనుచు హరిని పొందుగాను
డెందముననునిల్పి యిందిరాహృదయేశు।
నాజ్ఞవడసిచనియె నమరపురికి॥

సీ॥ నందుండుద్వాదశియందు స్నానముజేయయమునకేగిన నచ్చియపు
డు వరుణు । దూతగొంపోయిన భీతిచేగోపకుల్ మొరబెట్టివినియు
దామోదరుండు । వరుణుపాలికినేగి వరుసతో బూజించి నేనెఱుంగ
ను యిట్టినీచకర్మ । నాభటుండొనరించె నలినాక్ష యీతప్పు
గావుమటంచును కడునుతించి ।
నందుసర్పించగొనివచ్చి నగధరుండు
పొందుమీరగతా వారలందరకును
బ్రహ్మలోకంబు మొదలగు యిమ్ములన్ని
జూపవారలు ముదమున జూచిరధిపా॥

గీ॥ యిట్లుజూచికృష్ణు సేవమీరగబ్రహ్మ
మనియువారలపుడు మనములందు

నిలిపిభక్తిసల్పి నీరేజనాభుని
దలచుచుండిరంత ధరణినాథా॥

శా॥ శ్రీమద్భూమిసుతాసుఖాన నలసత్స్వైతాబ్జమిత్రాసుర
స్తోమాధీశదశాననాననవనాస్తో కాగ్నిహోత్రాకరం
ధామాకామసహస్రసుందరలసద్ధారాధరాకారశ్రీ
రామాభద్రన చంద్రదహర్మ్యనిలయా రాజీవమిత్రాన్వయా॥
ఖరాసురధరాధరా హరణకేళిరంభోళిసా
గరాంచిత శరాచరాచర సమస్తలోకేశ్వరా
సురారిముఖ దిక్పతిప్రణుతపాద పంకేరుహా
ధరాత్మజవరాటమాదయిత తారకాతారకా॥

గద్య, ఇది శ్రీరామచంద్రచరణారవింద విష్యందమకరందబిందుసందోహ
పాన మత్తమధుకరాయమానమానసపవనాత్మజ కృపాలబ్ధ కవితా
మాధురీధురీణ శారదావరప్రసాద సమాసాదితమనీషా ప్రాభవ
కాశ్యపసగోత్రపవిత్ర వీరరాఘవార్యపుత్ర సకలసుకవి
విద్వజ్జనకృపాపాత్ర శ్రీబోడం కృష్ణదాసప్రణీతంబైన శ్రీ
మహాభాగవత పురాణాంతర్గత దశమస్కంధ
సంబంధ నందనందన చరిత్రంబను యక్షగాన
ప్రబంధంబునందు ద్వితీయా
శ్వాసము.

మంగళహారతి.

రామానీకిదె మంగళం। పరంధామా నీకిదే మంగళం॥
రామా రణరంగభీమా రుసద్గుణస్తోమా రవికులసోమా శ్రీరఘు॥
శౌరీ కలుషవిదారీ విజితసురారీ కోదండధారీ శ్రీరఘు॥ రా॥
శూరా త్రిజగదాధారా। వర మేరుధీరా నీరదాకారా సీతాభి॥ రా॥
శీలా నిజభక్తపాలా కనకదుకూలా జానకీలోలా పట్టాభి॥ రా॥
శ్రీశా భద్రగిరీశా వరకృష్ణదాసా భద్రాద్రివాసా దశరథ॥ రా॥

---



రామచంద్రాయనమః

# నందనందన చరిత్రము.

## తృతీయాశ్వాస ప్రారంభము.

శ్రీకర దుష్టఖరాసుర
భీకర సేనాసమూహ భేకగిశద్ధ
ఢీకరఖరశరభ క్తవ
శీకర భద్రాద్రిధామ సీతారామా॥

వ॥ అవధరింపుము తదనంతరంబ పరిక్షిన్న రేంద్రునకు శుకయో
గీంద్రుండిట్లనియె॥

సీ॥ తొలివలమేల్కొందువలెఁ దోయజాస్త్రుని చేతి శరములు విరహిణీశ్రమ
కరములు। గురువిరహాగ్ని చే గుందియున్న చకోర సమితికి స్వాగత
సమయములును। సాంద్రచంద్రాతపోజ్జ్వలితములై విటవ్రాత దు
ర్దశలు శరన్నిశలును। అంఙా రాకాగమంబయ్యెను కందర్పరాక
హై తన్మనుటీకయయ్యె।

పతియుకరమున తన సతిఫాలమునను
ప్రేమ కుంకుమ నామంబు బెట్టురీతి
ప్రాక్సతి మొగంబునను నిశాపతియు తనదు
కరములను రక్తిరంజించి గలిగెరాజా॥

గద్య. తదానీంవిరహజనజయకామస్య కామస్య పటకుటీరాగ్రస్థ శాత
కుంభకుంభ ఇవ సుస్నిగ్ధః పాంధజనమానకాననందగ్ధ విభునామ

న్మధేన సంపాదితాంగార రాశిరివారు ఇః । కాముక కామినీజన
మృగయార్థమాసీ తస్యమన్మధ వ్యాధస్యమోహానజ్వాలాకలాప
ఇవ దీప్యమానః విరహజనధైర్యవల్లికా నిర్మూలనకరస్య
పంచశరస్య కరధృత చక్రమండల ఇవనిర్వక్రః।
చకోరనేత్రానందకరః శ్వేతకరః ఉద
యాద్రావజాయత.

శ్లో॥ చంద్రంత్వా లోకగోప్యః ప్రచలిత హృదయాస్స్వామినంద్రష్టు కామాః । భర్త్రాద్యైరుధ్యమానా అపి సురమునిభిర్ధ్యాయమానం దకందం । కృష్ణం గోపాలనాధం శ్రుతిమధురతరం వేణుమాగియ్యమాణం । ప్రాపుఃత్యక్త్వా నివాసాన్ ఝడితిచయమునాప్రాంతగం సంతతంతం॥

ఇట్లు జనుదెంచు సమయంబున॥

సీ॥ మగువలకొందరి మరుగిళ్ళలోనుంచి గానీకనుండిన రామలపుడు హరిని మనోవీధి నాలింగనముజేసి జారుడంచునె ముక్తిచేరిరధిప అని మునీంద్రుడుబల్క నవనీశుడిట్లనె విటుడటంచునెకాని విష్ణుడనుచు । నెరుగరుముక్తికి నేరీతిజనిరన మునుజెప్పనే చైద్యముఖులు నిలను ।

వైరమున ముక్తిజెందరే వసుమతీశ
గానవగనైన పగనైన కరుణనైన
శౌరిపూజలు సల్పెటిజనులు నమృత
పదముజెందెదరనినమ్ము పార్థివేంద్ర॥

తదనంతరంబా॥

క॥ వచ్చిన గోపికలంగని
మచ్చిక కృష్ణుండుబలికె మధుగోక్తులచే
మెచ్చదరె మిమ్ముసభలను
యిచ్చటికేతేరజూచి యిద్దరలోన॥

## మధ్యమావతి రాగం.

యేలావచ్చితిరే। ఓచెలులార చాలామెచ్చెదరే । మెలెసింహ్వ శార్దూలాదులుండు నిండేలరాత్రి రాజాలేగుడింళ్ళకు॥ యేలా॥

మేలుగను మీరరుగుదెంచినజాలు గానకతల్లిదండ్రులు బాలకులు మీమగలుమేరలుమాలిరని విడనాడరయ్యయో॥ యేలా॥

కులమెల్లబాసీ ప్రాణేశులబలుసిగ్గుదీసి । యిలనత్తమామల నలయించి యనుజాలచెలిమి మానముగోసి తలిదండ్రిరుచిమాన్పి । చులకసేయగ బంధులెల్లను నులుకుజెందుచు జారవాంఛల మెలగుదురె కులకాంతలెందున్ మేలనుచు లోకంబుమెచ్చునె॥ యేలా॥

నాథుడరోగినా। దెగజూచు భూనాథుడుగన్నా । బాధాబెట్టును మామబోధపరచుకున్న నాధారమే లేదు యీధరతలవరీ। గాధవిన్నను తగువుసేయును సాధుత తలిదండ్రివిన్నను ఖేదమున తలఎత్తకుందురు మోదమా. నేరాలువిన్నను॥ యేలా॥

తనయాలువిన్నా । వినయముసేయ దలచరుమిన్నా । ఘనబంధువులువిన్న కడబెట్టజూతురు జనములందరువిన్న చాలాచుల్కగజూతురనయమున నిహాపరము లేదానందయశవులు లేవుగావున వనజనేత్రికి జారు జేరుటవంచనము మేలంచుదలచిటు॥ యేలా॥

మగడువెర్రైనా । నడువడిమేరదగ నేరకున్నా । వగజెందిపేదైన వరరూపిగాకున్న తగువిద్యరాకున్న సగదుడైనగాని । మగువలచే విడనాడరాదని మనువుజెప్పడె కొల్లిస్మృతులను మగడు దైవమటంచు నమ్మినమానినికి సుఖమిహాపరంబుల॥ యేలా॥

మదిరాక్షులారా । యిళ్ళకుబోరె ముదమూలుమీర । మొదవులనరయుడు సదయాలతపతులా తాకుదురూగనుండుడు విదితముగా నేడు। మదవతులు ననుగోరివచ్చితి రిదిగోరంతయుగాదు జనములు మదికిప్రియములుగాన నాకును మగువలచే ప్రియుగొల్చుటొప్పును। ధ్యానముచేత భద్రాద్రీశుగానాముచేత। మానుగాను విజ్ఞానముచే ననుగనుటచేతను

కదుధన్యులయ్యేరు। మీనసేత్రులు పూనెదరు ధరమెప్పుగాను కృతా ర్థతను నిజమానసంబుల పతులనమ్మియు మందిరంబుల కేగుడిప్పుడు ॥యెలావచ్చితిరే॥

వ॥ అని యిట్లు బల్కుచున్న మందరధరుని వచనంబులువిని కుందవదనలు కందర్పబాణజనిత విరహానలంబునజుట్టు నిట్టూర్పు వే డిమిచే మోముదమ్ములెండ నేత్రారవిందవిగళితాశ్రు పూరంబులు మీ న స్తన కుంభంబుల గ్రుచ్చి పారకపోలతల ఘటితకరకమల నిదాఘంబున చెక్కుటద్దముల సొంపుదరుగ మాటిమాటికి సూటిగా నాటివెడవిల్తుని చురుకుములుకుల తాకునకు చిరాకుపడి ధైర్యంబువదలి మిక్కిలి మ క్కువలాడని చక్కనయ్యను సొక్కుచుజూచి బెగ్గడిలి చరణంబుల ధ రణి రాయుచు దంతిగమనలు విభ్రాంతలై యిట్లనిరి.

ద్వి॥ వినవయ్య శ్రీకృష్ణ విశదంబుగాను
తనయులపతులను తగుబంధులాను
వదలి మీపదములు వాంఛించియున్న
మదవతులను మీరు మన్నించరేల
పతులుబిడ్డలటంచు బల్కుటయేమి
యతిధర్మమగును మీయటువంటివారి
కమరఫతిత్వాది యాఖ్యలచేత
నమరస్త్రీప్రాయమో నవనిలోపలను
సముడవై యెప్పుడు సంచరించేటి
మిముగొల్చుటొప్పదే మిక్కిలిప్రేమ
పతిసుతాదులజూపి భ్రమబెట్టనేల
మతిమీపదంబుల మరిగుండగాను
కోపమేటికిమాను కోరికదీర్పు
బాపనేటికినిన్ను బాసిపోవంగ
పాదముల్ రావయ్య పద్మాయతాక్ష
మోదంబుతోనిన్ను ముట్టకనున్న
కరములింకాకపని కాంక్షించవయ్య

మురహార నీకథ మోదించి వినక
వినునింకొక కథ విననొల్లనయ్య
దానవాంతకర మాధవయాధరాను
నీసుందరాకృతి నెరిజూడకున్న
నాశించనక్షులు నన్యములజూడ
నీపేరునుడువక నెరియున్న జిహ్వ
దాపోవదేమియు వల్లనటంచు
పలుకవుమనములు బలుదొంగిలితివి
నిలువలేమింకేమి నేరముమాది
సరసిజనయన మీాసదమల పాద
సరసీరుహంబుల సరసకు జేరి
మరలగలేము మాామగలొల్లమయ్య
సరసిజమకరంద సారంబుగ్రోలు
సారంగములు నిలసామాన్య పుష్ప
సారంబుగ్రోలగా జను నెట్లు కృష్ణ
అంచయానలుతొల్లి యువనివల్లభుల
నెంచికోరరె కోరనిద్దరలోన
సరసులై వారలు చతురతమీారు
సరిగూడరేయిట్టి సామాన్య మరులు
మాపాలగలిగెనే మగవారలెందు
యీాపగిదందురు యెటు నేతుమయ్య
పాపుడుమదనుండు బాధించుమమ్ము
కాపాడుమయ్య నీకౌగిటజేర్చి
పున్నమచందురు బోలునీమోము
గన్నంతమమ్ముగు కాంక్షించినాము
నున్నించకున్నను మదనుడు క్రూరు
డున్నదా బ్రతుకింక సురగేంద్రశయనా॥

గీ॥ యిట్లుబలుకుచున్న యింతులతో గూడి
సరసగాననృత్య సంగతులను
శౌరియపుడు క్రీడసల్పుచునొప్పెను
తారకస్థతుహీన ధామకరణి॥

సీ॥ సనకాదులకునైన చక్కగాజిక్కక తక్కుజేసెటియాశు మక్కువ లర। దక్కించుకొనితాము చక్కరవిలుకాని మక్కువవలలోన జిక్కియున్న। వనితలగనివారి వలపుడించుటకునై మన్నించిమరల ప్రసన్నుడగుట। నాతహీనతుండయ్యె నయ్యెడకృష్ణుండు చెలువుని గానక చెలులుకరిని॥

బాసితిరుగునట్టి బలుకరేణులబోలి
చిత్తమతనిమీద జేర్చిభూత
గణములందు మిగులగనుపట్టు కృష్ణుని
గానకరసిరపుడు కాననమున॥

కాంభోది రాగం.

కానరే పున్నాగకరిరాజరక్షకు కరుణమీరా। దానవాంతకు డిందు దయసేయడే కదంబలారా॥

తిలకభూజమయిందు దిలకింపవాయిందు తిలకఫాలూ। అలుకాజేశియు మాయధిపుడువచ్చె నోములుకాదెల్పు॥ కానా॥

ఘనసారమానీవు ఘనసారశోభితు గనగలేదా। పనసాయీ సందుల పద్మాయతాక్షుని గనగలేదా॥ కానా॥

చందనాగమ యీచక్కంటికి శ్రితచందనాగమూ। కుందరద నుడీసందున లేడె వోకుందలారా॥ కాన॥

మందారనీచెంత జెందాడుగదమాయింది రేసుడూ। కందర్పజనకూని గనుగొన్న దెల్పరే కలువలార॥ కాన॥

సారాసనేత్రుడీ సాయరాడుగద సరసులార। కూరిమిశ్రీభద్ర ధాత్రీశుడేడ ఓకొమ్మలార॥ కాన॥

సీ॥ పంచబాణుండైన గాంచినంతనెలో భ్ర, మించుసుందరమైన మేనివాడు । నెమలిపించమువాడు నీలైనభ్రమరాళి మురువుడించెటి యట్టి కురులవాడు । చందురుగేరెడు సరసంపుమోమువా, డమరేంద్ర ధనుబోలు బొమలవాడు। సరసిజదళనిభ సన్నేత్రములవాడు బింబాభ మగునధరంబువాడు॥

దరసదృశమైన గళముసుందరమువాడు
కమలకిరువైన మహితవక్షంబువాడు
చెలులమానధనంబులు చేకొనిందు
వచ్చెగంటిరె మల్లికావనములారా॥

ద్వి॥ కన్నారమాకాంతుకాంచనవకుళ
పున్నాగకరవీర భూర్జకదంబ
చంపకమరువక చామంతిపనస
సంపెంగవిరిమల్లె జాజితక్కోల
పారిజాతరసాల హరిబిల్వశోక
చారుకాంచనతాల సాలసురసాల
హింతాలతక్కోల ఏలాలవంగ
సంతానపిచుమంద చందనాశ్వత్థ
కుందబుంచీరామ్ల కురువిందలార
యింది రేశునిమీర లెరుగరుగదరె॥

రేగుప్తి రాగం.

కలువలారాకానరే మాకాంతూని సుప్రశాంతూని॥ వోకలు॥
కుందామాకానావె మాశ్రీమందిరు సాధుమందారు॥ కలువ॥
మాలతికానవె నీవూ । మన్మథామన్మథాకారు॥ కలు॥
భృంగామాకానవె నీవు । సంగీతా విద్యాప్రసంగూ॥ కలు॥
హంసలారాకానరే శ్రీహర్షుణనీసుప్రశంసునీ॥ కలు॥
మృగములారాకానరెమా । మృగరాజామధ్యునిందూల॥ కలు॥

ఖగములారా కాననరేమా । ఖగరాజవాహు పొందుగ॥ కలు॥

నగములారా శ్రీభద్రాద్రినాయకుని గనరేయిచట॥ కలు॥

మ॥ అని యిట్లంగన లార్తిగానకనువారందందు వీక్షింపుచుఁ। ఘనసారామ్లతమాలసాలకదళీ ఖర్జూర జంబీరముల్। గనియానంద రునందుగానక కిసన్కాళిందితీరంబునం। జని శ్రీకృష్ణుని పాదపద్మయుగళ క్ష్మంబుల్ దగంజూచియుఁ॥

ద్వి॥ కనుగొంటివే నీవుకంజాయితాక్షి
వనబురథాంగకవజ్రాంకుశాది
వరచిహ్నములుగలుగు వనజాక్షుపాద
సరణియల్లదెనొక్క సతికిపువ్వులు
గోసినాడిక్కడ కొమరొప్పగాను
శ్రీశునిసత్పాద చిహ్నగన్గొనుము
నలివేణి నెత్తుకోనలిగనీజాడ
కలదావలిదెజాడ కాంతపాదమ్ముల
సతికిధమ్మిల్లంబు సవరించెనిందు
పతియుగూర్చున్నట్టి పట్టుదిజూడు
కొమ్మకుకెమ్మోవి కోర్కెతోనొసగ
సమ్మోదమునరిక్క జాడగన్పట్టు
జలజాక్షితోగూడ జలములోజొచ్చి
కలికితావెడలుట గన్పట్టిజూడు
తరుణిని మరుకేళిదనివెనిచ్చోట
సరిబెనంగినయట్టి జాడలుదోచె
కాంతచెయ్యూతగా గైకొననిచట
వింతగానాలుగు విలసిల్లెనంఘ్రు
లలివేణితోనుడశాడెనిచ్చోట
నలవానిజాడలో నబ్జాక్షిజాడ
పణతిమ్రొక్కనప్రేమ బల్కనాడిచట
నతనికెదురైనటువలెదోచె గనుము

యెదురుగానున్నవి యిదెపదంబూలు
మదవతితనవెంట మమతతోరాగ
నిలువకజనెనమ్మ నీరజాక్షుండు
చెలువలనిరువంక జేర్చుకొశౌరి
విరిగినాడిక్కడ నిలకింపరమ్మ
యిరువంకపదచిహ్నా లిందుగన్పట్టా॥

యమునా కల్యాణిరాగం.

జలజాక్ష పాదాంబుజాత సరణుల నిటుగనరె। హరి జలజాక్ష॥

సనకాదిక మునిజనమానస సద్వనజములందున వశియించిన హరి॥ జలజాక్ష॥

యిందుమౌళి యరవిందసంభవుడు పొందుగ మనములయందు భజించెటి॥ జలజాక్ష॥

క్షీరార్ణవసుత చెలగి కూరిమితోడుత కులుకుచు దాల్చెటి॥ జలజాక్ష॥

అంగజహరునకు గంగాసతినిడి రంగత్తుంకుడ సంగతిగాంచిన॥జల॥

ముక్తికామినీ మూలములగు వరభక్తాఫలముల కభయదంబగు॥జల॥

ధరణిభద్రగిరివరునిభక్తులకుపరమనిధానంబై చెలువొప్పెడు॥జల॥

వ॥ యిట్లు వల్లవకాంత లుల్లంబులు పల్లవింప నల్లనయ్య పద పల్లవంబుల జాడగాంచియు హరింగానక కందర్పబాణభగ్నహృదయులై బృందావనంబువెడలి యతని వర్ణింపుచుం బాడుచు తమమనంబులు చేష్టలు సమస్త కర్మంబులు హరియందుచేర్చి నివేశంబులమీరాది యాశలు దీశివేశి యమునా సైకతాగ్రంబునకుంజని హరినుద్దేశించి యిట్లనిరి.

రేగుప్తిరాగం—అటతాళం.

శౌరిజూపు నీరూపాము।। చెలులు జేసిన దాపాపముా నీవుజన్మిం చుటచే లక్ష్మి నెలవుజేసె మామందలో। నీవెంటా ప్రాణాములుం

చ । నమ్మియుండుముమన్నించా॥ శౌరి॥

శారదా సారసాంతరరు । క్ష్వేరకంబగు నీచూపువలనా । శౌరి వచ్చిన సతులనేచా । ధీరతా మేరగాదుర॥ శౌరి॥

పూతనవానాలా చక్రవాతమూనవహ్నివలనా । భీతిబాపి పంచశరుని హేతిపాలు సేయదగున॥ శౌరి॥

నీవు యశోద బిడ్డడవే । నిన్ను పద్మజుడవని జనుల । గావర మ్మని సన్నుతింప । కరుణమీరగ బుట్టితిగాదె॥ శౌరి॥

పాదసేవాకులకు భవ , భయములు దొలగాగజేయు । మోద దాయియగు కరనజము శ్రీరశిరములంగుంచి యేలుము॥ శౌరి॥

వాసిగా శ్రీభద్రశైలా । వాసుడా నినుగోరియున్నా । దాసజ నులా రక్షింపాక । తప్పాగు శ్రీదయితానీకూ॥ శౌరి॥

పున్నాగరాగం—ఆదితాళం.

నిల్వలేమూ మోముజూపరా । శ్రీకృష్ణరాయ నిల్వలేమూ మోముజూపరా॥

పిల్వగా రావేమిరావో చిల్వరాయ శయనమేము॥ నిల్వ॥

కాళియూహి ఫణములందునా । చెల్వొంది భక్త కల్మషము హారియించు నంఘ్రులూ । లీలమా కుచపాళిజేరిచి హేలనంగజ తాప మార్పర॥ నిల్వ॥

సాధుబృంద సమ్మతంబగూ । మధురంబునగు నీ సారవాణిమ రుగజేసెరా । శ్రీధరా నీయధరమధురస సేచనంబడి మమ్ము బ్రోవక॥

మగువలాపై నిదుకోపమూ । జూపాగదగునె మిగుల భక్తభీతి బాపుమూ । తగదు భద్రాద్రీశమాకు నగుమొగము దయజూపకు న్ననను॥ నిల్వలేమూ॥

కాఫిరాగం—అటతాళం.

నిర్దయా దగునయ్య మాధవా । చెలియాలపైనా । నిర్దయా దగునయ్య మాధవా॥ నిర్దయా దగునయ్య సజ్జనభద్రమా మీనసత్క-

ధామృతముచే।త్క్రుద్రులై దానాము భూతదయార్ద్రబుద్ధి లేక గ్రోలక॥నిర్ద॥

నగవులూ నీదూచూడ్కులూ । సకలంబునైన తగుచరిత్రము నీ సుధ్యానమూ । నగధరా ధరనీదు సరసముల్ నాటిమనములు మగుడ వెప్పుడు సొగసుగా యిటువచ్చి మమ్మలజూచి బ్రోవకనున్న వయ్యయో॥ నిర్దయా॥

వ్రజము వెల్వడి నీవు గోపులా । వెంటబోయిన సుజనవాదిత నీ పాదపద్మమూ । కుజనశిక్షా కనపుశిలలచే గుందునానుచు మామాన సములు నిజముగుంశుభ్రద్రశైలనిలయ మమ్మదలచవయ్యయ్యో॥నిల్వ॥

ఘంటారవరాగం.

యెందుబోయితివయ్య సుందారాకారనూ।చందాము గన వేమి మందరధీరా॥ యెందు॥

యెందుబోయితి మంద వెల్వడి సుందరంబుగ మాపువచ్చియు యిందునిభమగు మోముజూపియు నందుపైరతివిందుజూపెదు॥ యెం॥

దాసూలకెల్ల నిధానమైయెప్పూ । వాసిగకంజజ వందితమయ్యా । భూసతి యురమున భూషణమయి దు । దోషహారణమయ్యు భాసిల్లుపదములు । శ్రీశ మాకుచకలశములపైజేశి బ్రోవకనున్న మద నుడుడాసి ధనునరిబోశి శరములుదూశి పారగ నేసు నయ్యయొ ॥యెం॥

కాము కేళిని మిగుల గావించులీలా । బామూలణాచు సద్భవ్య మైచాలా । శ్రీమించు వేణువు చెలువొప్పగ్రోలా । కామించిరక్తులు కాంక్షించునధరాము । శ్రీమనోహరగ్రోల నిమ్మిక చెల్వుమీరెడు నీముఖాబ్జము ప్రేమమీరగ జూడకుండగ రేప్పలడ్డము జేశెకమలజు॥ డెందు॥

అయ్యయ్యో తలిదండ్రు లాప్తులు పతులూ। సయ్యాన నన్నలు సత్పుత్రకూలు । నియ్యర్ధనిశియందు నేగాకుడనిచాలా । కుయ్యిడగా నీకొమరొప్పగీతాము। తియ్యాగా వీనులను సోకిన దేవమోహాముసొందినారంబయ్యయో మెటులేగితో తగునయ్య నిర్దయజెయ్య మాపై॥

అరవిందములకన్న నందముతామీ । చరణాముల్ కఠినమోచ

న్గవమోహా । వెరతూముకందునన్వగజెంది మెమూ । సరసిజేక్షణ నీవు చాలా కంటకయుక్త । ధరణి దిగిగిన మ్మా మనంబులు తల్లడిల్లవె నాధ నీ మృదుచరణపంకజములనుజూడక చెల్వగా ప్రాణములు నిలువవు ॥యెందు॥

అలరు విల్తుడుములుకులమితమఁలె యా । నలికి మీాపదముల నాశించి డాయా । చులుకజేశి మమ్ము జొచ్చితీవు యెందు । కులుకు లాడులనొంచకోర్కె భద్రాద్రీశ । జలజలోచన మామనంబులు చాల మృదువుగజేశి యబ్జజుడలుకచేసి మనము కఠినపు శిలలచేసెను మంద భాగ్యుడు ॥యెందు॥

అని మరియు నిట్లనిరి.

మ॥ సురలం దైత్యులు వాడిబాణములచే స్రుక్కింపగావచ్చి యో
వరదా వారిజయించె దండ్రమితముగా వాంఛించియున్నమ్మి యీ
కరణిం సొక్కిన మాగ్ధకామినుల నాకాముందుచేవంచి మేల్
శరముల్ నాటగ నడ్డగించుకొనవా చక్రీదయాళుండవే॥

మత్తకోకిల॥ తుంటవిల్తుడు వాడిశరములు తోరముగ నొనరించి మేల్
జంటముక్కలి నారిగూర్చియు సారెసారెకు వేయనే
వెంటవిల్చును మామనంబులు విశ్వరూపకవచ్చి నీ
కొంటిరూపముజూపు మొరపిని తోయజాక్ష రమాపతీ॥

ద్వి॥ అని యిట్లు గోపికలంజలిజేసి
వనజాక్షుబాడగా వనధిగభీరు
డలరువిల్తునికన్న నధిక సౌందర్య
మలరార త్రిజగదనంగుడై మించి
ఘనకాంచనాంబర కలితుడై వేడ్క
గనుపించెనప్పు డక్కాంతలచెంత
శౌరిని జెలియలు సరసతగాంచి
యెరిగియుప్రాణములే తేరనిల్చి
అవయవంబులభాతి నలరారిరపు

డవలయొక్కతె భక్తి నంజలిజేసి
కమలాక్షు కెంగేలు కామించిబట్టి
ప్రమదయొక్కతె తనపతిహస్తము లను
మూపుననిడుకొని ముదమునసుండె
కోపనయొకతె శ్రీకృష్ణుతాంబూల
మాత్మహస్తంబున ననువుగా దాల్చె
నాత్మేశుపదముల నబలయొకర్తు
విరహతప్తకుచాగ్ర పీఠినిజేర్చె
తరలాక్షియొక్కతె తనభ్రూయుగంబు
ముడిబెట్టి యధరోష్ఠమును నొక్కుకొంచు
కడ వాడిచూపుల కాంతు వీక్షించె
హరిముఖాబ్జముజూచి యబలయొకర్తు
వరయోగిక్రియ నేత్రవనజముల్ మూసె॥

వ॥ తదనంతరంబు,

—* రేగుప్తిరాగం *—

ప్రాణేశా యెందుబోయితివో । ప్రాణదయితల గాసిజేసి ॥ నాథ నీవుజనినా వెనుకా । నాప్రాణా మెమున్నాది వింతా । శ్రీధరా నీకరుణా నాపై చెలగియుండుటచేత నేమొ ॥ ప్రాణేశుయెన్నగా పాపుడా బ్రహ్మా । నిన్ను నన్ను బాపెనిందాక । వెన్నుడా యికనైన మనల తిన్నగానుంచునో లేదో ॥ ప్రాణేశా॥

యెట్టితప్పు జేసితిరా యీగె నన్నువిడచిపోగా గట్టిగాబల్కుటా ధర్మమిప్పట్లానైన శేయకనుండు ॥ ప్రా ॥

యేమినోమునోచితిరా । యీశ నీమోముజూడగల్గె । ప్రేమ లేక శ్రీభద్రాద్రి । ధామగల్గున దోసకారులకు ॥ ప్రా ॥

వ॥ అని మరియును.

సీ॥ పలుకనన్న ప్రతిజ్ఞపాటిదప్పను నాకు, పలుకరించినగాని బలుకనను

ప్రౌఢిమీఱ। చెలువుడు తనతోడ చెప్పకపోయిన నెలపున ముం
దుగా జూడననుచు। తలవంచియుండియు తలయెత్తెమరుడు లోదల
యెత్త నొక కాంత తత్తరమున।

యివ్విధంబున కాంత లయ్యిందిరేశు
మోహనాకృతిజూచియు ముక్తవిరహు
లగుచు పరమోత్సవముసల్పి రాదిదేవు
గనిన ముక్తులభంగిని కౌరవేంద్రా॥

వ. అంత నా రమాకాంతుండు కాంతాజనపరిశ్రాంతుండై కాంతారంబున శక్తియుక్తుండగు పరమపురుషుంబోలి వారిచేతులం దోడుకొని రంగత్తరంగిణీ సంగతంబైన యమునానదీపులినంబు బ్రవేశించె. నంత నక్కాంతలును విరహవేదనలు విడచి పరిపూర్ణమనోరథులయి హృదయంబున ముదంబులెదుగ ముదుగుచేలంబుల మదనజనకునకు సదయత పీఠంబుగల్పించిన మునిజనమనఃపదంబులనుండు మేటిపాటలగంధు లర్పించు వస్త్రపదంబున త్రిజగల్లక్ష్మీమైన తేజరిల్ల నివశించి మన్మథోద్దీపకుండయిన వెన్నునకుమిన్న సత్కారంబులు గావించి యిట్లనిరి.

క॥ తముగొల్చువారిగొల్తురు
తము గొల్చిన గొలవకున్న తప్పరు గొలువం
తముగొలువ గొలువకున్నను
కమలాక్షా గొలువ రేమికారణమొ ధరన్ ॥

ద్వి॥ అనవినిశౌరితాననియె వారలతో
వనజాక్షులార నే పరుడనుగాను
ప్రాణబంధుండను పరగగామీకు
ధ్యానమబ్బుటకునైతలచితినిటుల
నన్ను సేవించెదు నా భక్తులాకు
పన్నుగా నారూపు పాల్పడజూప
సధనుడా ప్తధనంబు నవనినిబడ్డ
వ్యథజెంది తత్పారవశ్యంబునొందు

కరగి మత్ప్రియుడు నన్గాంక్షించునెపుడు
సరవినారూపంబు సారెకుజూచు
తల్లిదండ్రుల నన్నదమ్ములమగల
యిల్లుబిడ్డల బంధులెల్లవర్జించి
వచ్చినమిము బాయ వచ్చునే నేను
సచ్చరిత్రలు తప్పుసైరించురిపుడు
విరహాభరంబున వివిధభంగులాను
పరుడనౌనను దూరు పలుకులువింటి
పాయనిసంసార బంధంబుబాసు
నాయందు మతినిల్ప నన్ను సేవింప
ప్రతిసేయనేర నన్నాయకగొల్చు
మతియె ప్రత్యుపకృతి మద్భక్తులాకు
సలగి నే బాయుట యది తప్పుగాను
దలచక కృపజూచి తగ క్షమింపారె
అనిపల్కు హరిపల్కు లమృతములొలుక
తనుసంగమంబుల దయితలువిరహ
పరితాపములుమాని పద్మాయతాక్షు
పరికించి గనుగాంచు భాసిల్లిరపుడు॥

తదనంతరంబ.

సేగుప్తిరాగం.

రాసాముజేసెను రాజీవనేత్రుడు రమణులతోడగూడి । భాను రమండల భ్రమణపరస్పరబద్ధ బహువ్రజ బాలవిలాసము॥ రాసాము॥

రాసాముబహువిధ విలసితపటుహస్త ముఖపాద భాసురవిన్యాసము । సహనాయికాదేవ సంఘమానసనేత్ర సదమలవికాసము। విహగగమనుడు చెలియలిద్దరు వీణెలందియు పాటబాడగగహన జంబ గువంశమధరముగందగా చెలువొంది పాడుచు॥ రాసాము॥

కమలకర్ణికరీతి కాంతాలనడుమాను కరమొప్పదావలచియు ప్రమదలెందరు తాను బహురూపిగాపున పరగనన్నిరూపులై । ప్రమ

మున తనకిరుగెలంకుల పద్మనేత్రులు వారికిరుగడ సమముగాతనునిలచి రాసము చక్రగతిగను సల్పినపుడు ॥ రాసాము ॥

కౌనులూటాడగకబరూలువీడగ కడుఘర్మములుబర్వగా। పెనగిహారములు నుడిబడ చిరునవ్వుపెంపొంద మోములపై। తనువులను పులకలుజనింపగ దయితలందరు తననుగూడుక ఘనఘనాంత తటిల్లతాభలు కామమున నటియింపుచుండగ ॥ రాసాము ॥

కలికియొక్కతె ప్రేమ కంఠమాశ్లేషించి కరమొప్పముద్దుగోన। చెలువయొక్కతె కనక చేలాముకరమూన చెలువొప్పబట్టిమూడే। జలజనేత్రియొకర్తువిభుపై సలలితంబుగ కరములూచియు చెలులమధ్యను తారకంబుల చెంతనొప్పెడు చంద్రుభాతిని ॥ రాసాము ॥

సురలుశ్రీభద్రాద్రి హరిమీదపరిమళ సుమవృష్టి గురిపించగా। పరమానందమున నభస్థలినచ్చర పణతులునటించగా। పరగకిన్నర కాంతలపుడు భవ్యముగగానంబుసేయగ సధసగతిచారణులుమ్రోయగ సారెవందిజనంబుబొగడగ ॥ రాసాము ॥

గీ॥ ఇట్లుకృష్ణుడప్పు డింతులతోగూడి
రాసకేళిసల్పి రమ్యముగను
శ్రమకణాపనోద జలకేళిసల్పెను
భాసురముగ నాటి వాసరమున ॥

వ॥ ఇట్లు కృష్ణుం డింద్రియస్ఖలనంబుసేయక గోపికలం రమించెనని విని రాజిట్లనియె.

సీ. ఏధర్మమనిశౌరి యిటుజేసెపరకాంత సంగమంబనయోగి చంద్రుడని
యె। సర్వభక్షకుడయ్యు స్వాహావధూభర్త దోషముొందనిభంగి
దోషమైన। జేసితిత్ఫలమున జెందరుతేజస్వులాట వాసవచంద్రములా
దిగాను। జగదీశ్వరుడుగాని జనుడన్యకాంతను దలచెట్లుమనును
మాధవుడుదక్క।
గీ. పరుడు విషముమ్రింగి బలుకంగగల్గునే
నిజము రాజుపల్కు నిత్యముందు

పెద్దలెల్లనిలుతు రద్దేవుచరిత మ
సత్యసత్యమగుట జరవరాదు.

మ. మునులెవ్వానిపదద్వయంబులు మదిన్ మోదించి ధ్యానించుచున్
ఘనకర్మంబులుబాతురట్టు ఘనుడా కల్యాణుడెట్లున్న నా
తనిబంధంబులునంటునే సకలముం దానైన మానాథుకం
గనలన్యుంగలరెవ్వరాతడు ధరన్ గావించెగాలీలలన్ ॥

వ. అనిచెప్పి శుకుండిట్లనియె. నంత గోపకాంత లరుణోదయం
బున శౌరియనుజ్ఞవడసి ప్రేమలేక ధామంబుల కరిగిన గోపకులు హరి
మాయచే మోహితులై వారి గోపింపనేరరైరి. ఇవ్విధంబున.

గీ. గోపసతులుకృష్ణు గోరివచ్చియుక్రీడ
సలిపినట్టికథయు సవినయముగ
వర్ణనంబుసేయ వాంఛించిచదివిన
వారిచిత్తతాపవర్గమణగు ॥

వ. అని మరియును శుకుండిట్లనియె.

కల్యాణిరాగం.

భూపాలకనమ్మా । కృష్ణునికథ పుణ్యమైనదినుమ్మా । గోపా
లకులగూడి కొమరొప్పనందుడు మాపతిసేవించి మరిసరస్వతిదోగి ।
యేపుగనునిద్రించనురగం బాపియాతనిమ్రింగజూచిన శ్రీపుపదయుగ
రజముచేతను చెలగివిద్యాధరుడునయ్యెను ॥ భూపాల ॥

రామకృష్ణులిద్దరూ । వనమునందు రమణులతోనుండగా । ప్రే
మశంఖచూడ నా మూడుకాంతాలభీముడై గొనిపోవ పెనుమురలిడ
వాకు । కామజనకుడు వెరటబడ్డను కళవళంబున విడిచిపారిన యామినీ
చరుజంపి తన్మకుటాగ్రరత్నము గొనియొనపుడు ॥ భూపాల ॥

ధరవృషాసురుడనేటి । రక్కసుడొకడు దర్పించివనవాటి । సర
సీ జాతునిమంద చాలాభయమునొంద గరచీనగోపకుల్ గావుకొరియు
న్న । సరగుననుభద్రాద్రిధాముడు చాలురానీబంటుతనమని కరయుగం
బునబట్టికొమ్ములు గ్రక్కుననను యిలగూల్చిచంపెను ॥ భూపాల ॥

గీ. ఇట్లు వృషభాసురునిజంపి యేపుమీఱ
గోపగోపీజనంబులు గొలువ తమను
శౌరియును బలరాముఁ సఖులతోడ
మందకేతెంచియుండి రానందముగను ॥

వ. అంత నక్కడ.

సీ. నారదుండొకనాడునయముగాకంసుని కడకేగుదెంచినగాంచియతడు
సత్కరించినజూచిసంయమీంద్రుడుబల్కె కంసయశోదకుగల్గెకాంత
దేవకికుదయించె శ్రీవల్లభుడుమున్ను రాముడురోహిణీభామగనియె
వారిద్దరున్నారు వసుధేశమందలో ననిచెప్ప కంసుడు నల్కజెంది
తనయులను॰మందలోనుంచి తాను మంచి
బుద్ధిమంతునివలె నిందు బొరసియున్న
డనుచు వసుదేవు జంపబో నతనిజూచి
నారదుడు వారివారించి నరిగె దివికి॥

వ॥ అంత కంసుం డలుకదీరక దేవకీ వసుదేవుల లోహపాశబద్ధులం జేసి కేశి యనువానిం బిలిచి రామకేశవులం జంపుమని బంపి మంత్రి భట గజారోహ చాణూర ముష్టికాసుల రావించి వారలతో నిట్లనియె.

వింటిరాచోద్యమూ । వో చెలులారవింటిరాచోద్యమూ । వింటిరా వెంటనన్నంటూ హరిజాలడె । వెంటహరిరాము లీల కంటకము లాడెదరు॥ వింటి॥

మల్లయుద్ధానకు । బిలుపింతునాపిల్లలిద్దారినీ । వల్లాగనుమంచాలను మల్లితలపార్శ్వములనెల్లాబెట్టించి వారెల్లి యని సాటించుడు॥ విం॥
టెమ్ముచాణూరకా । వేగమెరారమ్మువోముష్టికా । యిమ్మహిని మీకు సరిరంమనరు లేరి యీాద్రిమ్మారులజంపి నాసమ్మతిని బొందరు॥ వింటిరా॥

రారగజపాలకా । నీయందున్న సేరూపులు దాపకా । ధీరాతను నాగామును ద్వారామునను ౦చియూ శౌరిహాలివచ్చుచో బీరామణగించవలె॥ వింటిరా॥

యీశునకు ప్రీతిగా । యాగము నేజేసెదను ఖ్యాతిగా । వాసిగను భద్రనగరీశుడీయాగమును జేసుచో వచ్చితే డాసి నే జంపెదను ॥ వింటి॥

కం॥ అని తనవారల నందరి
ఘనముగ నియమించి యదునికాయాధిపుడౌ
ఘను నక్రూరుని బిలిచియు
వినయముతో నతనితోడ వేడుక బలికెన్ ॥

ద్వి॥ వినుము శ్రీయక్రూర విన్నపంబొకటి
ఘనుడ నేజేసెద కరుణచేమనుట
నవని నక్రూరు డంద్రు నీతోడ
నవును సఖ్యముసేయ నఖిలకార్యములు
బలరామకేశవుల్ ప్రౌఢిగా నన్ను
బలిమి జంపెదమని బలుకుచు మంద
నున్నారు వారల నుపమగా దెచ్చి
పన్నుగా నొప్పించ ప్రార్థించెదాను
విన్నానికొక్కటి వేల్పులు నాకు
మిన్నగా వెరచి స్వామిని వేడగాను
అనువుగా వసుదేవునందు శ్రీకృష్ణు
డనునామమున తాను యదుకులమందు
నవతరించెనటండ్రు యదిగాన నీవు
జవముతో జని గోపజనముల చేత
నరులుగైకొని ధనుర్యాగంబు జూడ
గరిమతో రమ్మనగాను వచ్చినాను
దిగ్గజంబులనైన ధీకొని తాకి
మొగ్గించగలది మాపురినుండు గజము
ద్వారంబునందుంచు దానితో వారి
ఘోరించి చంపుడు పొసగ దేనట్లు
చాణూరముష్టికుల్ చటులమల్లప్ర
వీణులు వారల వీడ్కొల్పితైన

సమయించెదను మీద జననిని తండ్రి
నమరగాజాంవుడు నటమీదవృష్టి
భోజదశార్హుల బోరియింతుపిదప
రాజుగ్రసేనుండు రాజ్యకాముండు
జచ్చును నాచేత సమయుదేవకుడు
మచ్చికసఖులతో మహిాయేలెదాను
దెచ్చిచూపవె వసుదేవునిసుతుల
నెచ్చనివ్వగగూడ దిలశత్రులాను
అనగ నక్రూరుండు నతనితోనపుడు
వినయయుక్తంబుగా వివరించిబలికె
పొమ్మనిచెప్పిన పోనెనృపాల
నెమ్మియెరుగరుధర నెరిక్రూరజనులు
దైవయోగమటంచు దలచరింతైన
కావరులై స్వేచ్ఛగతి జరించెదరు
తగదనిజెప్పగా దగదీశ్వరేచ్ఛ
నగుగాక తప్పునే యల బ్రహ్మకైన
భయనమయ్యెదనని బలికివేగమున
హాయయుక్తమైనట్టి యరదంబునెక్కి
జనె నంత కంసుండు జనులవీడ్కొల్పి
తనగృహంబునకేగె ధరణీశుడపుడు॥

రేగుప్తిరాగము.

వినురాజశౌరిశౌర్యామూ। నీకు వినుపింతు ముందుకార్యమూ। ఘనుడుకృష్ణుడు మందనుండగ కంసుచేబంపబడి కేశియునను నిశాచరుడశ్వరూపము ననువుగాధరియించివచ్చెను॥ వినురా॥

వచ్చిమందలోనుజొచ్చి। వైరమెచ్చ గోపకులానుదవ్చి। నొచ్చి వారలనెురలెచ్చా। శౌరివచ్చి వారలకభయమిచ్చి। మచ్చరించియు పరులగానక తుచ్ఛబుద్ధిని పేదమనుజుల ద్రవచ్చినను వాకృచ్చియడిగితివచ్చితింకెటుజొచ్చెదనియెను॥ వినురా॥

నింగిబగులబొబ్బబెట్టి । చెలంగినోరుదెరచిముట్టి । చెంగుచెంగున గంతుబెట్టి । కరువంగరాగజగజెట్టి । దొంగజాడ లికేలరా నీ పొంగు గుంగగజేతునని యు పతంగనాధుకు ఫణినిబట్టినభంగి పదములుబట్టి వైచెను॥ వినురా॥

పారావైచినవాడుఖోకా । మిగులబీరాముచే వెంటదాకా । వాని నోరునభీతిలేకా। శౌరికరమునుంచి బెంచివీకా। ఛేరివలెకడుబుబ్బ రక్కసు డరుచుచు తన్నుకొని ప్రాణముదారిబట్టిన దోసపుందుగ తక్షణము కడు పగిలి జచ్చెను॥ వినురాజ॥

గోపాలులందారు ప్రేమా । కొండదాపున క్రీడించసోమా । స్తోత్రపనాముడునాసీమా । జేరిగోపాలకులగూడిభీమా । రూపుదై వార లనుదాచిన పాపరాక్షసు మాయదెలసియు కోపమున హరివానిగన్గొని యేపుమీరగ ననియె నిట్లని॥ వినురాజ॥

బాలాకులనుదాచినీవ్రా । యింకలీలసల్పగవచ్చినావ్రా । చాలాదెలిసెదొంగలావ్రా । రారకాలూనిపురికేగెదావ్రా । మేలునని భద్రాద్రినిలయుడు హేలబట్టినజెనగలేకను కూలెకుంభినిసోమరక్కసు డేలవచ్చితిశౌరికడకని ॥ వినురాజ ॥

సీ. ఆసమయంబున హరిమీదనమరులు సుమవృష్టిగురిసిరిసురుచిరముగ।
నారదమునివచ్చి నలినాక్షునుతియించి బల్కెనుమీచేత ప్రౌఢిగాను।
జేయగానున్నవి జెప్పెదకార్యముల్ కంస చాణూరక కాలయవన।
పౌండ్రకశిశుపాల పటుదంతవక్త్రాదు లాజిలోజత్తురు మీజవమున।

గీ. పారిజాతంబుదెచ్చుట పరగనృగుడు
శాపముక్తుండునగుటయు సంభ్రమమున
నర్జునునకును సారధివయ్యు నిఖల
భూమిపాలుల జంపుట పొసగననును ॥

గీ. ఇంకగలిగిన కార్యముల్ శంకలేక
జేతురని చెప్పి మ్రొక్కియు ఖ్యాతిగాను
జనియెనారదమునియంత శౌరి గోప
బాలురతోనేగె మందకు ప్రౌఢిమీర ॥

వ. అంత నారాత్రి యక్రూరుండు మధురాపురంబున నుపవసించి నియతేంద్రియుండై మరునాడు రేపకడ రథంబెక్కి గోకులంబునకుం జనుచు మార్గమధ్యంబున నిట్లని వితర్కించె.

ఆనందభైరవి రాగం.

ఏమినోము నోచితినో యీవేళ్ళనూ। నాసామిమోముజూడగలిగె చాలనాళ్ళకూ। నీమమూతో మానులైన కామించియోగదృష్టిచే శ్రీమందీరుగాన లేరీ పామరూన కెటుగల్గు ॥ యేమి ॥

సూరూలు యేవిభుపాద సారసంబులా। జేరిభవతిమిరముందుజిక్కకుందురా। శ్రీరమే ఉపగచేన్నైన జేరబంచెనన్నుమేల్ నిష్కారణపు ప్రేమచేత కంసుబోలుసఖులుగలరె ॥ యేమి ॥

యితడుకంసుపంపుచేత నేగుదెంచినా। డతిదుష్టుండవిదలచును నన్నాదరించునో। మతినూహించి యీశుఢౌటమన్నించునో బలుకకున్న మతిదోచాదు యేమిసేతు మరినాభాగ్యమెట్లున్నాదో। యేమి॥

అలకాంచితమై చంద్రుబోలి హాసయుక్తమై। జలజాతుంబై కర్ణకుండలచలద్గండమై। విలసిల్లెడుశౌరిమోము వేగానెజూచెద నిక్కము నలదిక్కుగుచున్న విపుడు వనమృగంబులీత్రోవను ॥ యేమి ॥

మాపాటికేజానిశౌ మహానియ్యపాద। శ్రీపద్మములా పైనబడ్డ చెలగిసద్భక్తా। ఆపదంధతిమిరమణచు నరునాబ్జాముబోలు కరముమోపి భద్రగిరిపతి యభయముకృపతోడనియ్యకున్న ॥ యేమి ॥

సీ. అనియిట్లుబల్కుచునక్రూరుడప్పుడు బృందావనమునకుపొందుమీర।
జనుదెంచిహరిగాంచి చక్కగాంమ్రొక్కిన చెయిజాచికౌగిటజేర్చిహరి
యు। బలరామునకుమ్రొక్క పరగనాలింగనం బొనరించెముచ్చట
పొందుమీర।మందిరంబులకేగి మరిసేమమడిగియు నాసనంబిచ్చియు.
నర్ఘ్యమిడియు।

గీ. నవరసాన్నంబుబెట్టించి నవ్యగంధ
మలది తాంబూలమిచ్చియు నబ్జనేత్రు
డతనితోనుండ నందుండు హర్షమొదవ
సత్కరించియు బలికెను సఖునితోడ ।

క. చెల్లెలు మొర బెట్టంగా
నల్లరబారిగొన్న కంసు డటబ్రతికుండక
జెల్లునెదశౌహ్వా నేమం
బుల్లంబున దలపననుచు నూరట లేక ॥

వ. అనంతరం బక్రూరుండు శయ్యయందు సుఖోపవిష్టుండై శౌరి యిట్లనియె.

గీ. జయ మెనీకు నెల్లజనులకు సేమ మే
బంధువులకు మేలె పరగ వంశ
జనుల కెల్ల శుభమె సరసుడౌ మామామ
కంసుడభయుడే సుఖంబె ధరకు ॥

వ. అని మరియు నిట్లనియె.

పున్నాగరాగం.

ఏమాని రక్రూరకా । మాతలిదండ్రు లెట్లుండిరక్రూరకా । ధామాము నుంచియు దర్శిరాగ నీవు బామూలబడ లేక పలుమారునీతోడ॥ యేమాని ॥

కారాగృహము నందునా । మజ్జననామె కాగాణముగ బద్ధులై । కూరిమితలిదండ్రు లేరీతి ప్రాణాముల్ ధాగాణ జేసుక తగ బ్రతికుండిరా । యేమాని ॥

నాతోడ జెప్పూమనీ । యేమైన పేర్ఘూతాలకొప్పెమనీ। మాతతండ్రిబల్ వేతాల జెందియు సుతులుగామమ్ము జూతురో తోతురో ॥ యేమాని ॥

మనకు దిక్కెవ్వరనీ । మదిదోచియు ఘనముగకృశియింతురా । ఘనులైనపుత్రుల గనియిట్టులాయను ననపురాకృతమని మదిదలచుం దురో ॥ యేమాని ॥

మమ్ముగనుట చేతను । తలిదండ్రుల కుమ్మలిక ముగల్గెనూ । కొమ్మనిమ్మనిమా యమ్మవేడినకడు దుర్మార్గుడగు మామ నమ్మాతిపడ నందు ॥ యేమాని ॥

యెపుడుభద్రగిరి । నాయకుడాని యొప్పూగదలచూడు రా ।
జెప్పూముమామాను తప్పాకవధియించి నప్పుడుగదమా తప్పాతు మిం
చూట ॥ యేమాని ॥

వ. అని శౌరియడిగిన వారలవృత్తాంతం బేమియు జెప్పనేరక
నూరకేనుండె నంత.

మ॥ మరిమీరేటికివచ్చినారనిన నోభూనాథ నిత్యంబు మీ
చరణధ్యానపరుండు నారదుడు నోజంజెప్పె వేగంబుగా
హరిశ్రీకృష్ణుడటంచు వాడలగి మీయమ్మయ్యలఁజంప స
త్యగుడయ్యెఁ హరి మిమ్ము దెమ్మనెననుఁ దచ్చాపయాగార్థమై॥

వ. అని పలికిన రామకృష్ణులు నగి యూరకుండిరపుడు నందుం
డు గోపకులంజూచి భూపాలుండు చాపయాగంబు సేయందలంచి మనల
బిలిపించె మీమీశక్తికొలది పాలు నెయ్యి పెరుగు గూడబెట్టి రథంబు
లాయితంబు జేసుకొని యుండుడని నియమించె నంత నక్రూరుండు
శౌరిందోడ్కొని పోయెడునని గోపసతులు మనంబులంగలంగి.

ద్వి॥ అంతగోపాంగన లాత్మలోపలను
సంతాప మొందియు శౌరినవ్వులు
మాటలు చూపులు మరిమన్ననాలు
నేర్పైనసేతలు నెరిదలచిదలచి
కాంతలుయిళ్ళలో గములుగాగూడి
వింతగానిట్లని విలపించిరపుడు
కొమ్మరోయాబ్రహ్మ గొప్పగృహస్థు
నమ్మకమనిచాల నమ్మితిమమ్మ
తెలిసెనీతనిగుట్టు తిన్నగాహరిని
నిలువకుండగజేసి నెలతలసుఖము
పడుచులాటలుజేసె భారతికైన
కడుజెప్పరేయనె కంజాక్షియొకతె
రమ్మన్నమాత్రాన రాజీవనేత్రు
డమ్మరోవచ్చెద ననిగానిసతులు

నమ్మియుండిరివిడ నాడగా రాదు
కమ్మవిల్తుడుచాల గాసిబెట్టనుచు
తలచడాయనుశౌరి తలిదండ్రులైన
నిలువుపోవద్దని నేడనరైరి
అక్రూరుడటయిత డక్రూరుడేని
చక్రినివిడిచటు ననుజనత్రోవ
పురసతుల్ హర్మ్యాగ్ర భూములనుండి
వరసువర్ణాక్షతల్ వరుసజల్లంగ
గనివారిచెలువమే గాంక్షించగాని
వనజాక్షుడేటికి వాంఛించుమనల
గేపల్లెయందున్న వ్రేతలెక్కడ
చూపగులగురాజ సుందరులేడ
సరసంపుమాటలు చారుహాసములు
సరగంటిచూపులు నాభోగములును
మరిగియెల్లడుశౌరి మగువరో రాజు
లరిదినూతనప్రియు లమ్మహో కొమ్మ
హరినెన్న డెరుగసి యబలలకతని
వరుశేసిదైవంబు వ్రజసుందరులను
పటువిరహాగ్నుల పాల్ జేసె నేడు
విటునిపోవద్దని వేడుకుందామ
వరదునిగానిపోవ వద్దనియతని
పరిపరివిధముల బతిమాలుదామ
వింతదేవతలను వేడుకుందామ
కాంతుడుబోకుండ కాళ్ళపైబడుద
మనివారలవుడు సగులచేలములు
తనువునదాల్చక తగబొప్పవిడక
వగచేతమన్మథ వ్యథజెందియవుడు
తొగలబో లెదుకన్ను దోయినీరొల్క

చెక్కుటచెయి జేర్చి చెలులరక్షించు
చక్రిమాధవయని సఖియలందరూను
గూడిగీతంబుల కొమరొప్పగాను
బాడియేడ్చిరివిరహ బాధచేవారు
అంతటవారునాటి యరుణోదయమున
కాంతలుతోడరా గమకించవారి
వలదనిదూతికా వదనంబులాను
బలరామకృష్ణులు పటురయంబైన
రథముపైకాన్కలు రసములుబెట్టి
మధురాభిముఖముగా మరిబోవజూచి
అదెశౌరియేగె డల్లదె రథముజూడు
డదెతురగాంఘ్రిజమా రజంబనుచు
నిక్కచూచిరిసతుల్ నేత్రపద్మముల
మక్కువమీరగా మాధవునపుడు ॥

సీ. అంతనక్రూరుడు నన్నయువెంటరా జనిగాంచెకృష్ణుండుచంచదూర్మి మాలియైచెలువొప్పు కాళిందినదియందుజలముపానము జేసిహాలినిగూడి తరుమూలమందునతనురథంబెక్కియునుండనక్రూరుండుదండమిడియు కాళిందినదికేగి కడుజలంబులదోగి వేదమంత్రంబులు విధిజపించి

గీ. యందులోపలవారల నమరజూచి
యరదముననున్న వారలి య్యెడకు నెప్పు
డరుగుదెంచిరోయనిలేచి యుటనురథము
నందుగాంచియు వెరగంది యులరుచుండె ॥

రేగుప్తిరాగం.

కాంచెనక్రూరుడు కాళిందినదియందు కమనియ్యరథముపై న। రామకృష్ణులకమనియ్య రథముపైనా ॥ గాంచితిని నేమున్న రథమున గాంచితినిరథమందుమురలను మంచిదిండులమునిగిజూచెద నంచునందుల గాంచివేడుక ॥ గాంచె ॥

కంజజాదిసుర పుంజవందితపాద కంజాతములవాని । మంజీరము ఖచిత మహానియ్యావేదాంత పుంజాముగలవాని । మంజులంబుగ బొడ్డుద మ్మిని కంజజునిగన్నట్టివానిని హారాంజిగిన్న గుకనక చేలము వనరకటిపై దాల్చువానిని ॥ గాంచె ॥

పాపరేనియందు బవళించిభక్తాఘు పాళిముల్ గోయువానీ । యేపుగానుదరమి యెల్లలోకములకు ప్రాపుయ్యయుంచువానీ । ఆపదం బులచెంతనుండెడి యులతటిల్లతవలెనురంబున కాపురంబుగనుండులక్ష్మీ కాంతతో చెలువుందువానిని ॥ గాంచె ॥

కంబుసన్నిభమైన కంఠముగలవాని కౌంస్తుభమణిహారుసీ । డం బమీరెడుమేల్ బింబాభమగునధ రంబుగల్గినవానీ । అంబుజంబుల బోలుకన్గవ యందమగుచంపకమునాసిక శంబరాంతకు వింఢ్లబోలియు చెలువైనకన్బొమలవానిని ॥ గాంచె ॥

పున్నామచందురు కన్నకళలచే జెన్నొంమమోమువానీ। పన్ను గనుదుటాను వన్నెగదిద్దిన సన్నకస్తురివానీ । యెన్నగాముఖపద్మమం దున నున్న తావినిగ్రోలవచ్చిన మిన్నైనభ్రమరాళిబోలిన తిన్ననౌముం గురులవానిని ॥ గాంచె ॥

నవరత్నఖచితమై నలినాప్తశతరుచి నమరుమకుటమువానీ । నవనీలనీరద నవ్యరుచినిమించు నల్లానిమేనువానీ । ప్రవిమలంబగురత్న భూషణ ప్రకరములజెన్నొందువానిని యువకుశాంకుశచక్రరేఖల నలరు పాదతలంబువానిని ॥ గాంచె ॥

అట్టిభద్రశైలాధిపు గనితాను. గట్టిమతినిమ్రొక్కియూ ॥ యిట్టి చోద్యము మున్నెందుజూడనని బుట్టుసంభ్రమమునూననూ । గట్టిగానంజ లిరొనర్చియు కామజనకమురారిమాధవ యిట్టిరూపమునాదుమది నె ప్పట్లజూపుమటంచువేడుక ॥ గాంచె ॥

సీ. అనియనేకంబుగానభినుతించినకృష్ణు డంతహితుండయ్యెనంతమీద నక్రూరుడాత్మలో నతివిస్మయమునొంది వచ్చియారథమెక్కి నచ్యు తుంను । జలముచేరువనుండి జని తడువాయెనే వింతగంటివటన్న వేడ్కనవ్వి।నీలోనలేనట్టి నెరిచోద్యమున్నదే నింగినిధరణినినీటియందు

గీ. ననుచుబలుకనతడు న స్తమయంబున
మధుర జేరనడిపె రథము ముందు
నందుడరిగి యుపవనంబుననుండగా
వారిగూడవచ్చి శౌరియపుడు ॥

క. అక్రూరుని వీక్షించియు
చక్రిబలికె రథముగొనియు జనుమీ వేనుం
గ్రక్కునవత్తునటంచన
నక్రూరుడుబలికెనప్పు డబ్జాక్షునితోన్ ॥

ఉ. నాయిలు కేగుదేరు యదునాయకనీవన శౌరిబల్కె నా
నోయి మదాంధులై మనలనోర్వక యుండెడి కంసుజంపి వి
చ్చేయుదునీగృహంబునకు చెల్వుగబొమ్మన బోయికంసుతో
నాయనరాకదెల్పిచనె నప్పుడు పౌరులు మేలుమేలనన్ ॥

సీ. అంతటశౌరి మధ్యాహ్నంబునను శీరి గోపాలకులగూడి కోర్కెమీర
పరిఘలుకోటలుప్రాసాదహర్మ్యముల్ రథగజవ్రాతముల్ రాజవీధు
లశ్వముల్వరభటులఖిలపదార్థముల్ గలయట్టిమధురనుగాంచియందు
రాజమార్గంబున రాజూచిశౌరిని సుందరులప్పు డానందముగను
గీ. చేయుచుండెడిపనులందు చిత్తమిడక
పౌరకాంతలు గుమిగూడి చారుకనక
మణిఖచితసౌధభూముల మంజులముగ
నిలిచిచూచిరి ముదమున నీలవర్ణు ॥

వ. ఇట్లుజూచి యన్యోన్యంబుగా వారలిట్లనిరి.

బేగడరాగం.

వీడటె శ్రీకృష్ణుడు వీడటె। వీడటెభోజవిభుడైనకంసుని తో
డబుట్టినదాని తొరంపుకొమరూడు ॥ వీడటె ॥
పూతనయనుయాతుధానిచనుల పూతగ విసమూని పాలతిరూ
పునవచ్చి। నాతంద్రియాకొంటివే త్రాగుపాలన నాతిచన్నుగుడిచి గీ
టార్చినవాడు ॥ వీడటె ॥

నున్న దిన్న దాని యన్న దెలుపతల్లి తన్ను కోపించిన తగనోరుదె రచియు । సన్నుతాంగిలేదు మన్నించుమనియందు వన్నెమీరజగము లన్ని జూపినవాడు ॥ వీడటె ॥

గోపగృహములందు నేపుమీరగజొచ్చి యాపోవమీగడ యంత మెక్కనజూచి । యాపణతులువచ్చి యమ్మతో దెల్పిన పాపనివలెతల్లి పక్కకొదిగినవాడు ॥ వీడటె ॥

మందనుండుగోప సుందరులనుమోహ మొందజేసియూ బృందావనమునందు । పొందుమీరవారి డెందములు గరగించి పొందినట్టిలోక సుందరుడగువాడు ॥ వీడటె ॥

సామీనిగూడియు సరసములాడుచు కామించియాతని కౌగిలించుచునుండ । నేమినోములువార లెందునోచిరోమన కామూనిబొందని కాయమందుకెచెలి ॥ వీడటె ॥

వాసిగభద్రగిరీశుడునిరతాము దాసూలపోషించు తలపుగలిగియూ । వాసవాదిసుర వ్రాతాము ప్రార్థింప భాసూరముగజగతి ప్రభవించినహరి ॥ వీడటె ॥

వ. అని యిట్లు పౌరకాంత లా రమాకాంతుని వింతైన రూపం బంతకంతకు చెంతగాంచి స్వంతసంబున లతాంతంబులు జల్లిరి. భూసురులు వాసుదేవుని ఫలాక్షతకుసుమంబుల బూజించి రా సమయంబున రంగద్వారంబున నేగుదెంచు రజకుంగాంచి హరి యిట్లనియె.

పంతువరాళిరాగం.

రమ్మురజకచక్రవర్తీ । మేలైనచేలము లిమ్మురజకచక్రవర్తీ । నిమ్మతోడరాజుమమ్ము రమ్మనగవచ్చినాము సమ్మతిగను కట్టదగిన చారుచేలములిమ్మమాకు ॥ రమ్ము ॥

కోపగించబోకుమమ్ము । నీమాటనున్న చాపులన్ని జూపుసుమ్ము । భూపతిపుడుగట్టుకొనెడి చాపులిమ్మన్నను కాకు గోపకులకుసాటిరాజు లేపుమీరగట్టివిమ్ము ॥ రమ్ము ॥

కల్లగాదు మేమునృపతికీ । ప్రియమైన మేనల్లురాము నేటిరోజుకూ ।

ఉల్లమునను దయలుగల్గె నల్లురానుజూడమామ కెల్లిరేవుజూడుమామా తల్లిదండ్రుల బాధదీరు ॥ రమ్ము ॥

చాలకాంతిగలిగియున్నవీ। వెన్నెలలబోలి మేలిచలువజేసియున్నవీ। మేలుగలుగురోరినీకు మెచ్చివలువలిచ్చినాను బాలుడనుచు ధిక్కరించ పైనమోసపోయ్యెదావు ॥ రమ్ము ॥

గొల్లడనుచు దలచబోకురా। శ్రీభద్రశైల వల్లభుండనుచుదలచరా। కల్లగాదురోరిరజక జెల్లకున్న నాదుమాట యెల్లవారుజూడశిరము ద్రుల్లజేతుసుమ్మునమ్ము ॥ రమ్ము ॥

వ. అని పలికిన రజకుండు కోపోద్దీపితమానసుండై యిట్లనియె.

పంతువరాళి.

ఎట్లాయెట్లామళ్ళీబల్కరా। వోరోరి బాలక యెట్లాయెట్లామళ్ళీబల్కరా। గట్లావైరిమారాజూచె పాట్లాబడుమిగులాండ్లీతే పీట్లుబగులా గొట్టింతూ నిప్పట్లనైన నోరుమూయ్యి ॥ యె ॥

దొరగట్టుటియంబరంబులు। నికియ్యగ తరమెవడ్లీసంబరంబులూ। పెరుగునెయ్యిపాలుద్రాగి బ్రేలెదావుమదముచేత పరులుగట్టజాలూదురె ఒదరాకు యిట్లాడదగదు ॥ యె ॥

గొల్లాలాటజెల్లెగాకనూ। యేరాజునకైన జెల్లూనా యిట్లామాటాకునూ। పిల్లవాపుయెరుగవింక ప్రియములురా ప్రాణములు బల్లిదుడా రాజుసొమ్ము భళిరాయెంతసాహసుడవు ॥ యె ॥

రాజరాజగృహామునందునా। నీకేలబాలక రాజసంబువినవదెందునా। భోజుడంటినింతచుల్కన గాజూచెదుదారిదొలగ రాజూలయిన మాదొరముందున రాజసంబులు మానియుందురు ॥ యె ॥

వాసవాదివిబుధమాన్యులూ। మారాజుముందర దాసూలవలెనుండెధన్యులూ। వాసిగానుశ్రీభద్రాచలేశూడు గౌరీశుడు వాగీశుడు దక్క నన్యులు గాసిజెందెదరు గొల్లడ ॥ యె ॥

గీ. అనినవిని శౌరికోపించి హస్తమునను
వానిశిరమూడదన్నిన వసుధబడియె

వానివారలు మాటలు వదలిజనిరి
శౌరిధరియించె చేలముల్ సంతసమున ॥

వ. ఇట్లువానిజంపి కొన్నిచేలంబులుతానుధరియించి కొన్నియన్నకు గోపకులకొసంగి రాజమార్గంబున జనుచుండ.

సీ. పాయకుండొక్కడు పటుభూషణములివ్వ ధరియించి బాలదంతావళముల । లీలబోవుచు పుష్పమాలికాకారుని సదనంబునకు నేగ చాలభక్తి । బూజించి నుతియించి పుష్పమాలికల వాడర్పించె నంతట నబ్జనాభు । డవిధరించియును తానతనికి వరముల నిచ్చెదనన వారు నివియుగోరె ॥

నీచరణకమలసేవయు నీపదార్చ
కులతోనెయ్యంబు పరనంబు కోర్కెమీర
భూతదయనాకునిమ్మన పొందుమీర
నిచ్చి సంపదనిచ్చి వానిల్లువెడలె॥

ద్వి॥ నలిననేత్రుండవ్వుడు నయముగాగాంచె
సలలితలేపభాజనములుచేత
గొని యేగు కుబ్జనుకోర్కెమీరంగ
గని యిట్టులనియెను కమలనేత్రుండు
యెవ్వరిదానవే యిందీవరాక్షి
జవ్వని పేరేమి చయ్యనగంధ
మెవ్వరికై గొని యేగెదవిటుల
నివ్వటిల్లెడుజూడ నీసుందరాము
అన కుబ్జ యిట్లనె యదునాథుశౌడ
వసవాత్ చక్కని వాడనటంచు
సరసంబులనుదెప్ప జనదిలపరుల
మరిచక్కదనముంటె మంచిదేనీకు
నను కుబ్జయనిభువి నరులందురెప్పుడు
వినుకంసుదాసిని విమలగంధాను
లిచ్చెటిదానను యీభోజునాకు

మెచ్చునన్నాదార మేచకవర్ణ
యిచ్చెదగొనుమని యిభరిపుమధ్య
మచ్చికవారల మాటలతనుల
సొగసైనచూపుల సుందరిగరగి
వగకాని కొనగెను వాంఛచే కుబ్జ
అత్తరి హరిలేప మలదిప్రసన్న
చిత్తుడై కుబ్జను చెలువొప్పజూచి
యొడలుచక్కగజేయ నూహించిదాని
మిడిపాదములమీద మెచ్చిపదములాను
కరయుగాగ్రముబట్టి కరయుగంబులాను
సరిగమీదికనెత్తి చక్కనిదయ్యె
మరునయ్యగని చెలి మమతగట్లనియె
అరుదెమ్మ నాయింటికని కొంగుబట్టి
దిగిచెనుమరుకులోతీవరించంగ
నగి శౌరిబల్కెను నయముమీరంగ
కామినినాదగు కార్యమ్మునంత
నీమందిరమునకు నేవత్తునమ్మ
మనిబాపి శ్రీకృష్ణుడన్నయుతోను
జనె ధనుశ్శాలకు సయ్యననపుడు
సురరాజధనుకన్న సుందరంబయ్యె
వరవీరగుప్తమై బరగుచాపంబు
పొడగనిభటులటు బోకుమనంగ
వడినేగినగుచును వరబంధులెల్ల
మేలుమేలననెత్తి మెచ్చుహస్తములను
జ్యాలతగూర్చియు చాలమ్రోయించి
విరిచెనుదానిని వేడ్క కుంజరము
వరసాలమునుద్రుంచి వైచుచందమున
కోదండనిర్భిన్న గురురవముకంసు

మోదంబు బీరంబు ముందుగా నణచె
ధనువుకావలివారు తనుగొట్టరాగ
ననుజుండు దాను వారందరిజంపి
చాపఖండంబులు సయ్యనబూని
యేపుమీరగ వార లిద్దరుగూడి
మధురాపురంబంత మరిజూచిజూచి
మొదలున్న చోటికి ముదమునజనిరి॥

వ. అంత భానుం డస్తసానుమంతంబున కరిగిన.

క. ఆరాత్రిగోపయుతుడై
శ్రీరాన్నమునారగించి చెలువొప్పగ కం
సారంభమెరిగి యుష్టవి
హారంబుల నప్రమత్తులై యుండిరటః.

మధ్యమావతిరాగం.

మరణచిహ్నాలుదాల్చెనూ । కంసూనకపుడు మరణాచిహ్నాలు దాల్చెను॥ మరణాచిహ్నాలుదోచె త్వరగాకంసూనకపుడు పరగ శ్రీకృష్ణు తోడ పగబూనదలచుటాను॥ మరణ॥

కర్ణాపుటమునందునా । కరములనుంచి కర మొప్పగాను ము య్యానూ। సరవీగ లోప్రాణశబ్దముపరికింప నురువణంగియు నేమియును వినబడకుండె॥ మరణ॥

తోయాదికములందునా । వంగిచూచిన కాయముమీాదటాను । తోయదాయానుశిరము తోట్రుపాటూనుగదిరె వాయాసములు మీాద వదరాగదోణగెనపుడు॥ మరణ॥

కరమునాసామూమీాదటా । నుంచిచూడగ గ్రహతారకము లె ల్లనూ । వరుసరెండయ్యెదోచె ధరణీపైనను తనచరణాము బెట్టినజాడ చక్కాగదోచదాయె॥ మరణ॥

యెండానునిలుచుండియు। వీక్షించగానుమెండైన తనదేహమూ। నిండారంధ్రములయ్యె నెరిదోచెతనదునీడ మెండూతరువూలు హేమ మటులట్లు గానుపించె॥ మరణ॥

మరికలలోనుతాను । తనచేతాన గరళముగ్రోలింగినట్టులూ । ఖర
పతి నెక్కుటాయు శిరమూన తైలామునుధరియించుటాయు శవమును
తా కౌగిలించినటుల। మరణ॥

ధరరక్తమాలికాలనూ । ధరియించి భద్రగిరినాథుజూచి భీతినీ ।
వరలూచి నొంటిగాను। ధరపాదచారియయ్యు పరుపీడుచున్నయటుల పర
గ కాలూని దిశకు॥ మరణ॥

వ. ఇట్లు కలగాంచి మరణహేతువను చింతచే నిద్రించక వేగిం
చుచున్న సమయంబున సూర్యోదయంబయ్యె నపుడు॥

సీ. వల్మీకపాషాణవర్గశూన్యంబులై శ్రీగంధజలకణసిక్తమగుచు
పుష్పదామధ్వజపుణ్యతోరణమణిప్రాంచమై మండితమంచమయ్యు
భూసురాదికవర్ణపుంజకోలాహలంబయితూర్యనిస్వనావార్యమగుచు
పుణ్యమానవముదిబోలినిష్కల్మషంబై సైన్యయుతమయ్యునఖిలలోక
జనము ఉల్లంబులను చాలసంతసమున
దంతివరదుని గనగ నా చెంతనుండు
మల్లరంగంబునందున్న మంచమునను
మాన్యులగు మంత్రివరులతో మనుజవిభులు
గొలువ కొలువుండి కంసుండు నలుకజెంది॥

వ. తదనంతరంబ.

క. చాణూరముష్టికాదులు
నానాబగు బిరుదులన్ని నయమొప్పంగా
బూనియు తూర్యరవంబుల
భూనాథుని జేరిరపుడు పొల్పెసగంగన్.

పంచచామరము. నందాదులగు గోపబృందములు కానుకలు
ముందరికి రాజునటు పొందుగాగాంచక । అంది కాన్కలు వారినందరిని
మంచంబునందుగూర్చుండుమన నందుండిరంతట । యింది రేశుడు మల్ల
దుందుభిధ్వని వీనులందుబడెనన్న తానందలంకృతులై । యందుమామను
జూడ జెంద రంగద్వారమందుండు గజమునేపందోలె వాడున్.

వ. ఇట్లు దోలు గజపాలుండయిన అంబష్ఠునితో హరి మేఘ గంభీరభాషణంబుల నిట్లనియె.

ద్వి. వినరోరి గజపాల విశదంబుగాను
ఘనశైలనిభమగు గజరాజునిపుడు
మామీదపురికొల్ప మర్యాదగాదు
ప్రేమతోద్రిప్పు నీ బిగువుజాలించి
లేకున్న నిన్నిల లేకుండునటుల
భీకరకరఘాత భీష్మాశనులను
జంపుదుననితాను చక్కగాకొప్పు
నింపుగాసవరించి యిందిరేశుండు
గాంచు జనంబులు కడుచోద్యమంద
సంచలించెటి కురులు చక్కగాద్రోచి
గజముమీదికిబోవ గజపాలుడపుడు
నిజకరిశీకొల్పె నేర్పుమీరంగ
హరియును గజరాజు నన్యోన్యగతుల
నరిగబోరుచునుండ శౌరసాక్షుండు
బీరంబుదీరంగ పిడికిటబొడువ
సారంబుచెడి కరి చయ్యనమ్రొగ్గి
నేలబడ్డను దాని నేర్పుతోద్రొక్కి
కేలను కొమ్ములు కినుకతో బెరుక
విడిచిప్రాణములు నుర్విస్థలిబడియె
వడి దానికొమ్ముచే వానివధించి
హరిరాములిద్దరు హస్తిదంతములను
వరుసమూపునదాల్చి నయ్యారముగను
మల్లరంగంబున మరివైరులాకు
పల్లగానటువంటి వజ్రంబుబోలి
మనుజులకెల్లను మహినాధుడగుచు
వనజాక్షులకునెల్ల వనజాస్త్రుడగుచు

బాలులకెల్ల గోపాలుడై దోఁచె
కాలునికైవడి కంసునకుదోఁచె
మూఢులకెల్లను బుడుతడై దోఁచె
చూడ తలిదండ్రికి సుతుడయ్యెనొప్పె
క్ర్వారులకెల్లను కులిశమైయొప్పె
భూరిస్నేహితులకు పూర్ణేందుడయ్యె
బంధువులకు ప్రేమ బంధువై దోఁచె
కందువశాంతుడై గాంచె మానులకు.

వ. అంత కంసుండు పాతంబయినమాతంగంబును భ్రాత సమేతుండై మల్లరంగంబునకు వచ్చు హరింగాంచినొచ్చిన మనసుతో మంచంబునందుండె నంత.

కేదారగౌళరాగం.

గాంచిరపుడుపౌరకాంతాలువురుషూలు కామసుందరునందులా। ప్రేమమీర కామసుందరునంకులా॥ అంచితంబుగ వస్త్రభూషణ సంచయాలంకృతుల ధీరులమించి రంగధరావిహారులబెంచి కన్నులకరువుదీరగ॥ గాంచి॥

హరిశ్రీవదనాబ్జ వరమయూఖసుధానుసరవి కన్నులద్రావుచందమునను గాంచి। పరగజిహ్వాలనంటిజూచెటిభంగి నుతిసేయుచునుకరముల వరునిపరిరంభించురీతిని పలికిరిటు లన్యోన్యభామల॥ గాంచి॥

పసిబిడ్డలనరాదు పరమాత్ములగువీరి వెసశౌరిగృహమున విష్ణునంశనుబుట్టి। వసుధపూతనజంపి మద్దులువరుసగూలిచి బకునిజంపియు కసిని కాళియుమదమణంచిరి గాన మనుజులె వీరలనుచును॥ గాంచి॥

గోపుడై ధరమెత్తి గోత్రారివంచించె గోపకాంతలమదిగోర్కెలుదీర్చెను। చూపరులకు నందసుతుడై సొంపుగుల్కెను భద్రనగపతి శ్రీశుడని మదియందుదలచుడు బాపుభయములననుచుబలుకుచు॥ గాం॥

వ. ఇట్లు పౌరకాంత లన్యోన్యంబుగా భాషించు చున్నయెడ కృష్ణునితోఁ జాణూరుం డిట్లనియె.

సీ. వనమందుగోపాలవర్గంబుతోఁగూడి పెనగనేర్చితివని వినియు రాజు। బిలిపించెమిమ్ములబట్టి మల్లాహవక్రీడకు జనులంత జూడగాను। మనముమీఱగవలె మరిసాముగలదెమేల్ స్వత్రాణమేమేను జవముశీల। మునులెస్స రాజు మిమ్ములబంపవలెన నా ఘనముష్టిపోటుకు గదల కుండ।

పవివో యముదండమవ్వ శంభుపాలశిఖవో
వెన్నముద్దయుగాదురా మిన్నద్రిమింగ
వినుము జనములు నేర్చినవిద్య రాజు
కొఱకు బెనగుము నాతోడకొంత కృష్ణ॥

వ. అనిన కృష్ణుం డిట్లనియె.

రేగుప్తి రాగం.

వినరచాణూరా। తనప్రజ్ఞలు తనుజెప్పమేరా। పెనగగ నేరాము పిల్లలాము నీకెనగాము మాతోడయెందుకీవాదాము॥ వినర॥

సాములురావ్వా। జవసత్వములుచాలాగ లేవ్వా। భూమిమీఁ రలు సంగ్రామశూరులు కులిశసమకర్కశదేహులౌమీకుసరిరాము॥వి॥

మీముందరాను। నిలువగానుమేముజంకేమూ। గామించిధర ణీశుకడ వేడ్కకు మేముసాముసేయము ధనములేమివ్వఁగోరము॥వినర॥

అయినానుగానీ। నీతోనేనేపైనేమిగాని। వయసూనపెద్దమా వాడురాముడుశత్రుంజయుడు ముష్టికుతోడసలుపవ్వానుసమరాము॥వి॥

అటమూర్ఖుడావు। శ్రీభద్రాద్రిపతిననుకోవ్వా। మతిహీన నీ తోడజత సేయ నేనుభూపతికింకరుడగాను పార్థివేంద్రుడగాను॥ వినర॥

కల్యాణిరాగం.

యెంతౌటివాడావురా। నాతోబోరునంతౌటివాడావురా। వింత దోచును నాయంతవాడవుటోరి వంతూలుబెట్టుట కింత చులకనాయ। సంతతిని గుణములనుకర్మనుసాటిగల్గిన రమ్ముబోరను వింతగాకాములు జూడగ గంతులిడుటలుగాదుబాలక॥ యెంతౌ॥

భవునైన బ్రహ్మనా। నాజిని యాపవనూని గుహునినైన। కవ సేయ డెవ్వాడు ఘనబాహుశక్తిని బవరమన్నను రేపన డవుడె వచ్చు।

నవనిచాణూరుండు బలుడనియండ్రుమల్లులు నన్ను నెపుడుజవమున నొక గోపాలకునకె సాటిరానా మాటలేనా॥ యెంతా॥

ప్రహ్లాదమేటికిరా । గోపబాల బల్లిదుడను నేనురా । ముల్లోక ములనున్న మల్లాలువచ్చినా చల్లాడమునకింద జెల్లాదుదూరక । మెల్లగా సాగరముజొచ్చిన మేటిగాత్రముక్రిందడాగిన చల్లగా మేదినినిదూరిన. శైలమున హరి లీలడాగిన॥ యెంతా॥

పరగాగనాముందర । నిలచినీవు పెరగాగరాదుసుమ్ము! ధరణీశు హింసాకు దలపగరాదు యిత్తరినీవు వనమునడాగియుండగరాదు । వన రగా నేబలుడననుచును వాసిజూపగరాదు బుద్ధతద్వార కానగరా దోరి కలికిగదోచిన విదువను భద్రనగపతి॥ యెంతటి॥

ద్వి॥ అదిగాకనీవునే హరినంటివేని
మదముతో నేలెదు మధురాపురంబు
కుదురుగానుండు వైకుంఠంబుగాదు
యదునాధ కంసుని యాస్థానమిదియు
పదసంసారుల ఘాటలుగావు
విదితంబులగు రాజ వీధులుగాని
పరికించివినగ నాబాహునాదంబు
విరివిగానారదు వీణయు గాదు
చతురులాడగమల్ల జనవిగ్రహంబు
సతితోడప్రణయంబు సల్పుటగాదు
వెలసితిరుగగగాదు వేదాంతవీధి
చెలరేగ మునిజన క్షేత్రంబుగాదు
సాగినడువగభక్త జాలంబుగాదు
యేగెదింకెట్లునా యెదుట శ్రీకృష్ణ
అనియిట్లుచాణూరు డప్పుడుకాశ
ఘనముగాబంధించి కరములమల్ల
జరిచియుశౌరిపై జనగాంచిహరియు
వెరువక నెదురేగి వీరుడై జోరె

బలుదుముష్టికుతోడ పటిమతోఁబోరి
యిలనాథ కంసున కెదభయమంద ॥

వ. అట్టిసమయంబున పౌరజనంబులు గుమిగూడి వెచ్చనూర్చు
చు ముచ్చటలకుంజొచ్చి తమలోనిట్లనిరి.

సీ. మంజులాంగులదెచ్చి మల్లులకొప్పించి రాజుజూచుచునుండె రమణు
లార। యింతదుర్మార్గునిం డెందైనగంటిమే సభికులందరు రాజు
సరసనుండి। చిన్నికుమారకుల్ చెలగిమల్లులతోడ బోరింపవలద
ని పౌసగజెప్పి। వారింపరైరిగా వనజాక్షునొగమంత శ్రమజలా
ద్రంబయ్యె సఖియలార।

గీ. సభకుబోవదగదు సభవారిదోషంబు
యెరిగియూరకున్న నెరుగకున్న
యెరిగియుండితాను యిట్టట్టుబలికిన
ప్రాజ్ఞునైనబొందు పాపచయము ॥

వ. అని యనేకు లనేకప్రకారంబులం బలుకుచున్న సమయంబున.

శుద్ధసావేరిరాగం.

కమలాక్షుతోడను కదుబోరిమల్లుడు ఘనమల్లరంగమున। లో
బడెవాడు గాసిజెందెనుమనమునా। సమముగాబోరంగ లేకను చండ
ముష్టినిహరియురంబున తనకమునబొడువంగనదిసుమ దామహతిమై
దోచెనప్పుడు ॥ కమ ॥

శౌరివానిరెండు కరములుబిగబట్టి చటులగతినిద్రిప్పియూ। కుం
భినివైచి చాలాగొట్టినమెచ్చియూ। సరగునను ముక్కునను వాతను
చాలరక్తముగ్రక్కుచుల్లుడు ధరణిబడి ప్రాణములువిడిచెను తల్లడిల్లగ
కంసప్రాణము ॥ కమ ॥

బలభద్రుడప్పుడు బలభేదిమెచ్చగ బట్టిముష్టికుకరములు। గిర
గిరద్రిప్పి బారవేయగనప్పుడూ। యిలనుబడివదనంబునందున పెలుచ
రక్తమువరద బారగ। ఖలుడు ముష్టికు డంతకునిపురి గాంచనేగెను కంసు
డలుకగ ॥ కమ ॥

మేటిబలునిముష్టి పోటూనగూటూడు నాటోపముమూని । ధర
బడిసీశాటూలు వెరగందనూ । పాటవంబున భద్రనగపతి బలులనచ్చా
ణూరముష్టిక కూటులనువధియించిమిగిలిన మేటిరాక్షస కోటిజంపిరి॥ క॥

వ. ఇట్లు హతశేషులైన మల్లురీ పిల్లలు బల్లిదులెల్ల మల్లులం
జంపిరి. మల్లయుద్ధంబునకుం వల్లగాదు తొలగుతొలగుండని నిలువక
చనిరంత.

సీ. బలులైనమల్లుల ప్రహరించి గోపాలకులకూడి మృగరాజువలెజెలంగి
చరణపద్మంబుల చక్కగానందెలు మ్రోయగావచ్చెటితోయజాక్షు
గనిభూసురోత్తముల్ కడునభ్రమంబున నుతియించిరొకడు భూప
తియుదక్క । నంతనాకంనుండు నాస్థానకలకలం బాలించి వారించి
యలుకజెంది ।

గీ. మంత్రులనుజూచి యిట్లనె మల్లులను వ
ధించిశౌరియు బలుడు నేతెంచగాంచ
మంచిదేమీకు రాసీకు ముంచుడటనె
ఉంచనేటికి వెడలద్రోయించు డవల ॥

గీ. పాపుడైన నందు బట్టికట్టుడు వసు
దేవుజంపుడుర్వి తెల్లముగను
పరులకిష్టుడితడు పాపుగ్రసేనుని
జంపుడితడె కావజనదుపేని ॥

వ. అని పలుకుసమయంబున శౌరికోపించి.

శుద్ధసావేరిరాగం.

వినుమురాజవర్య విశదంబుగాకంను మునిమినహరిశౌర్యము ।
బుధులకెల్ల వినదగుసత్కార్యమూ । ఘనుఃకృష్ణుడు కంసుపలుకులు
కర్ణములబడికోపయుతుడై వినసహింపకవానితోడను వేడిపల్కులు
బల్కెనిట్లని । వినుము ॥

భోజకులమునందు పాలుపొందగాబుట్టి తేజమువిడనాడి । బు
ద్ధిలేని పాజీలనుగూడి । పూజనీయులతోడ వైరము రోజుజేయుచుతగని
క్రోధము। లోజరించెదునిన్నుజంపుదు భోజమామనిచూడననియెను॥వి॥

గిరిపైనచరియించు కరిమీదలంఘించు వరమృగేంద్రునిరీతి । పౌరులుజూడ నరికంసహింసార్థియై । పరగుసను తమకంబుమీదికి చౌకళించినకంసుడప్పుడు పరగతిన యనుచరులతోడను పద్మనేత్రుని మొదిరె నంతట ॥ వినుము ॥

చెలువైనఫణిబట్టు బలుఖగేంద్రునిరీతి వలనేతకొప్పబట్టి । మకుటపురత్నములు కల్పాంతమునుట్టి । ఖలనుబడుతెరకలరీతిని జలజలనురాలంగ రంగస్థలిబడంద్రోచెను సురాదులు భళిభళీయని తనముబాగడగ ॥ వినుము ॥

మంచాగ్రమునందు సంచారముమాని వంచనలకుజిక్కి । యున్నమామ నెంమామతలద్రొక్కి । పంచతనుబొందించెజనులొ నంచుబాగడగ వానిశింగము మించుగజములనీడ్చుభాతిని నంచితంబుగబట్టియీడ్చెను ॥ వినుము ॥

పగచేతనైనాను పరమాత్మనెప్పుడు భజియించుటచేతనూ । శ్రీభద్రాద్రి పతియందుతాజేరెనూ । మిగులక్రోధతవాసివారలు నగధరునిపైబోవరాముడు మగటమినిమొదిరించివారిని మడియజేసెను తక్షణంబున ॥ వినుము ॥

వ. అట్టిసమయంబున.

గీ. నారదుండుమింట నాట్యంబుసల్పెను
వారిజాసనుండు వామదేవు
డపుడుసన్నుతించి రఖిలసురాదులు
కృష్ణునఖిలవైరి జిష్ణునధిప ॥

వ. అంత కంసుభార్యలు పీరశయ్యాతలంబున పెద్దనిద్దురం జెంది యున్న విభుంగాంగలించుకొని విలపించి రందగ్రమహిషియిట్లని విలపించె.

పున్నాగరాగం.

నన్నువిడిచిపోగానీకు । న్యాయమా ప్రాణనాయకా । పన్నుగానన్నుంచాబాధ్యులెవ్వరు భూనాయకా । నిన్నుగోపసింహామిట్లు నేలగూల్చాగాజూచీయూ । ఉన్నాదినామనను రాతి కన్నమిక్కిలి కఠినమాయి ॥ నన్ను ॥

తోడబుట్టూతిట్టూనీకూ । తొలగదాయెనో ప్రాణేశా । ఆడపడు
చువై రామేలా నన్నువిడువకపోయితివయ్యాయో ॥ నన్ను ॥

పరులాకూకీడొనర్చిన పాపాముజెందకనున్నె । ధరణిభూత
ద్రోహికెపుడు తప్పకనశుభము లేగల్గు ॥ నన్ను ॥

శౌరితోడాబెనగీమున్ను జననవారివినగలేదా । పరగభద్రాద్రి
హారినీదలచి బ్రతుకదగదే కోపామువిడిగి ॥ నన్ను ॥

గీ. ఇట్లువిలపించు మేనత్తనూరడించి
మేనమామకు తిలజలదానమిడగ
బనిచి తలిదండ్రివిడిపించి బలునిగూడి
వందనము జేసె కృష్ణుండు వారలకును ॥

ద్వి॥ వందనంబొనరించు వరసుతుజూచి
నిందిరేశుడటంచు నెదలోన దలచు
వారలతనమాయ వలనవారించి
శౌరియగ్రజుగూడి చనువొప్పబలికె
మమ్ముగంటిరిగాని మాబాల్యమందు
నమ్మరోయెత్తుకొ నాడించుభాగ్య
మెరుగరైతిరిప్రేమ యెంతగల్గినను
ధరలోనివారలందరివలె మేము
తల్లిదండ్రులవద్ద తనయులైయుండ
జెల్లమైతిమివారి చేతలాలింప
నీమేనునకుమీర లీశులుగాన
మేముదీర్చగలేము మీరుణమెపుడు
ధారుణిలోపల తనయుడెవ్వండు
భూరిసమర్థుడై పొందుగాతల్లి
దండ్రికిధనదేహ ధర్మంబులందు
నిందుగానివ్వని నీచుండునాత్మ
పలలాశియగామీద బ్రబలుడై యెవడు
తలిదండ్రి వృద్ధుల తనయుల గురుల

బ్రోవక నున్న ను పృథివిలో వారు
జీవన్మృతుండని చెప్పెదురవని
గావునమముగూర్చి కష్టముల్ జెంద
లావుగల్గియుమిమ్ము రక్షించనట్టి
మాతప్పుసైరించి మన్నించుడిపుడు
జేతుముశరణంబు చెలగుచుమీకు
ననిపల్కుతనయుల నలరుచుజూచి
వినయంబుచేవారు విభ్రాంతులైరి
అపుడుతాతనుజూచి హరియిట్టులనియె
నృపశాపమున నిపుణిగా మేము
రాజవుగమ్ము యీరాజ్యంబునాకు
భోజేంద్రయనుచును పొందుగా జేసి
మునుకంసభీతులై పోయినవృష్టి
ఘనయదుభోజాంధకవ్రాతములను
రావించివారికి రాజ్యంబులిచ్చి
గోవిందుడప్పుడు కోర్కెమీరంగ ॥

వ. ఇట్లు హరి మధురాపురంబున నుండు సర్వజనంబులకు నానందసంధాయకుండై యుండి యొక్కనాడు నందునకుంగని యిట్లనియె.

గీ. తండ్రినెరుగముమేము యాతల్లి నెరుగ
మయ్య మమ్మింతవారిని జెయ్యదలచి
నెయ్యమున బెంచితిరి ప్రతిజెయ్య నేర
మయ్య మ్రొక్కెదమని మ్రొక్కె నచ్యుతుండు ॥

క. ఇక్కడిబంధుల కెల్లను
మక్కువ సౌఖ్యంబొనర్చి మరివచ్చెద నే
నెక్కడనున్నను మందను
మక్కువతో మీరుజేయు మన్ననదలతున్ ॥

క. మందకు నేగెడుమీరలు
ముందరననిపల్కి. శౌరి ముఖ్యాంబరముల్

సుందరమగు మణిభూషణ
సందోహములిచ్చియనిపె సాదరమతియై ।

వ. ఇట్లు నందుబంపిన తదనంతరంబ.

సీ. గర్గ్యాదిభూసుర వర్గంబుచేహరి కుపనయనవిధులను కృపయొనర్చె
వసుదేవుడప్పుడు వసుధేశసాందీపు కడకేగికృష్ణుండు కాంక్షమీర
వేద వేదాంగముల్ వివిధస్మృతుల్ ధనుర్వేదంబుచౌషష్టి విద్యలెల్ల
నొక్కొక్కదినములో చక్కగాగ్రహియింప జూచిసాందీపుండు చో
ద్యమంది ।

గీ. పుత్రుడంభోధిలోపల పౌసగమునిగి
రాకనున్నాడు మీరలు రమ్యముగను
పుత్రదక్షిణనిడరయ్య పుణ్యులార
ననిన హరియును హలియును ననుమతించి ॥

చ. వారిధికేగి భూసురుని వార్ధినిదెమ్మన నేనెరుంగనో
సారసనేత్రయిచ్చట నిశాచరుడుండి హరించెనన్న నా
శౌరియువానిజంపి పటుసారమునం దరముంగ్రహించి యం
దారశి గాన శంఖనియె ధర్మనివీటికి దాను సన్నయుర్ ॥

మత్త॥ అందుకేగి జమునిచేత నఖిలయాతనంబులన్
జెందివిప్రవరునిసుతుని చెల్వుమీరగోరి గో
వింద వీడెగొనుమటంచు వేడ్కనివ్వనన్నతో
నిందిరేశుడటకుదెచ్చి యిచ్చెవిప్రవరునకున్ ।

వ. ఇట్లు సాందీపునకు గురుదక్షిణగా పుత్రునొసంగి యన్నయుం దానును పాంచజన్యంబులు పూరించుచు మధురానగరంబునకుం జని సుఖంబుండిరంత.

సీ. వనజాక్షుడొకనాడు వ్రజసుందరలమీదమక్కువగలిగియుమదిదలంచి
గోపాంగనలునన్నుగోరి వేపల్లెనుగృహములందుననెంతగుందిరొక్క
అనియుద్ధవునిబిల్చియానోయిచెలికాడ చెలులునారాకనుదలచియిండ్ల
నెట్లుండిరోవార లేగిమంతనమున దెలుపువచ్చెదనని తెరవలకును

తమనువిడనాడుటయు నాకు ధర్మముగునె
లౌకికంబొల్ల కెల్లడ నాకు దాను
లైనవారల బోషింతుగాన నటకు
బోయిరమ్మన నరిగెను పొందుమీఱ॥

గీ. యిట్లు బృందావనంబున కేగి నందు
గాంచినను కృష్ణుగాంచినకరణి నతని
అంచితాసనముననిడి యనియె నందు
డయ్య ఉద్ధవసీరాక యలఘు శుభము॥
అని మరియు నిట్లనియు-

కేగు ప్తిరాగం.

వ. అన్నా యుద్ధవదెల్పు మచ్చటిముచ్చాటలన్ని మచ్చికమీఱగా। వన్నుగా వసుదేవుడక్కడ బలుని కృష్ణునిగూడుకొని తను చెన్నుగా నున్నాడె కంసుడుజెడిన వెనుకను సఖుడు ముదమున ॥అన్నా॥

తల్లిదండ్రులమమ్ము దలచియేమనునోయి దయమీఱచింతించు నా। యిచ్చోటికీవెళ్లి రమ్మని బంచెనా। ఉల్లమున తనుబాసిగాసిలి తల్లడిలుగోపికలు గోవుల మొల్లముగ గోపకులమిత్రులనెల్ల ప్రొద్దుల దలచుచుండునె ॥అన్న॥

వ్రేపల్లెకెపుడు గోపాలుడేతెంచు దాపాక జెప్పుమయ్య। శౌరి మమ్ముగాపాడుగదనయ్యా। రేవుమాపును చంద్రుబోలిన శ్రీ వునగుముగమేను జూడగనోవుభాగ్యముగల్గునా ధరలోపలను యీజన్మమున కిక ॥ అన్నా ॥

అని మున్ను హరిజేయుపనులన్ని దలచియు కనికరమునబొక్కుచూ।భద్రాద్రీశుగనని వగనుసొక్కుచూ వినయమునతానుండె నందుడు తనయుగుణములుతలచి తల్లియు చనులపాలునుగురియు కనుగవ ఘనముగా జలబిందులుకజొగ్గిలె । అన్నా ॥

వ॥ ఇట్లు ముకుందసందర్శనాభావవిహ్వలులైన నంద యశోదలకు నుద్ధవుండిట్లనియె.

శా॥ మిమ్ముంజూడగ వేగవచ్చు హరియుం మేలొందెదుంమీకు నో
యమ్మా మీరలు చింతసేయకుడు మీయబ్జాక్షుడుం శౌరియుం
సమ్మోదంబున భూభరం బుడుపగాజన్మించిరిద్ధాత్రిలో
నమ్మా నాథునిదల్చువా రవనిలో నబ్జాక్షునిం జెందరే॥

గీ. అట్టివానికి తలిదండ్రులౌట మీర
లతి కృతార్థతనొందితి రనఘులార
యనుచు బహుభంగులనుదెల్పి యతని నాటి
రేయిగడపియు మరునాడు రేపకడను॥

వ. నిత్యోచితకృత్యంబులుదీర్చి యుద్ధవుం డొక్కయెడనున్నం
జూచి కృష్ణుండని శంకించి గోపికలు వికసితముఖకమలలై యిట్లనిరి॥

మాళవరాగం.

నిన్నరుంగుదుమయ్య నీరాజనేత్రుని నమ్మినచ్చెలివానీ । వన్న
గ తలిదండ్రిపాలికి నినుబంపె వెన్నాడు తనమేలువిన్నవించమని ॥నిన్న॥
వనజాక్షుడెపుడు వారాలనైనాను మనమూనదలచూనుగా ।
ఘనుడుమెల్లనువాడు కాంతూనకిచ్చట చనువువారెవరింక గనబంప
గానైన ॥ నిన్న ॥
మునివరులైనాను తనవారిపై ప్రేమ గనుచు విడువలేరూ ।
పనిలేనినఖ్యాముబాయదె ధరనళిపని దీర విరులానుబాసిపోవునులేదా॥
వాసిగభద్రాద్రి వ సూడనుచు తన నాశించియున్నందుకూ ।
గాసిజెందమమ్ము జేసిమధురాపూరి వానులైనయట్టి భానురాంగుల
గూడె ॥ నిన్నరు ।

క. అని యిటుగోపికలనగను
వనిత యొకతె కృష్ణుపాదవనజముమీదన్
తన మదినిలిపియు బొక్కుచు
గని చెంతను దైవవశతగాలగ నచటన్॥

వ. ఇట్లుగాంచి హరి తనను ప్రార్థింపబంపిన దూతగాగల్పించు
కొని యన్యాపదేశంబుగా నిట్లనియె.

## యమునాకల్యాణిరాగము.

భ్రమరాముట్టకుమీ మాపాదపద్మమూ ॥ భ్రమరా ॥ కమ నియ్యమైన పౌరకాంతా కుచకుంకుమాంకితసుమదామారుణితానన సుముఖునినుహరి మన్నించు ॥ భ్రమరా ॥

నీవొక్కా పువ్వుదేన నెమ్మిగ్రోలీ । తాపూవుసేయాక వేరొక దానిజేరూ । తీపినవాదుమోవి తేనెగ్రోలియుశౌరి యీవేళపరులజెందె నెటు నమ్మ లక్ష్మీవాని ॥ భ్రమరా ॥

మంచివాడనుచు మాతానెంచబోకుమీ । లంచాపుగానమున కరగించనాలా । కించామేగుమీ పౌరచంచలాక్షులయెడ గావించూ గానము వారాలించిమన్నించెదారు ॥ భ్రమరా ॥

హరిచేతకరుగరె యూయువనికాంతలూ । దరహాసవీక్షణములా దైతుడైనా । వరమూయియుతని పాదవనజాములాశ్రయించు కరుణా సముద్రునకెవరు కరుణాజేసేటివారు ॥ భ్రమరా ॥

చారాకృత్యాముసందు ధీరుడానీ । నేరూపునిందుబనికినేడురావూ । ధీరాతపతిసంతాదుల దలమీరియు శౌరివచ్చినవారినివిడువమేలా శౌరిధర్మజ్ఞుడటులా ॥ భ్రమరా ॥

వాలినిజంపి నెరుకువానీభంగీ । లీలాశూర్పణఖ నీగతిహేలా జేసె । మేలూజేసినబలిని మిగులాబంధించె మమ్మూలనీలానమ్మిన విడిచె నెటు భద్రాద్రీశుడతడ ॥ భ్రమరా ॥

అని మరియు.

## కల్యాణిరాగం.

చూచితివా భృంగమా । శౌరినీతిచూచితివా భృంగమా ॥

వాసిగమింటిపై వన్యాఖగముతై నడాసి పీనుల తనను భాసూర ముగవిన్న । బాసుసంస్కృతి నట్టివానిని వేసరకా మదిదలచుచుండెడి దాసిజనముల బ్రతుకుసైచున గాసిజెందియు నంటిమెందుకు ॥ చూచి ॥

మధురాముతై నట్టి । వేటకాని మాటలాలకించియూ । మదినమ్మి చేరియు నదయాత హరిణామములొ దుదవాలిశరమూల దునిశినభం

భంగిని । మధుమథనుకితవంక్తులను నెమ్మదినినమ్మియు మొదలు నిజమని మదనుపటుశరకీలికీలల వ్యథలజెందితిమింక నే మన ॥చూచి॥

తల్లిదండ్రులనన్నలా । మగలసుతుల తగబంధుజనములాను । యెల్లవారల వంచభల్లాంధతజెంది ల్లాకాతని గోరివచ్చిన । మమ్ముల జెల్లునా విరహాబ్ధిద్రోశియు వల్లకుండుట మేరగాదని చల్లగా వినుపింపు వేగమె షట్పదమభద్రాద్రినిలయుతో ॥ చూచితివా ॥

కేదారగౌళ రాగం.

యెలావచ్చునుమంద కేలాదలంచు గోపాలూడు మమ్మాలనూ । చాలచింతిల నేల భువి ధరపాలు లెల్లను చపలచిత్తులు పాలుమాలిన నేమిఫలమిక బాల నూతన్ప్రియులుగారె ॥యెలా॥

నవరత్న ఖచితమా నవ్య సౌధంబులె నవమన్మధునకు మానత కుటీరంబులు । భువనములలో వేరుబడి భూధవులచే సేవించుపురియె భువనభర్తకు గోపకులచే పూజ్యమా వ్రేపల్లె జూడగ ॥యెలా॥

చూపులకింపయ్యె శుభచిహ్నములుగల్గు భూపాలగజములె గోపధేనువులిల । రూపవిభ్రమన్నై పుణ్యములచే రూఢులౌ కాంతలమె మన్మధరూపుడౌ భద్రాద్రిపతికిల గోపసతులము రూపయుతులమె ॥ యెలా ॥

వ. అని యిట్లనేకవిధంబుల కృష్ణదర్శనలాలసలై బలుకుచున్న గోపికల పలుకులువిని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె.

క. జప దానంబుల క్రతువుల
నిపుణులు నే విభుని మదిని నిలుపగ లే రా
విపులాకారుని పై మీ
కపరితపాధ్యానమబ్బె నతిచిత్రమగుౘ॥

సీ. నన్ను మీకడ కంపునపుడు కృష్ణుండు పల్కినపల్కులు పరగవినుడు సర్వకర్మములకు సాక్షి కారణుడను మద్వియోగము మీరుమరువవలయు
స్థావరజంగమసంతతితో మహాభూతంబులెట్లుండు పౌనగ నేను
నట్లుండెదను మీరలలగకుడీ కలగనిలేచికలలోని కర్మమిధ్య

యనుచు బుధుడు దలచు నఖిలప్రపంచంబు
జెందకుండు ముక్తి జెందునతడు
నదుల కెల్ల నబ్ధికుదురెట్ల నట్లునే
నఖిలజంతువులకు నాశ్రయుండ॥

అదియునుంగాక.

సీ. కాంతలు తము పతుల్ కడుదూరముననున్న చిత్తంబు వారిపై జేర్చి యుందు। రధిక సమీపస్థులగువారిపై కంటెనదిగాన నన్ను మీ రెదల నెపుడు। చింతింపగోరియు జెందితిదూరంబు నందు కలగబోకు డటివలార। సంతత ధ్యానంబు సమకూరెనాయందు గాన జెందెద రు నన్గడపటలను.

అనుచు బల్కెను హరియని యతడుబల్క
బలికినను విని కాంతలు సులుకుమాని
సంతసంబును జెందియు సారసాక్షు
సేమమడిగియు బలికె రాభామ లిటుల॥

ఘంటారవరాగం.

యెన్నాడువచ్చునో వెన్నాడిచ్చటికి। పన్నాగదెల్పుమీ బావాయుద్ధవా। తిన్నగానున్నాడెనాథుడు దెల్పు మిచటికివత్తునన నా వన్నెలాసులు నష్టమైనను చిన్నబోవును మమ్ముదలచియు।యె॥

మరచినాడయమునదరి తరులందు। దిరుగుచుండగమేము మరుగూలనుండీ। వరుసరాకుండిన పరవశమున మేను। మరచీన రతులాను మముదేలించుట। పరగనీతో నమనాగ్రహమునబల్కెనే కాళిందితటి తన మురళివిని యేతెంచడాగిన వసుని దూరిన పలుకులన్నియు॥యె॥

వినుపించెనేమేము వనకేలిసలుపా। తనువచ్చివలువ హాలుగొని నీపమెక్కా। గనివేడ నిచ్చినకథమూలంబూ। వనరగ నదిగాక వన్ని కాసుమేము। ఘనముగకాళిందితటులను కామమున నాశరన్నిశలను వనరజేసిన రాసలీలల వైభవములనుజెప్పెనేదగ।యె॥

చక్కనయ్యనుబాసి యొక్కింతదడవూ। దక్కవుమేనులు నిక్కామాపైనా। మిక్కిలిధైర్యాము జిక్కెననుమూ। జిక్కెనప్రాణా

ముల్ జెద రేగుననుమూ । మక్కువతోనట పైగవచ్చియు గ్రక్కునను యీప్రాణు లెల్లను వక్కసరిదూరంగ నికమ్మెలెక్కడిదియని దెల్పు మధిపుతో ॥యె॥

చలికాదు వ్రేపల్లెచెంతానేతీర । కులుకూచుజూతుమే కోర్కెలు దీరా । పలుకూలనమృతంబుజిలుకు భద్రాద్రీశువలుకువిందు మేము బహునాళ్ళకైనాను । పులకలొదవగ మేనులాతనిబొదివి కౌగిటజేర్తు మే హరి యులుకచేనిటు లేగుటేమని చుల్కగాదూరంగగల్గునే ॥యె॥

మగలానుమగువాలు తగులారెందె నా । జగతీమూపాలానె జెల్లెనేయిటులా । తగులాదెకమలాయు తగుమోహామునా । తగవ్వూవిడిచిహరి దయమా లెనిప్పూడు । తగిలియుండిన సతులవిసుచుట తగవుగాదని దెల్పి బ్రోవగ తగుదువనిదూరెదము నిను యీ పగిదినుద్ధవ వగల జెందియు ॥ యెన్నాడు ॥

వ. ఇట్లనేకవిధంబుల గోపికలోపికలులేక హరిందూరి యతని మధురాలాపంబుల శాంతిబొంది యుద్ధవుని బూజించిరంత కృష్ణలీలా వర్ణనలు సేయుచు వ్రేపల్లెయందు కొన్నిమాసంబులుండి తదనంతరంబ నందాదుల యనుజ్ఞవడసి మధురాపురంబునకు వచ్చి వారలిచ్చిన కానుకలు బలరామకృష్ణులకు నుగ్రసేనునకు సమర్పించి సుఖంబుండిరంత.

సీ. మునురతిగోరిన వనితమందిరమునకు జనిశౌరి యుద్ధవసహితుడగుచు
గనియొసంచాస్త్రిని కాంతాభమగుదాని నదియును సంభ్రమ మొద
వలేచి । యర్ఘ్యపాద్యాదుల నర్జాత్ముపూజించి సుందరతల్పంబు
నందుజేర్చి । యుద్ధవునకుచాల నుపచార మొనరించి మిన్నభూషిత
యయ్యె మెరుపుబోలె.

గీ. శయ్యకడకేగుదెంచిన శౌరిదాని
సజ్జజేరిచి దేలించె సరసరతుల
మెచ్చి కోరినవరములనిచ్చి మరల
సఖునిగూడియు నరిగెను సదనమునకు ॥

మధ్యమావతిరాగం.

హరియు నుద్ధవ రాములందముగ నక్రూరు వరమందిరమునకును

వచ్చిననతండుర్ । వరమోత్సవంబునను బలరామకృష్ణులకు వరుసపూ
జలుజేసి వైభవంబలరఁ ॥

వినతుడై నుతియింప వినిశౌరియాతనికి మనమలరమ్రొక్కితా న
నియెనిట్లనుచుఁ । పినతండ్రివాప్తుడవు ఘనభాగవతుడవో యనఘ నీ
సుగుణంబు లలవియేపొగడ ॥

వినుముకరిపురికేగి మనపాండవులజూచి గనుముధృతరాష్ట్రుమది
కలుమమోశుభమో । అనిబంపనక్రూరు డరిగెకరిపురమునకు వనజాక్షు
డనుజుతో వచ్చెగృహమునకుఁ ॥

అంతనక్రూరుండు దంతిపురికేగికురు సంతతినిగాంచ వారంత
మోదమునఁ । వింతగాబూజింప సంతసమునదందు కొంతకాలంబుం
డె కుంతియొకనాడు ॥

విదురుండువినగ తన మదిదలచిపుట్టిల్లు ముద మొదవ నతనిగని ము
దితయిట్లనియెఁ । మధురాపురంబులో యదువులందరుసుఖం బొదవ
నున్నారె నెమ్మదిచింతబాసి ॥

అన్నమాతలిదండ్రు లన్ననుజూడగా నిన్నాళ్ళకంపిరా యేమ
నిరిసితో । విన్నారమాపాట్లు విద్విషులమధ్యమున నున్నానువృకమధ్య
నున్నమృగిబోలి ॥

కరిపించెఫణులచే గరయుతాన్నమొసంగె గంగలోద్రోయించె
కరులద్రొక్కించెఁ । మరియేమిజెప్పుదును ఖలుదుదుర్యోధనుడు గొర
గాడునాసుతుల కొలదెరుగడెపుడుఁ ॥

బలుడుకృష్ణుడుమమ్ము దలతురామదియందు నిలభాగమిప్పించ
గలర మరదులకూ । జలజాక్షునకునేను శరణంబుజేసెదను గలడాతడే
మమ్ము కడతేర్చనెపుడుఁ ॥

వ. ఇట్లు వగచుచున్న కుంతి నక్రూర విదురులు దుఃఖోపశమ
నంబొనర్చి యనుజ్ఞవడసి బంధుమిత్రపుత్రసహితంబుగా కొలువున్న
ధృతరాష్ట్రుకడకేగి యక్రూరుం డిట్లనియె.

సీ. భూమీశతమ్ముని పుత్రులందునునీదు సుతులందుభేదంబుజూడదగదు
సముడవైయుండుట సౌఖ్యమందరికిని గాకున్నఁనశుభంబు గాంచెదీవు

దేహంబుతిరమని మోహంబునొందక తమ్ములకొడుకులకిమ్ముసగము
అనిపల్క ధృతరాష్ట్రుడనియెనీవాక్యంబునిజము జెప్పినజరుగ నేరదటుల

సీ. కర్మవశతజంతుగణము వర్తించును
కర్మకీశుడైన కమలనాభు
డవనిభారమంత నణపంగగల్గిన
హరికిమ్రొక్కి యతని నాశ్రయింతు ॥

సీ. వానిచిత్తంబునంగల వగుసజరుగు
జనుమనినవచ్చి మధురకు చక్రిగాంచి
యతనివృత్తాంతమంతయు నవుడుదెల్ప
వినిరిబలరామకేశవుల్ విశదముగను ॥

ద్వి॥ అంతకంసునిభార్య లస్తియుప్రాస్తి
దంతివరదుడుతమ ధవుజంపువార్త
తండ్రితో దెల్పనాతం డాతుఁగంబె
వేండ్రంబుతోడను వెడలెనాజికిని
జరసుతుండనువాడు సరభసమునను
ఖరతరాక్షోహిణీ గణములగూడి
మధురాపురముచుట్టు మరివాడువిడిసె
మధుసూదనుండును మదిదలంచగానె
దివినుండిరథమును దివ్యాస్త్రములును
జవనాశ్వములుమంచి సారధియూను
వచ్చినబలుడును వనజాక్షుడూను
వచ్చియెక్కియుకదన మేదినినిలిచె
శంఖంబుపూరించ చక్రాయుధుండు
బింకంబణంగెను బిట్టుసేనకును
అప్పుడుమాగధు డనియెమాధవుతో
నొప్పదునీతోడ నురుసంగరంబు
బంధుహింసకుడవు బాలకుడావు
మందగొల్లడవూరి మాధవలెమ్ము

బలరామునాతోటి బాగుగాబోర
గలవేనిరమ్మన్న కామపాలూడు
నగికృష్ణుడనియెను నాతోడనీవు
తగదురాయిటువంటి తప్పులఁబేల
మగటిమిగాదురా మాగధనేను
తగికాలశివునైన దాకజాలుదును
గోపాలభూపాలకుల భేదమిపుడు
యూపరునాతోడ యూఢిగాబోరు
మనిచాపమెక్కిడి యబ్జాక్షుడపుడు
ఘనశరవృష్టిచే గప్పినవాడు
నడుమవాటినిద్రుంచి నలినాక్షుమీద
వడిబాణవృష్టిని వర్షించెనంత
నురుసింహములరీతి నుగ్రంబుగాను
సరిబెనంగిరిభూరి సాహసములను
బలరాముడప్పుడు బలముచేమిగిలి
హలముచేసారధి హయములజంపి
మాగధుజంపెను మదినేర్పుమీర
నాగంబుబట్టెడు నాగారిపగిది
బట్టివంచియు తన పటుముష్టిబొడువ
కట్టడిమగధుండు కడు డస్సెనంత
శీరిచేవిడిపించె శ్రీకృష్ణుడపుడు
వైరినిమీదటి వార్తనూహించి
అంతటమాగధు డతిచింతనొంది
కాంతారమునకేగ గాదలంచెను
తపముజేసియునైన తామరసాక్షు
నపజయంబొనరింతు ననుచుమాగధుడు
భూపాలకులుచాల బోధింపవాడు
నేవుమీరగపురి కేతెంచెనపుడు

బలరామకృష్ణులు పటువై భవముల
వలమురియొత్తుచు వచ్చిరిపురికి
మాగధుండును రాజ మండలిగూడి
వేగమెపదినేడు విసరములాను
అరుదెంచిమధురపై హత్తసైన్యుడగుచు
తిరిగిరాదలచెను ధీరుడై యంత
నారదముని మ్లేచ్ఛ నాథుతో దెల్ప
సారమౌముక్కోటి సైన్యంబుతోడ
నెచ్చుగామాగధు డెదలోనమెచ్చ
వచ్చివిడిసెను మధురవాకిటియందు ॥

వ. ఇట్లు వచ్చి విడిసిన కాలయవనుంజూచి బలరామునితో హరి యిట్లనయె.

చ. యవనుడువచ్చిచుట్టుకొనె నామగధేశుడు రేపువచ్చు వా
డవనిమహాపరాక్రములు సందరుయీపురిచుట్టుముట్టినన్
జవమునసీవు నేనొక దెసం నిలువన్ బురిలోనజొచ్చి భూ
ధవుమనబంధులందునిమి దాటెదరో గొనిపోదలంతురో ॥

గీ. గాన రిపులకు జొరజూడ రానిదుర్గ
మమర జేయించి యందులకనుపవలయు
బంధుజనములననిశౌరి పరగనబ్ధి
నడిగి ద్వారకగట్టించె నప్పుడధిప ॥

వ. ఇట్లు విశ్వకర్మ నిర్మితంబైన ద్వారకాపురంబున తన యోగ ప్రభావంబువలనపురజనంబులం బ్రవేశంబుగావించిబలభద్రుననెరింగించి గుహనుండివెడలు సింగంబులరీతి నిరాయుధులై వచ్చు సమయంబున కాలయవనుండు హరింజూచి యిట్లనివితర్కించె.

సీ. ఎవ్వడోయీజను డిందీవరనిభాంగు డానారదుడుజెప్పినట్టి చిహ్న
ములుగల్గుననుచును ముదమున నెదురేగి బారెనుశౌరి యధీరుపగిది
వడిగవెంబడిబడి యొడిసిపట్టగజన దొరుకునట్లుగదోచుదొరకకుండు
జనిజనిగుహాలోనసయ్యనజొరవాడు వెనుకజొచ్చియువాడువనరుహాక్షు

గీ. గానకనునిద్రజెందియు గదలకుండ
నున్న ముచికుందుగాంచియు దన్నికాల
నతడుజూచినభస్మమై యవనిబడియె
కాలయవనుండు నాతడు గాంచెహరిని ॥

గీ. ఇట్లుగాంచియు ముచికుందు డింపుమీర
తనదుకులమున వృంతంబు వినగజెప్పి
కృష్ణునెరిగియు నుతియించె విష్ణుడనుచు
శౌరియంతట పురికేగె సంతసమున ॥

పంచ॥ శౌరియటకొచ్చి పటుశూరులగుమ్లేచ్ఛులను ధీరతనుజంపి పరివారములతోడన్ । భూరిధనముంగొంచు ద్వారకకు నేగనా దారినజరాసుతు డపారసైన్యముతో । మీరియు నెదుర్కొనగ శౌరియు హలాయుధుడు భారియుప్రబవర్షణగిరి జేరిరటపైనన్ । క్రూరతజరాసుతుడు వారకదిగాల్చి హలి శౌరి మృతిబొందిరని జేరెనిజపురికిన్ ॥

గీ. అంతరామకృష్ణు లగ్గిరిపైనుండి
వానిసైన్యమునకు గానుపడక
వెలికిజేరితమకు వీటను సుఖముగా
నుండిరపుడు బంధుమండలముతో ॥

ఉ. శ్రీరవివంశవారినిధి శీతకరార్ణవగర్వభంగ వి
స్తారయశఃప్రతాప జితతామరసాహిత పద్మమిత్ర యో
షారతిరాజరూప పటుశాత్రవపర్వతవజ్రవజ్రి భా
షారమణీవిభూషిత సచ్చరణాంబుజయుగ్మ రాఘవా ॥

మాలిని॥ సారసాప్తపుత్రమిత్ర సర్వలోకనాయకా
వారిముక్సమానదేహ వారిరాశిబంధనా
సూరిజన్మనోంబుజాత సుందరాలయామరా
ధారశూరమారజనక ధారుణీసుతాధిపా ॥

గద్య॥ ఇది శ్రీరామచంద్రచరణారవింద నిష్యంద మకరంద బిందుసందోహపానమత్త మధుకరాయమాన మానస పవనాత్మజ కృపా

లబ్ధ కవితామాధురీధురీణ శారదాప్రసాద సమాసాదిత మనీషా ప్రాభవ శ్రీమత్కాశ్యపసగోత్ర పవిత్ర వీరరాఘవార్యపుత్ర సకల సుకవి విద్వజ్జన కృపాపాత్ర శ్రీబోడెం కృష్ణదాస ప్రణీతంబైన శ్రీమహాభాగవతాంతర్గత దశమ స్కంధ సంబంధ నందనందన చరిత్రంబను యక్షగాన ప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.

బలాహరిరాగం - జులుబాతాళం.

హారతిగొనుమయ్య శ్రీరఘువీరకదనశూరా । వారిముక్పరీర మేరుధీర శూరమారజనక ॥ హారతి ॥

ముంగునిభశుభానసేందిందిరాలకా । మందరధర దేవబృంద వందితచరణారవింద ॥ హారతి ॥

అంగజశతకోటిసుందరాంగవైరిభంగా । గంగాధరవలచాప విభంగానత్సంగా ॥ హారతి ॥

కుండలీంద్రశయనవేదండరక్షకా । భండనజితరిపుధృతవర కాండాసనకాండధరా ॥ హారతి ॥

వాసవనుతభద్రశైల వాసచిద్విలాసా । హాసవదనశ్రీకృష్ణ దాసహృదయవాసా ॥ హారతి ॥

---



శ్రీరాములు.

# నందనందనచరిత్రము.

శ్రీసాకేతపురాధిప । దాసాసనపద్మమిత్ర దశరథపుత్రా । యీశాన చాపభంజన । కేసరితనయార్చితాంఘ్రి కిసలయ రామా॥

వ॥ అవధరింపుము. తదనంతరంబ పరీక్షన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

చ. మును కమలాసనాజ్ఞగొని మోదము[illegible]పుత దైవతుండు నా
వనజదళాయతాక్షి వరవర్ణిని రేవతిదెచ్చి శీరికిన్
జనవరయిచ్చెగాదె మును సర్వముజెప్పితినంచు రాజుతో
మునివరు డాత్మలో ముదము ముప్పిరిగొందగ బల్కెయాదటన్॥

సీ. సురనాథుగెల్చియు సుధగొన్న ఖగనాథుచందానకృష్ణుండు చైద్యపతి
చరులసాల్వాదుల చెలువొప్పనిర్జించిగొనియె వైదర్భికువలయేశ
అనిచెప్ప మునిచంద్రుడవనీశుడిట్లను శౌరియొక్కరుడెట్లు చైద్యవరుల
నిర్జించి గొనిపోయె నీరజనేత్రిని జెప్పవే మునినాథ శ్రీశుకథలు
మంగళాత్మికములు గాన మహి నెవ్వడు.
తృప్తుడౌవినముక్తికి దొరలు జనుడు
గాన సాకల్యముగవిను కాంక్షగలదు
దెలుపు రుక్మిణీకళ్యాణచరిత మనఘ॥

అని రా జడిగిన శుకుం డిట్లనియె.

భైరవి రాగం.

[illegible]వినుము యీమందారధరుకథలూ ।

పొందుగకుండిన పురమందుగలదు నరేంద్రుడు భీష్మకుడందురుజను లంత ॥ యిందు ॥

ఆ రాజవరునాకు శూరులైనపురుపుత్రులు దగ్రజాడురుక్మియూ । వారాలకడసారిదైరాజిలు రుక్మిణారాజ వదనాకు శ్రీరామయా సాటి ॥యిందు॥

బాలేందుకళలచే భాసిల్లపర దిగ్భాగమువలెనాతనీ । మేలైన కళలచే మెరశెబాలికబుట్టి లోలాక్షికళలచే లీలానెదుగుచుండ ॥యిం॥

బొమ్మపెళ్ళిళ్ళను పోలుపుగజేసందు పొలతూలతోవియ్యమూ। కొమ్మగుజ్జనగూళ్ళ కొమరొప్పవడ్డించి సమ్మాతిబెట్టించు సాటిచేడియ లాకు ॥ యిందు ॥

ఉద్యానవనమూల నున్నపూదీగెల కురుజోదియలు శేయునూ। పద్యాముల్ బాడుచు బంగారుమేడ నారాధ్యయై చెలులాతోనటు జోలి కలూగు ॥యిందు॥

బంతులాడును సాటి యింతులతోగూడి వింతాగా శుకశారికా। సంతతికెప్పుడు చదువుజెప్పును బహిణసంతతులకునెల్ల.సంతోషములు నేర్పు ॥ యిందు ॥

రాజాస్యకలహంస రాజికెనడుకలు రాజసంబునజెప్పునూ । తేజంబుగా భద్రాద్రీశునిబాడూచు రాజసంబున బుష్వ లారామమున గోయు ॥యిందు॥

మధ్యమావతిరాగం.

తినతండ్రిగృహామునకు జనుదెంచుబుధులచే వనజాక్షికృష్ణు బల వరరూపగుణముల్। వినదనకు తగినట్టువిభుడనుచు మదిలోన ననుదినము తా దలచి యతివయటనుండెన్॥

శౌరిజనములచేత వారిజేక్షుణరూప శీలసద్గుణములను చెలువొ ప్పవినియున్ । సారసేక్షుణ దనకు సరియైన భార్యయని కోరిపెండ్లాడగా కోర్కెగలిగుండెన్॥

బంధుజనంబెల్ల బాలికను కృష్ణునకు పొందుగానిత్తుమని బుద్ధి నూహింపన్ । మందుడౌరుక్మివారందరినివారించి యంధుడై కృష్ణుపై నలగి చెద్యునకున్ ॥

యిందుముఖనిత్తునని యెద దలచు రుక్మిమది ముందుగా నెరిగి యా కుందరదనపురుషు । కందర్పజనకునకు సందేశమెరిగింప నందుండు విప్రు తోడనియె నిట్లనుచును॥

పుడమిసురేంద్ర బల్ చెనుగైనమాయన్న వడిచైద్యునకునివ్వ వాంఛించెనన్న । వడినేగి దెల్పుమ వ్వనరుహాక్షునితోడ తడవుసేయగరాదు తండ్రిజెప్పుడుగా ॥

అని కొన్ని వచనముల్ వనితమంతనముంగు వినజెప్ప భూసురుడు విని ద్వారవతికిని । జని ద్వారమందున్న ఫణిహారుల వలన హరిఘన కనక మందిరము గని యందుజొచ్చెను॥

యిట్లు జొచ్చి.

సీ. ఘనరత్న ఖచితమా కనకాసనంబున నాసీనుడై యున్నవారిని ప్రేమ।
గని పెళ్ళికొడుకవుగమ్మనిదీవింప చిరునవ్వు మొగమున జెన్ను మిగుల।
సింహాసనముడిగి చెలువొప్పగా మ్రొక్కి గూర్చుండనియిమించి
గువలయేశ।సురలు త న్నూజించుసొబగున బూజించి సరసపదార్థోప
పసహితమైన । అన్నంబు బెట్టించి యధిక ప్రియంబున భూసురుకడ
కేగి భాసురముగ ।

నఖల లోకావన కరంబులైన తనదు
కరములను భూసురోత్తము చరణయుగము
మెల్లమెల్లన నొత్తుచు మిగుల భక్తి
బలికె కృష్ణుండుభూసుర తిలకు తోడ ॥

రేగు ప్తిరాగం.

ధరణీసురోత్తామమిరారా । మాపురికేలవిచ్చేసినారా ; పరగ మీరలు కరుణయుక్తులు పరమధర్మాచరణులార్యులు ధరణిప్రాప్తంబైన యర్థము సరవిగొని మది మురియు చుందురు॥ ధర ॥

నిజధర్మమునను౦దు రెపుడూ।దానవృజనమందక కోర్కెలబూని। నిజము శిక్రుండైన చిక్కను నీతియును సంతసముతై కను సుజనరిక్తు డు ధనములేకను సుఖముగానిద్రించు మోదమున ॥ధర॥

సకలభూతహితులకూనూ ॥ సూరినికరాములకు ముందుగనూ ।

వికలగర్వాలకాప్త లాభప్రకర ముదిత మనోంబుజులకును సుకరశాంతా
ద్యఖిల సద్గుణ నికరులకు సేవినుతిజేసెద ॥ ధర ॥

యెవ్వానిదేశమందునికి । మీకెవ్వానిచేమేలుబలుకూ । యివ్వ
సుంధరలోన ప్రజలను యింపుగారక్షించునెవ్వడు మవ్వముగ ప్రియుడత
డునాకును మానవియ్యచరిత దెల్పుము ॥ ధర ॥

జలరాసిదుర్గాముకీవ్రా । యెట్లుజనుదెంచితివి జూడలావ్రా ।
బలుకుడీమీరలుక సేయక తలప భద్రాచలపతిని నవ్వులకుబల్కుట
గాదు భూసురతిలక కోరికతీర్తునమ్ముము ॥ ధర ॥

చ. అని యిటుశౌరిబల్కవిని యా ధరణీసురు డిట్లు బల్కె నో
వనజదళాక్ష లక్ష్మికి నివాసమునైన విదర్భదేశమం
దున ఘన కుండినాపురము తోయజనేత్ర నివాస మచ్చటన్
వినుము నృపుండు భీష్మకుడు విష్ణుపదార్చనశీలు డుండెడిన్॥

క॥ ఆ రాజుపుత్రిరుక్మిణి
మీరామయు గాగ దలచి మేలగువార్తల్
సూరినుతి దెలుపబంపెను
కూరిమితో వినుము చెలియకోర్కె దెలిపెదన్।

ద్వి. శ్రీ దేశకీపుత్ర సితపద్మనేత్ర
రాధాననాంబుజ రమ్యసన్మిత్ర
వారిదాభశరీరవార్ధిగంభీర
సూరిజనాధార సుజనమందార
నిరతంబు నా మది నీమీద జిక్కె
కరుణించవయ్య నన్గంజాయతాక్ష
కుల విద్య రూప సద్గుణ దాన శౌర్య
సలలితతారుణ్య సౌజన్యయుతుని
నిన్ను నేకన్యలు నెమ్మిగోరారు
పెన్నుడ శ్రీదేవి వేడ్కగోరాదె
నాపాల కలిగెనే నలినాక్షమరులు
శ్రీపసింహముసొమ్ము చెలగిజంబుకాము
గోరుచందంబున గోవిందమీదు

సారసనిభపాదసంసేవ్య నన్ను
గొని పోవ చైద్యుండు గోరియున్నాడు
వినవయ్య శ్రీకృష్ణ విన్నవించెదాను
దేవగురు ద్విజ తీర్థ వ్రతాదు
లీవిధము ధర్మము లేజన్మనైన
శ్రీ యధీశుని గోరి చేసితి నేని
కాయజజనక నా కాంతుడవగుదు
జయశూన్యులౌదురు చైద్యాదిఖలులు
నయముగా యుద్ధంబునను శ్రీముకుంద
పంకజనాభ నా పాలికి నెల్లి
శంక లేకను వచ్చి చతురంగములతో
అంతువచేసి మీాయదు శౌర్య మిచట
పొంకంబుగా గొనిపొమ్ము వచ్చెదాను
లోపలి సౌధంబులోనుండ నిన్ను
నేపగిదిని దైత్యు నెల్లభంగులాను
కావలివారల ఖండించి వైచి
దేవలెనని చాల దిగులొంది తేని
చెప్పెదవినవయ్య చెలగి యుపాయ
మెప్పుడు మావార లీశ్వరి కడకు
విను పెల్లికూతుళ్ళ వేడ్క బంపెదారు
నను బంపుదురు మొక్క నగజాత కటులా
నాసమయంబున నట కొచ్చి నన్ను
నాసిగా గొనిపొమ్ము వచ్చెద ననఘ
మును లెవ్వని పదాబ్జముల బుట్టుగంగ
ననుదినంబున దోగి యఘ ముక్తు లగుదు
రేరీతి గోరెద నేనయ్యమదిని
గారీశు క్రియను వో కంజాయతాక్ష
శతజన్మములకైన సారసనేత్ర
వ్రతచర్యచే నాదు వాంఛనీయందు

సతతంబు నిల్పియు చాలింతుప్రాణ
తతి నీవురాకున్న తామరసాక్ష ॥

వ. అని మరియు నిట్లనియె.

శంకరాభరణం.

జలజాక్షమీపాద మూలసేవజేయని జన్మమేలనే । విలిసిల్లుమీ మేను వేడ్కగాంచనికనుల కలి మదేలనే ॥ జల ॥

పూర్ణేందుముఖనీతో భోగింపనిదేహ పూజ్యతేలనే । వర్ణనియ్య మీ వాక్యముల్ విననట్టి కర్ణమేలనే జల ॥

పతినీయధరామృతము గ్రోలనిజిహ్వా కుతుకమేలనే । సతతంబు మీతోడ సరసములాడని చతురతేలనే ॥ జల ॥

ఘనవనమాలిక గంధమబ్బనట్టి ఘ్రాణమేలనే । వనజాక్షమీకర వనజము సోకాని యొడలదేలనే ॥ జల ॥

పురుషరత్నమనీకు పొలుపొందమొక్కని శిర మదేలనే। సరసీజేక్షణ మీరు సాక్షాత్కరించాని సరసమేలనే ॥ జల ॥

భద్రాచలరామభద్ర మీకుగాని భద్రమేలనే । అద్రిజాపతి నుతులకు దాసులుగాని ముద్రతేలనే ॥ జల ॥

గీ. ఇట్లువిప్రవర్య డింపుగారుక్మిణి
వార్త దెలిపెవృష్టి వరునితోడ
చిత్తమెటుల నటుల జేయుముశ్రీకృష్ణ
అనియు మరియు దెల్పె నతివసారు.

నవరోజురాగం.

సామిసరియుగు భామినిగన ప్రేమమీరగరమ్మా । మనవిగై కొమ్మా । కామజనక శ్రీరామసాటి దాలేమనిన్నే మది కామించు చున్నది ॥ సా ॥

కాంతనడలను దంతితలిరుల వింతపద యులకాంతి । నఖరాళికెంతో । వింతజూడ శశికాంతలెంత నినుమంతరారనుచు పంతగించు నది ॥ సా ॥

కుంభ దనటుల కంభముల్ తొడలంబుజాననకౌను । గగనంబు

నగ నౌను । కంబుకంఠి నెరు లంబుదములశిరు లంబరమునకేగంబరపి నదిరా ॥ సా ॥

వారిజాక్షినూగారుచీమలబారు కుచములతీరూ। గిరులానుగేరూ తారల మీరిన హారరుచుల జెన్నారు దరము గనగేరుగళముదిరా॥ సా॥

మోముచందురు నోమగాతగు కాముబిళ్ళనజాలూ। బొమలాసాగనూలు । కాముశరములను దూరు కుము-దముల తీరు మీనములగేరు కన్గవల ॥ సా ॥

వహావ్వభద్రాద్రీశనీసాగసాంఖ్యాయంబులువిన్నా । ముదమొంకునన్న। అహాహా చెలి మదిని తహతహాపడినీ రహా నుజూచు నీరజలోచనవిను ॥ సామి ॥

వ. ఇట్లు రుక్మిణీదేవి విలాసంబుజెప్పి మరియు నిట్లనియె.

సీ. సరసిజేక్షణనీకు సాటియాకన్నియ తామరసాక్షికి తగుదువీవు
అనఘమాయొర్పులయాన జాడ్యము లేల పెండ్లగు నిజము మీప్రియు
లగూమీరమ్మువేగమెనీవు రాజీవనేత్రిసి దెత్తువు రిపులపై హత్తిదునిమి
శుభములొందెదువని శోభనవార్తలు జెప్పగావిని వారిజేక్షణుండు

గీ. రుక్మిణీదేవి గుణశీల రూపములను
మనమునందున దలచుచు మాధవుండు
తనదుకరముల భూసుర తనయుకరము
బట్టి నవ్వుచు బల్కెను బలుముదమున.

ధరణిసురవరేంద్ర వేగ తరుణీనేలుదూ । రిపువగులాదోలుదూ॥ ధర ॥
కన్నమీదనాడుతలపుగలిగీయున్నదీ । వలపుమిగిలియున్నది ॥ ధర॥
వారిజాక్షితోడదెల్పువచ్చావనుచూ । చాలమెచ్చావనుచూ॥ ధ॥
రేయునిద్దురరాదుకన్నుదోయినిండనూ । శయ్యపయ్యాబండనూ॥ ధ ॥
ఎన్నడౌను పెండ్లియనుచు నెదురూజూతునూ।మదికుదురూ జేతునూ॥ ధ॥
మున్నెరుంగుదురుక్మిగిట్టకున్నా వాడనీ । నన్నన్నావాడనీ ॥ ధ॥
భద్రలనిలయుడంచు బాలాయెంచునూ । రాడేలానంమనూ॥ ధరణి॥

రగడ ॥ ఇట్లనికృష్ణు డిందునిభాస్యకు
పెట్టినమేలగు పెండ్లిముహూర్తము
గటిగదెలిపియు కనుదారకులో

గట్టుమురథమున గట్టిగుఱ్ఱముల
దెచ్చినహరి భూదేవోత్తములతో
మెచ్చియెక్కి రథ మేశాహంబున
వచ్చివిదర్భము వరకుండినపురి
జొచ్చినంతటను సొబగునహరియట
సుతునకువశుడై శుభుకుభీష్మకుడు
శుతుకంబునలన కూతువివాహ
వ్రతశోభనములు వనరగసల్పెను
వితతంబుగనృప వీధులురచ్చల
జేసిరిచందన సిక్తోదకములు
వాసిగజల్లిరి వాడలవీధుల
పసిమిగతోరణ పంక్తులుగట్టిరి
పసిగాజేసిరి సకలగృహంబులు
వెసకర్పూరము వీధులందునను
మిసిమిగముగ్గులు మెలతలుబెట్టిరి
అగరుసాంబ్రాణి నలరుధూపముల
నిగురుబోండ్లుతమ యిండ్లనుబెట్టిరి
మగువలు పురుషులు మహానిర్వ్యాజ్వల
మగువస్త్రంబులు నమలాంబరములు
సొగసుగగంధము సుమదామంబులు
తగదాలిచి సౌధస్థలనుండిరి
రంగుగవాద్యము రాజవీధిమ్రో
యంగ భీష్మకుడు నపుడుబ్రాహ్మణ
పుంగవులకుమృదు భోజనమిడి వా
రాంగన లందున నాడగాను బుం
న్యాంగనలచె సుత కభిషేకించి వ
దాంగరాగ వస్త్రాభరణంబులు
రంగుగగట్టియు రవికెదొడిగి మే
ల్బంగరుచేలము వడతికిగట్టియు

నగ నౌను । కంబుకంఠి నెరు లంబుదములశిరు లంబగమున కేగంబరపి నదిరా । సా ॥

వారిజాక్షినూగారుచీమలబారు కుచములతీరూ। గిరులానుగేరూ తారల మీరిన హారరుచుల జెన్నారు దరము గనగేరుగళముదిరా॥ సా॥

మోముచందురు నోమగాతగు కాముపిళ్ళనజాలూ। బొమలాసా గనూలు । కాముశరములను దూరు కుముదముల తీరు మీనములగేరు కన్గవల । సా ॥

వహవ్వభద్రాద్రీశనీసాగసాంహ్వోయంబులువిన్నా । ముదమొం మనన్న। అహహ చెలి మదిని తహతహపడినీ రహ నుజూచు నీరజలో చనవిను ॥ సామి ॥

వ. ఇట్లు రుక్మిణీదేవి విలాసంబుజెప్పి మరియు నిట్లనియె.

సీ. సరసిజేక్షణనీకు సాటియాకన్నియ తామరసాక్షికి తగుదువీవు
అనఘమాయిరువుర యాన జాడ్యము లేల పెండ్లగు నిజము మీ ప్రియు
లగూషిరమ్మువేగ మెనీవు రాజీవనేత్రిసి దెత్తువు రిపులపై హత్తిదునిమి
శుభములొందెదవని శోభనవార్త లు జెప్పగావిని వారిజేక్షణుండు

గీ. రుక్మిణీదేవి గుణశీల రూపములను
మనమునందున దలచుచు మాధవుండు
తనదుకరముల భూసుర తనయుకరము
బట్టి నవ్వుచు బల్కెను బలుముదమున.

ధరణీసురవరేంద్ర వేగ తరుణీనేలుదూ । రిపువరులాదోలుదూ॥ ధర ॥
కన్నె మీదనాదుతలపుగలిగీయున్నదీ । వలపుమిగిలియున్నది ॥ ధర॥
వారిజాక్షితోడదెల్పువచ్చ్చానుచూ । చాలమెచ్చ్చానుచూ॥ ధ॥
రేయినిద్దుర రాదుకన్నుదోయీనిండనూ । శయ్యపయ్యాబండనూ॥ ధ ॥
ఎన్నడౌను పెండ్లియనుచు నెదురూజూతునూ।మదిదుమరూ జేతునూ॥ ధ॥
మున్నెరుంగుదురుక్మిగిట్టకున్నావాడనీ । నన్నిన్నూ వాడనీ ॥ ధ॥
భద్రగిరినిలయుడంచు బాలాయెంచునూ । రాదేలానంచునూ॥ ధరణి॥

రగడ ॥ ఇట్లనికృష్ణుం డింగుసిభాస్యకు
పెట్టినమేలగు పెండ్లిముహూర్తము
గట్టిగదెలిసియు కదుదారకుతో

గట్టుమురథమన గట్టిగుర్రముల
దెచ్చినహరి భూదేవోత్తములతో
మెచ్చియెక్కిరథ మేళాహంబున
వచ్చివిదర్భము వరకుండినపురి
జొచ్చెనంతటను సొబగునహరియట
సుతునకువశుడై శుభుడుభీష్మకుడు
కుతుకంబునతన కూతువివాహ
వ్రతశోభనములు వనరగసల్పెను
వితతంబుగనృప వీధులురచ్చల
జేసిరిచందన సిక్తోదకములు
వాసిగజల్లిరి వాడలవీధుల
పసిమిగతోరణ పంక్తులుగట్టిరి
పసిగాజేసిరి సకలగృహంబులు
వెసకర్పూరము వీధులందునను
మిసిమిగముగ్గులు మెలతలుబెట్టిరి
అగరుసాంబ్రాణు నలరుధూపముల
నిగుడుబోండ్లుతమ యిండ్లనుబెట్టిరి
మగువలు పురుషులు మహానిర్వ్యాజ్యాల
మగువస్త్రంబులు నమలాంబరములు
సొగసుగగంధము సుమదామంబులు
తగదాలిచి సౌధస్తంభలనుండిరి
రంగుగవాద్యము రాజవీధిమ్రో
యంగ భీష్మకుడు నపుడుబ్రాహ్మణ
పుంగవులకుమృదు భోజనమిడి వా
రాంగన లందున నాడగాను బుం
స్త్ర్యాంగనలచె సుత కభిషేకించి వ
దాంగకాగ వస్త్రాభరణంబులు
రంగుగగట్టియు రవికెదొడిగి మే
ల్బంగరుచేలము పడతికిగట్టియు

శృంగారించియు సుదతియుండె నృప
పుంగవులప్పుడు పొంగుచునాగతు
రంగరథసుభట రాజిగూడియపు
డంగవంగ యవనాంధ్ర మాగధులు
సంగరంబు యదుసంఘముతో సే
యంగదలచి యటకపుడొచ్చిరినృప
శిశుపాలుండును చెలగిబంధులతో
బిసరుహనేత్రిని పెండ్లాడుదునని
వెసనే తెంచియు వినియుభీష్మకుడు
నశియావిడిదిని సమ్మతినుంచె ॥

వ. తదనంతరంబ.

సీ. హరియొక్కడేగినా దబ్జాక్షిగొనిరాగ చైద్యపక్షంబున సాళ్వమగధ
దంతవక్త్రాదులు తగవత్తురచ్చట సహాయులై యుద్ధంబు సంభవించు
తోడుగావలెనసి తురగరథాశ్వ చమూయుక్తుడై వచ్చె ముసలియటకు
వచ్చినహరిగని వనజాక్షుడిట్లని విచ్చేసితిరెమీకు వేడ్కగలిగ
గీ. ననియె నటరుక్మిణీదేవి యాత్మలోన
కంతుజనకుడు రాడాయె కరుణమాలి
వచ్చునోరాడో నామీద వాంఛలేదో
అనుచు చింతించిబలికె నయ్యబ్జవదన॥

మారువరాగం.

ఏమి సేయుదు దైవ మెటు సేయదలచేను సామీ రాడాయనుగా ।
ప్రేమమీరగ రేపు పెండ్లిముహూర్తాము భూమీసురుడు దాని పొసగ
దెల్పెను లేదో ॥ యేమి ॥

వత్తా నేననుచును వనజాక్షుచేశుభ వార్తైనరాదాయెనా । య
త్నాసఫలమై హరివచ్చునోరాడో మెత్తానరాజూల చిత్తామెటులనో
ను ॥ యేమి ॥

వాసిగమార్గా యానాము చేతాను భూసూరుడటుబోడుగా ।
శ్రీశుడునను తనదాసిగనై కొన డానూనొక్కో పాము జేసిరాకుండును॥ యే॥
చౌర్యామేలనని శౌరి దలంచును శౌర్యాము మదినెంచునో ।

ఆర్యాదేవినన్నాదరించియీకార్యమువనగూర్చికడతేర్పునోనన్ను ॥ యే॥

ప్రజ్ఞవంతుడైన పతిగల్గునో నాభాగ్యమెట్లున్నాదో । అజ్ఞుడౌ రుక్మిప్రతిజ్ఞజెల్లును నేడగ్నిజ్యోతనుడెందు కాలస్యమొనరించు॥ యే॥

వాసవార్చితపాదవనజుని చెవిని నా వార్తనాటగలేదా । శ్రీశుడౌ భద్రగిరీశుడునన్నేల గాసిజేసునుభక్త కామదుడౌశౌరి ॥ యేమి ॥

వ. అని మరియు నిట్లనియె.

బిలాహరి రాగం.

శౌరిమీది ప్రేమచేత సారసాక్షియా । దారిజూచుచుండుకనుల వారిధారజారగాను ॥ శౌరి ॥

పోడువిప్రవరుడటంచు పొలతియెంచునూ । రాడుశౌరియనుచు నిబిడ రాగమునునువిలపించు ॥ శౌరి ॥

యింకబోయిరమ్మ నేటిహితులు లేరనూ । శంకలేకయన్న నన్ను చైద్యవరునకిచ్చునాను ॥ శౌరి॥

గౌరిశ్వరునకు నాపైకరుణలేదనూ । భూరితపోవ్రతములన్ని పొల్లులయ్యె నహాహాయనును ॥ శౌరి॥

తల్లితోడ చెప్పకుండు తలపులేమియూ । నుల్లమందుభద్రశైల వల్లభుని నిలిపి వేడు ॥ శౌరి॥

గీ॥ యిట్లు శౌరిరాక కెదురుజూచుచునున్న
కాంత వామభుజము కన్ను నదరె
అంత శౌరిపంపునను భూసురోత్తముం
డరుగుదెంచ జూచి యతివలేచి॥

సీ. యెదురేగి ద్విజునకు నెదవందనముచేసి మేలంచు నూహించి మెలత యుండ । భూసురుం డిట్లను పొలతి శ్రీకృష్ణుండు వచ్చెను నిను చాలమెచ్చె నాకు । నిచ్చెనుధనముల నిక సురాసురులైన వచ్చిన విడువడు వనిత నిన్ను । సచ్చరితంబును సర్వవ్రతంబులుఫలియించె నన విని పద్మనేత్రి ।
బలికె భూసురవర్య నాపాలివార్త
శ్రీశుతో జెప్పి విచ్చేయ జేసినారు

ప్రబతుకగంటిని నీవంటి పరమపుణ్యు
లవనిగలరె మహాత్మ సౌహార్దమునను॥

క. ఈ యుపకారమునకు ప్రతి
సేయఁగ నేనేర విప్రశేఖర మీకై
నీ యంజలి గావించెద
మీ యంతఃకరణచేత మే లొనగూడెన్॥

అని నమస్కరించె నంత.

చ. బలుడును శౌరిగూడి ఘనపట్నము జేరినజాడ గాంచి యా
యిలపతి తూర్యఘోషములు సంపుగ మ్రోయగ దోడితెచ్చిమేల్
దెలిపియు బూజచేసి ఘన దివ్యవిభూషణరాజికానుకల్
బలునకు శౌరికిచ్చి రయిక భర్మగృహంబునడించె నయ్యెడన్॥

వ. అపు డప్పౌరకాంత లా రమాకాంతునిరాక విని వచ్చి చూచి మెచ్చి యిట్లనిరి.

గీ. తగును కృష్ణుడుమగువకు దగునుహారికి
మగువ యనుకూలదాంపత్య మమర జేసె
బ్రహ్మ నేర్పరి రిపుకోటిబల మడంచి
మగడుగావుత కృష్ణుండు మగువ కనిరి.

రేగుప్తిరాగం.

నగజాతకు మ్రొక్క నలినాక్షి। యేగెను తగుబంధువులుగొల్వగా। సొగసుగా నవరత్నఖచితపు సొమ్ములనుమైదాల్చి కనకపు బిగువయిన కంచుకముదాల్చియు పీతకౌశేయముధరించియు ॥నగ॥

శస్త్రాస్త్రములుచేత సంభ్రమమునబట్టి చటులభటులుగొల్వగా। వస్త్రభూషణమణివ్రాతముల్ ధరియించి వర పురంధ్రులుపాడగా। శిస్తులై వారాంగనాదులు చాలనుపహారములు కానుకలు వస్త్రములు పైగప్పి భాజనవ్రాతములతో ముందునడువగ ॥నగ॥

గంధపుష్పాంబర కనకభూషణములు కడు వేడుకదాల్చియూ। యిందుశేఖరునిపై యీశ్వరిపైపాట లందాముగాపాడుచూ। పొందుగా సౌవర్ణకలశములంది కరముల వేడ్క మిగులానందముగ భూసుర పురంధ్రులు కందువగ తనముందునడువగ ॥నగ॥

భేరిమృదంగాది భూరిరావంబులు భోరునజెలగంగనూ । వా
రాకసఖులంత జేరియిరుగడలాను గేరిసరసములాడగా ; కోరికనుతలి
దండ్రులున్నలు భూరిబంధువులా ప్తవరులా సారసేక్షణతోడ రాగను
సాగె మందమరాళిగతులను ॥౩౫॥

వందిమాగధసూత వైతాళికబృందమం దందనభినుతింపా । సుం
దరిభద్రాద్రిమందిరు చరణముల్ డెందముననునిల్పియూ । యిందుధర
వరసుందరీమణి మందిరంబునకేగి ధౌతకరారవిందముతోడ శుచియై
యందముగ శివముందునిల్చెను ॥౩౬॥

ద్వి॰ అంత ముత్తైదువలందరు గూడి
వింతగా శార్వాణివిడిదికిబోయి
మజ్జనంబొనరించి మంజులాభరణ
పుంజంబులను గంధ పుష్పాక్షతలను
పూజించి ధూపంబు పొసగ దీపంబు
తేజంబుగా నిచ్చి దివ్యోపహార
ములు సమర్పించియు ముఖ్యమాకాన్క
లెలమితో నప్పుడు నిచ్చి కర్పూర
నీరాజనంబిడి నివాళియొసగి
సారసాక్షిని లెస్ససతిక్రొక్కించి
రప్పుడు మదిలోన నబ్జాక్షిదలచి
గొప్పగామ్రొక్కెను కోర్కెలూరంగ
నమ్మితినమ్మ సనాతనులైన
మిమ్ము సతీశులమేటు పురాణ
దంపతులను మేలుదలఁపగదమ్మ
సంపదలీవమ్మ శార్వాణి నాకు
శౌరిని పెనిమిటిసల్పి రక్షించు
గౌరి నినునమ్మిన గలుగదుకీడు
అని పల్కి మ్రొక్కియు నటనున్న విప్ర
వనితలకిచ్చెను వరకంఠసూత్రి
తాంబూలఫల యిక్షు దండ భక్ష్యముల

అర్ధచంద్రిక - మధ్యమావతిరాగం.

అపుడు జరాసంధు డతివేగమున లేచి తత్పక్షధరాధిపుల తాజూచి బలికెన్ । గొప్పకార్యంబాయె కువలయేశ్వరులార యిపుడు మృగేంద్రముల యింపైనకీర్తుల్ ॥

నీచమృగములుగొన్న నేర్పునను బాలకిని నీచులగుగోపకులు నేడుగొనిపోవన్ । జూచెదరుశస్త్రనారాచములుగాల్పనే యూచెలినివిడిపించకిటుబోతి మేనిన్ ॥

నవ్వరేబనులంత నని వారు దెల్పుకొని క్రొవ్విపంతములాడుకొని శరాసనముల్ । మవ్వంబుగాబట్టి మిగిధిక్కరించివా రవ్వనరుహాక్షుపై రువ్విరిశరంబుల్ ॥

యాదవేంద్రులుసింహనాదములు చెలగంగ కోదండముల నెక్కుగొనియుండిరంతన్ । శ్రీదైతుజాచుచును సిగ్గుచేరుక్మిణియు నాదనుజవైరిగని యపుడుడగ్గరియోన్ ॥

అదిజూచికృష్ణుండు ముదితతోనిట్లనియె కొదువేమి యీరాజకోటిదూలింతున్ । మదిభీతిజెందకుము మానినీమణియంచు నదురుదీరిచెనంత నబ్జనాభుండున్ ॥

అంతబలరాముండు లారాజవర్గమును కుంతతోమరప్రాసక్షురికఖడ్గములా । కొంతజంపియుధనుః కోటిగూల్చియుబాణ సంతతులనేయంగ జచ్చెనొకకొంతన్ ॥

కూలెనురథావళులు కుంజరంబులురాలె సోలెహయములుచాల నుడిబడియెసేనా । కీలాలమయమయ్యె కేళిసల్పెనుభూత జాలంబు భూపతుల చలముడిగిపోయెన్ ॥

మగుడిపారియు దుఃఖ మగ్నులై మగధాది జగదీశులందరును చైద్యుతోననిరీ । వగవారిచేతులో బడకప్రాణముతోడ తగబ్రతికియుంటివిల ధన్యుడవునీవూ ॥

తనువులో ప్రాణములు దగగలిగియుండినను వనితలేకొదువ యివ్వనుధతోసీకున్ । వినవయ్యవగవగా జనదుదైవాధీన మనిదలంచుము నేను మధురాపురమునన్ ।

పదియేడువరుసలను బలముతోనేగిబలు పరిభవంబుల నొంది

పదునెనిమిదింటన్। యెదురించి శ్రీకృష్ణు నిటుపలాయితు జేసి ముదమొం దితినివినుము విదితంబుగానూ ॥

జయపరాజయములును జంతువుల కత్యంత నయశోకములనిచ్చు నవిదైవ వశముల్ । అయినజింతిలనేల నబ్జాతు బలముచే జయము నొందిరివారు శంకించనేలా ॥

మనకెపుడుసమయంబు మంచిదై యే తెంచు ఘనముగాశత్రు వుల ఖండింతమపుడూ । అనిజరాసంధుండు నతనిసరిరాజులును జనిరి శిశుపాలుండు సదనమునకరిగెన్ ॥

వ. తదనంతరంబ రుక్మియనువాడు హరి తన చెలియలిం గొని పోవుట సహింపక నేకాక్షౌహిణీబలంబుతో సమరసన్నద్ధుండై కృష్ణు వెంటబడి యరుగుచు తన సారధితో నిట్లనియె.

బిలాహరిరాగం.

గొల్లడెవ్వడోనా చెల్లెలినిప్పుడూ । బల్లిదుడై గొని బారుత ప్పాడు । మెల్లగాబోనీకురధమిపు డల్ల వాడా పిల్లవాడే॥ గొ ॥

దొరకకుండగనాకు నురుకుచున్నాడూ।సరకుసేయకబట్టి సరిగాను పీడూ । దొరకొడుకునగు నన్ను పీడా దొంగజాడల గెల్చువాడా॥గొ॥

కదనమందునవీని ఘనశరములనూ । వదలజేయుదువీని మదము లీలానూ।చెదరకనునాయెదుటనిలచినచెండెదను మేన్కండలన్నియు॥గొ॥

చిన్నబుచ్చెను నన్ను చెల్లెలిగొనీ।మన్నించకిప్పుడు మాయింతు వీనీ । పన్నుగానిన్నరథతులలో నెన్నికొ నావన్నెకైనా ॥ గొ ॥

శిశుపాలాదులు వీనీ చెంతజేరారు । పసిబాలుడనిమది భావించి భీరూ । యశముజెడు నికవసుధలోపల విసికిచెల్లెలి విడిచితీ నా । గొ ॥

ధరభద్రగిరివర ధాముడననీ । యురుశంఖచక్రముల్ ధరియించుకొనీ। మరచెకంసునిజంపితనియెదు మదమునను యీరాజకోటిని॥ గొ ॥

గీ. ఇట్లు రుక్మియు హరిశౌర్య మెరుగకపుడు
రథముగూడగదోలించి రభసమునను
పాలు వెన్నలు దొంగిలి బ్రతుకు గొల్ల
నిలువునా ద్రోల నిముసంబు బలమటంతు.

ద్వి. అనియిట్లుబలికియు నతనిమూఁడమ్ము
లనువేసి మఱిబల్కె నబ్జాక్షుతోడ
మాసరివాఁడవా మాపాపగోనగ
నేపాటిగలవాఁడ వెందుజన్మించి
యెక్కడఁ బెరిగితి వేదినీనడుక
నిక్కంబుగాధర నెఱుగ రెవ్వారు
మానంబులేదింత మర్యాదలేదు
పూనిమాయలచేత పొసఁగవర్తింతు
నజసమానుఁడవునీ వప్రమేయుఁడాయు
నిజరూపమునశత్రు నివహంబుపైకి
జనవు వావియులేదు జగధీశుఁడావు
వినుగావు ధర గుణవిరహితుఁడావు
గాన చెల్లెలినిమ్ము గాకున్న నిన్ను
పూనిశరాగ్నికిఁ బూర్ణాహుతిదును
గర్వమెల్లనుగొందు కలహంబునందు
సర్వరాజన్యులు సంతసింపంగ
ననిపల్కవినిహరి యతనిమొక్కబాణ
మును శరాసనమును ముందుగాదునిమి
యూరుశిరంబులు నతనిపైనాటి
ధీరతనెనిమిది దివ్యాశుగముల
గూల్చివాజులరెంట గృచ్చిసారథిని
వ్రాల్చి కేతనమొక్క వాలమ్మునాను
ధనువువేరొకటెత్త దానిఖండించి
వెనుక నింకొకటెత్త విఫలించదాని
పరిఘు పట్టిస శూల ప్రాసాసి శక్తి
వరతోమరములను పట్టిన నవియు
దునుమాడెనపుడేమి దోఁచక రుక్మి
ఘనఖడ్గహస్తుఁడై కాంచనరథము
డిగి దవానలముపై దిగివచ్చుమిడుత

నగిదినిరాజాచి పద్మాక్షుడపుడు
కడుఖడ్గకవచముల్ ఖండించివైచి
వడివేడుచూపుల వైరిపీక్షించి
యడిదంబుజేకితా నతనిఝడిపించి
కడువానిశిరమును ఖండింపబోవ
వై దర్భిహరిపాద వనజముల్ బట్టి
మోదంబుజెడిబల్కె మురహాకునితోడ.

కేదారగౌళరాగం.

దేవదేవుడవాని దెలియకజేసెమిా బావానుదయజూడుడీ। కావరంబున నీమహాత్య్మము గానకీతడు పగదలంచెను గావదగునోయమరవందిత కరుణసింధో దీనబంధో ॥ దేవ ॥

నామానవాలించి నన్నుమన్ననజేసి సామిాయీతనితప్పు క్షమియించకున్నాను। ప్రేమచేతను గోరివచ్చిన భామినీ సోదరుని జంపెను యేమిధర్మపరుండుహరియని భూమిలోనపకీర్తివచ్చును ॥ దేవ ॥

కల్లలేదనుటాయు గాదువల్లభయీ బల్లిముదెగజూడ భాగ్యవంతులమైతి। మల్లుడయ్యేముకుందుడీశ్వరు డంచుముదమున నొందుచుండెడి తల్లిదండ్రులుపుత్రశోకము దాల్చిచిక్కరె మదిని మిక్కిలి ॥ దేవ ॥

గొప్పవాడైనట్టి గోవిందుడుబంధు డిప్పుడాయనటంచు ముప్పిరిగొనుప్రేమ। నెప్పుడునుమావారలుందురు యేలుమిాబంధువులనందరి గొప్పదొరలెప్పుడునుబంధులు తప్పజేసిన గాతురిలపై ॥ దేవ॥

అఖిలేశుడవీ వానందమూర్తివి నిఖిలసాక్షివి నీవు నీరంజనూడావు। జగతిపైసజ్జనులగావగ చదుగులనుశిక్షింప దలచియు నగజపతినుత భద్రగిరిలో నవతరించితివెవ్వరెరుగరు ॥ దేవ ॥

సీ. అనియిట్లురుక్మిణి యాకంపితాంగియై గద్గదకంఠియై కనులజలము
లొలుకగానుతియించి యలుకనుహరిపాద వనజముల్ విడువక వనితయున్న। గనిశౌరి యప్పుడు కరుణించిచంపక బావ రమ్మనిపిల్చి
పకపకనగి। గట్టిగాబంధించి గడ్డంబు మిాసంబు తలయు రేవులుబార తానెగొరిగి।

గీ. రూపహీనునిసేసెను గోపసైన్య
మతనిసైన్యంబుదోలియు నటకువచ్చి
కట్టుబడియున్న రుక్మిని గాంచిహాలియు
విడిచి మన్నించి బలికెను విష్ణుతోడ.

యదుకులకాంభోజి.

తగదు తగదు జలజాక్షా । యీపగిదిజేతురె తనబావనెందైనా ॥ త ॥
మామభీష్మకునైనజూచి । యితనిమన్నించవైతివి మర్యాదనెంచీ ॥ త ॥
బంధువునిటు సేయతగునా । యేచందానదోచెనుసరసమిదేనా॥ త॥
శిరముమీసముగొరుగుకంటె।పట్టితలద్రుంచుట మేమంచితపొనర్చితె॥త॥
హితు లహితులు లేరునీకూ।యీమతియెట్లు దోచెనోమహానియ్యు నాకూ॥
వరభద్రగిరిధాముడావూ । వీనిపరమాపు డనిమదిభావించికావూ॥ త॥

వ. అని యిట్లు గోవిందుని నిందించి తనయదుటనున్న రుక్మిణీ దేవింగని బలరాముం డిట్లనియె.

శుద్ధకాంభోజిరాగం.

ఇంతిరో మాకృష్ణు నెగ్గింపకమ్మా । పంతమున మీయన్న బట్టిట్లుజేసెనను చింతచేపతిని యేకాంతింబునందైన ॥ ఇంతి ॥

పంతమాడుచువచ్చి పైకొన్న మీయన్ననింత కార్యము జేసెనూ। కాంతయీతనిపూర్వ కర్మమింతయొనర్చె దంతివరదునీదూర దగదిందు వదనా ॥ యింతి ॥

శిక్షింప దగుతప్పు జేసినను తమవారి శిక్షింపదగదుధరనూ । వీక్షించిమది నుపేక్షించకటుగానిశిక్షింప దోషంబుచేకూరుతనకూ॥ఇం॥

ధాతయీభూమిలో ధరణీశులందరికి దగనికర్మవిధించెనూ । భూతలాకాంక్షకై పోరిలోజంపుదురు తాతనైనను లేక తమ్ములన్ననైన॥ఇ॥

భూరాజ్యధనములకు సారసాక్షులకొరకు భూరిప్రాభవములకును । దూరిశత్రులటంచు కోరి మిత్రులటంచు సారెదలతుగు మీది దారెరుంగకనూ ॥యింతి॥

సరసిజాసన శంభుసన్నుతుని శ్రీధవుని వరదు భద్రాద్రీశునీ । పరమాత్ముడనిమదిని భావించివిడువుమీ సరసిజేక్షణ మోదసంతాపములనూ ॥యింతి॥

సీ. అనియిట్లుబలరాము డతివతో బల్కి నచింత లే కప్పుడచ్చోలియయుండె
రుక్మి ప్రాణముతోడ రూపహీనత జెంది పురికేగగా మదిబుట్ట కపుడు
కృష్ణు గెల్చినగాని కుండినపురికేగ నని ప్రతిజ్ఞయొనర్చి నగరిచెంత
నుపవనంబుననుండె నుర్వీశయిటు హరి రాజీవనేత్రుండు రాజవరుల
గెలిచి రుక్మిణిగొని యిరుకెలకులందు
బలుడు మొదలైనసైన్యంబు బలసికొలువ
పద్మనాభుండు ద్వారకాపట్నమునకు
రాజముఖిగూడి విచ్చేసె రాజసమున॥

వ. అప్పు డప్పురవరంబున సమారబ్ధవివాహకృత్యంబై ప్రవర్ధమాన గీతి వాద్య నృత్తంబై ప్రతి గృహాలంకృత విలసితాశేషనరనారీవర్గంబై రుక్మిణీకృష్ణపరిణయసమాహూత మహిపాల గజ ఘట గండమండల నిర్గతసలిలధారాసిక్త రాజమార్గంబై ప్రతి ద్వారమంగళాచారసంఘటితక్రముకకదళికా స్తంభ కర్పూర ధూప దీపపరిపూర్ణకుంభంబై సముద్భూత కేతన విరాజితంబై యొప్పె నప్పుడూ॥

సీ. అంతరుక్మిణిగూడియచ్యుతుండొచ్చుటవిని యుగ్రసేనుండు వేడ్కతోడ
సకలవిద్వజ్జనసామంతరాజన్య సూత గాయకభటవ్రాతములతో
జనివారలకు మ్రొక్కి సంతోషమును జెందియాశీర్వదించియునఖిలరాజ
నివహంబుగొలువగా నీరజనాభునిగొనివచ్చి శుభమైన గృహమునందు।
విడియ జేసియు వర వేదవిదులునైన
భూసురులబిల్వబంచియు పొందుగాను
మంచి లగ్నంబు బెట్టించి మంజులముగ
పెళ్ళిపనులను జేయించె ప్రియముమీర॥

క. హరిపెల్లియాడె రుక్మిణి
నరవిందసమానవదన నళి నిభ చికుర౯
వర కుందరదన నాశ్రిత
సురభూరుహ నఖిల లోక సుందరి నపుడు౯.

కల్యాణిరాగం.

వైదర్భికల్యాణము । రాజవినుపరజన్మసాఫల్యము । మోదముతో సర్వయాదావులును సద్భూదేవోత్తములాను పుణ్యాసతులుగూడి

యాదిదేవుని కతివరుక్మిణి కాదరతసం పెంగ తైలముతో దలంటియు నల్గి డియు వరతోయముల జలకంబులార్చిరి ॥వైదర్భి॥

కనకాంబరము గట్టియూ । కాంతకు రత్నకంచుకాము దొడగి యూ । ఘనసారజవ్వాజి కస్తూరీమిళితమౌగంధము మేనున కడు వేడ్క నలదియు॥ ఘనమైన నవరత్న కీలిత కనకభూషణముల ధరించియు కనుల కాటుక బెట్టి మొగమున ననువుగాతిలకంబుదిద్దిరి ॥వైద॥

హరికిబంగరుచేలమూ । కటియందున మురిపెంబుగాగట్టియూ। వరకిరీటము బెట్టి వజ్రాలహారము ఉరమున ధరియించి యురుకుండలము లుశ్రీ। వరునికర్ణములందు బెట్టియు వజ్రమణు లంగియుదొడంగియు క రములం దుంగరముఉంచియు కనక కేయూరములు బెట్టిరి ॥ వైద ॥

యిరువురొకనొకతీరునా । భూషించియు పురహితుడగుగర్గుడూ। ధరణిసురలగూడి తామరసాక్షుని సరసిజనేత్రిని స్వర్ణపీఠమునందు । సరసగా గూర్చుండబెట్టియు కరములను ప్రతిసరములుంచియు మురువుగా భాషికముగట్టియు వరగపుణ్యాహంబు జదివెను । వైద ॥

ఘనముగా వనజాక్షుడూ । రుక్మిణిపాణి గ్రహణంబుగావించెనూ। వనితకంఠమునందు వరమంగళసూత్ర మునుగట్టికరమున ముద మొంద జనులంత । మనమలరకృష్ణుండురుక్మిణి మంజులంబుగ ముత్తియంబుల వనరదాలిచి కరపుటంబుల వరసగాశిరముల ధరించిరి ॥ వైద ॥

బరగరుక్మిణిదోసిటా । ముత్యములాలు పద్మరాగములాయను । హరిశిరమునబడి నవియె కుందములాయ వరనీలతనుసోకి వజ్రనీలములా యె । వరునిపీతాంబరముననుబడి యొప్పెనవి పుష్యరాగంబుల కరణి పాదనఖంబులంబడి ఘనమైనవజ్రములబోలెను ॥ వైద ॥

ముదము నొందుచునప్పుడూ। కృష్ణుడు సప్తపదములుద్రొక్కె నూ । మధుసూదనుండును మది రాక్షిరుక్మిణి ముదమూనవశిష్ఠ మునిక రుంధతికిని । విదితముగ ద్రొక్కియునుశౌరియు ముదిత కీల్గన కీలబట్టిన మదవతీమణిసిగ్గుచేతను వదనమెత్తకవరునితోజనె ॥ వైద ॥

చక్కగనిద్దరునూ । వసుదేవునకు సతియైనదేవకికీ । గ్రక్కున ద్రొక్కియు నొక్కపీఠమునందు మక్కువనుండగ మహానియ్యులగు విప్రు । లొక్కసరియాశీర్వదించిరి నిక్కముగ ముత్తైదులందరు మక్కువ

తో మంగళారతులిడి రెక్కువగు ముదముల జెలంగుచు ॥ వైద ॥
వందిమాగధజనములూ । భద్రాద్రీశు నందందబాగడగానూ । అందాముగావా రాంగనలాడగ ముందరభేరీమురజకాహాళములు। పొందుగావాయింపుచుండగ నింది రేశునిభక్తులందరు డెందములముద మొందిజయగో వింద యని నుతియించిమ్రొక్కిరి ॥ వైదర్భి ॥

వ॥ ఆసమయంబున.

సీ॥ రాజేంద్రులును బంధురాజదంపతులకు కట్నంబులిచ్చిరి కడుముద మున । హరియు భూసురులకు ధరణీపతులకును వరస్వర్ణభూషణ వస్త్రమాల్య । గంధ తాంబూలముల్ కడువేడ్కనిచ్చియు సద నంబులకునంపె సవినయముగ । నవనిశ్రీలక్ష్మియైన రుక్మిణి తోడ ద్వారకాపురమందు శౌరిసకల.
సంపదల ననుభవించుచు సౌఖ్యముగను
బంధుజనములు మిత్రులు పౌరజనులు
గొలువ బలరాముతోడుత కోర్కెమీర
రాజసంబుననుండెను రాజవర్యా॥

శ్రీమదనగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః.
శ్రీరామచంద్రాయనమః.

రేగుప్తిరాగం.

యిందుకులసుధాబ్ధి పూర్ణిమచంద్ర కీర్తిసాంద్రా । యింది రాకళత్రా । వరశుభకర నందగోపపుత్రా । పురారి పురందరాది మునిబృందంబులచే వందితుండవై పొందుగ యదుకులమందు నుదయ మొంది । జననియు రోలందు గట్టగుంది । దానిని నీ వందములర ముందుగాను తరువుల సందు బెట్టి పొందుమీరగూల్చితిరట ॥ యిందు ॥
వారీ । మునిజనమనమోహనకారీ । సేవకభయకలుష విదారీ। ఘనతర గోవర్ధనధారీ । వరాంబరధారి యమునలో జేరుక్రూరునటు బారదోలుటకు ధీరుడవైదగి । వారిలోనదూరి । కాళియు పటుసార ముడుపగోరి । పడగలపై భూరితాండవంబు । శేషుభార్యలు మొరజేర వారికోరికలను దీర్చితిరట ॥ యిందు ॥

రాజా । ఖరకరశతనిభ తేజా । పాలిత సన్మానిబిడౌజా । ఆశ్రితసురకల్పకభూజా । నిజరిపుడగుభోజకులజు పటు తేజ మణంచగ రాజమార్గమునరాగా కుబ్జయు, రాజవనుచునిన్ను । రతిగోరినరాజవదన చెన్నా । గనుగొని నీ । రాజసంబుమాని దానికుబ్జత నోజమానగాను జేసి పొందితివిరట ॥ యింద ॥

యెంచీ భీష్మకసుత ప్రార్థించీ । గనబంపించిన భూసురుగాంచీ । బహుమన్నించి మిగులబూజించీ । సురాదులు నెంచగ నటకే తెంచి రాజులను వంచన జేసియు నంచయానగొని । కొంచెముసాగా । తదనుజుండెంచుచు రాగా । కసిరుక్మిని కొంచగించివిడిచి నడిచి ద్వారక మంచిలగ్న మెంచి పెండ్లియాడితిరట ॥ యింద ॥

యెన్నా । శ్రీభద్రగిరిన్నలకొన్నా । రఘుపతిశ్రీకృష్ణుల కెన్నా । యితరులమది భేదములున్నా । గనభేదంబున్నద మరియీకన్న నన్యులను సన్నుతింపనని యున్నది నామది । చిన్నతనముగొన్నా । బుధులందరు నిన్ను గొలువరన్నా । ధరదొరలని మిన్నజూడ కృష్ణదాసు ప్రోవక యున్న నిన్ను నెన్ను నెన్ని విధముల ॥ యిందుకుల ॥

కాంభోజిరాగం.

ఉపచారములు జేతునూ । ఉపచారములు జేతు నుదయాస్తమయములం దురగేంద్రశయనమీకూ । కృపతోడ గైకొమ్ము గోపాలశ్రీకృష్ణ సపరివారముతోడ సామాన్యమనకా ॥ ఉప ॥

ధ్యానంబు జేతు మునిమానసాబ్జనివాస భానుకోటిప్రకాశా । శూనాస్త్రశతకోటి సుందరాకార రాధాననాంబుజమిత్ర ధర చక్రహస్తా ॥ ఉప ॥

కనకాననంబునను కల్పాగమూలమున కాంతరుక్మిణిదేవితో । ఘనముగా వేంచేయు కైవల్యధామనా మనమలరబూజింతు మాటిమాటికి మ్రొక్కి ॥ ఉప ॥

గంగాదినదులందు గలతీర్థములు దెచ్చి కడు పాద్యమిత్తు మీకూ । రంగుగా నర్ఘ్యంబు బంగారు గిన్నెలతో శృంగారముగనిత్తు శోభనాకారా ॥ ఉప ॥

కర్పూరవాసనల గమగమను తోయంబు నేర్పునాచమనంబు
మీ। కర్పింతుయదువంశ కలశాబ్ధిహిమధామ సర్వరాట్పాయసేంద్ర
సన్నుతపాదాబ్జా ॥ ఉప ॥

సకలతీర్థానీత సన్మంత్రపూతమౌ సలిలంబుచేస్నానమూ। అక
లంకముగనీకు నర్పింతుపాదాబ్జ మకరందనిభలసన్మందాకినీధునీ ॥ ఉప॥

కనకకౌశేయంబు కటియందుఁగట్టెదను కరిరాజవరదమీకూ।
ఘనయజ్ఞసూత్రంబు కరమొప్ప నిచ్చెదను వినతాత్మజ తురంగ వినతా
తిఁభంగా ॥ ఉప ॥

ఘనసార జవ్వాజి కస్తూరిమిళితమౌ గంధమలదుదు మేనునా।
వనజాక్ష కేయూర వరకుండలకిరీట వజ్రభూషణమణి వ్రాతమర్పింతు॥ఉ॥

జాజి మల్లికవకుళ శతపత్రపున్నాగ సంపెంగబిల్వాదులా। పూ
జింతుశ్రీకృష్ణ పురుషోత్తమముకుంద రాజీవనయనయని రమ్యంబుగా
నూ ॥ ఉప ॥

అగరుసాంబ్రాణిచే తగధూపమిచ్చెదను నిగమాంతవేద్యానీ
కూ। సొగసైనదీపంబు శుభముగానిచ్చెదను జగదంధకారహార జల
జాక్షమీకూ ॥ ఉప ॥

భక్ష్యపాయసలేహ్య పరమాన్నశాకముల్ బంగారుగిన్నియల
తో। తార్క్ష్యవాహనమీకు దధ్యాజ్యయుక్తముగ తగనివేదించెదను
తామరస నయనా ॥ ఉప ॥

నాగవల్లీదళ నవ్యకర్పూరను పూగమౌక్తికచూర్ణముల్। బాగు
మీరఁగ గూర్చి వాగీశనుత మీకు భవ్య తాంబూలంబు బాగాలతో
నిత్తు ॥ ఉప ॥

నీటుగా కర్పూర నీరాజనము జేతు నిఖిలరాజేంద్రమకుటా। పట
ఘటితభానుమణిశ్యామనీరాజిత పటుతరారుణమృదు పదకంజమీకూ॥

మంత్రపుష్పంబిడుదు మార్తాండమండల మధ్యసంచారమీకూ।
యింద్రాబ్జజాతహర యినవహ్నియమవాయు చంద్రరూపు నమోస్తు
జయమస్తుమీకూ ॥ ఉప ॥

ధరణిఁగోమీదాస దాసకృష్ణాఖ్యుడను తప్పులెంచకబ్రోవుమీ।

వరదభద్రాద్రీశ వనజాక్షుశ్రీకృష్ణ వాక్కాయకర్మముల వదలక భినుతి జేతు ॥ ఉపచార ॥

సురటరాగం.

మంగళంశ్రీయదు పుంగవ భక్తాంతరంగొల్లసత్పద్మ భృంగాంగ నా।అంగాజకోటి శృంగారాంగ సారంగ వరద విహంగతురంగ॥మం॥

ధాత సన్నుతింప భూతలంబునయదు వ్రాతములోబుట్టి ఖ్యాతి మీరా । పూతనజంపి నిర్భీతిబండనిగూల్చి వాతరక్కసుప్రాణ ఘాత జేసినకృష్ణ ॥ మం ॥

వన్నెమీరగోప కన్నియలిండ్లలో వెన్నమీగడపాలన్ని దాగీ । కన్నియలందరు వెన్నదొంగవని వెన్నుదగిలిన కొమగనిచిన్నసల్పిన కృష్ణ ॥ మం ॥

మన్నుదిన్నావని యన్నదెలుపతల్లి నిన్నుకోపింపనే నెరుగాననీ। తిన్నగవదనము దెరచిమీయమ్మకు చెన్నుమీరజగము లన్నిజూపిన కృష్ణ ॥ మం ॥

గోపకన్నియలంత రేపాకడను యమున దాపూనకేతెంచి దరులందునా । దాసచేలములని, చేపట్టిన మొక్క పాపాలశిగ్గులు బాపిన శ్రీకృష్ణ ॥ మం ॥

కాళియు ఫణమూల కడుపేద్ద తాండవ కేళిసల్పినగము కేలనెత్తి । మేలుగనాయదు బాలికలతోరాచ లీలజేసిమరు కేళిసల్పిన కృష్ణ ॥ మం ॥

వైరాముచేమామ కోరిపిలువనంప ధీరతతోమధుర జేరియందు। ఘోరమల్లరంగ ధారుణిలోకంసు బీరామణంచిన వీరాగ్రగణ్యా॥ మం॥

యొంచిరుక్మిణినివ్వరించి భూసురునిబం పించిన నటకేతెంచినీవూ। వంచించిరాజాలనంచయానగొని మంచిలగ్నమునవరించినశ్రీకృష్ణ॥మం॥

శ్రీశద్వారకపురి వాసుడవై రుక్మిణీసత్యభామాది నెలతాలతో। వాసీగశ్రీకృష్ణ దాసమనోంబుజ వాసాముజేసిన వరదమాధవకృష్ణ ॥ మంగళం ॥

రాగం.

కృష్ణంకృష్ణంకృష్ణంకృష్ణంకృష్ణంరాధాకృష్ణంకృష్ణంకృష్ణంకృష్ణం।
కృష్ణంవ్రజవర్ధిష్ణుంవంచిత జిష్ణుంపాలిత కృష్ణం విష్ణుం ॥ కృ ॥
బాలంరాధాలోలంసద్గుణ జాలంశ్రితపరిపాలనశీలం ॥ కృ ॥
ధీరంనవనీతచోరం వనధిగభీరం జగదాధారంశూరం ॥ కృ ॥
మందరధరమరవిందనయన మానందకందమరవిందజజనకం॥కృ॥
కంసాద్యఖిలనృశంసధరాధిపహింసాత్తాంగంహితదుస్సంగం॥కృ॥
రామంసంగర భీమంయదుకుల సోమం యోగిలలామసుకామం॥
శ్రీశంనుతగౌరీశం భద్రాద్రీశం శ్రితకృష్ణదాస సుపోషం॥ కృ॥

ఉ. శ్రీకరసారసాప్తకుల సింధుసుధాకర వైరిపద్మదో
షాకర భూమిజాహృదయ సారసబాలదివాకరామరా
నీక శుభాకరప్రథిత నీర తుషార పటీరదుగ్ధర
త్నాకర సద్యశఃప్రకర ధారుణిజావర రామభూవరా.

గద్య—ఇది శ్రీరామచంద్ర చరణారవింద నిష్యంద మకరంద బిం
దుసందోహ పాద మత్త మధుకరాయమానమానస పవనా
త్మజ కృపాలబ్ధ కవితామాధురీధురీణ శారదావరప్రసాద
సమాసాదిత మనీషాప్రాభవ కాశ్యపసగోత్ర పవిత్ర
వీరరాఘవార్యపుత్ర సకలవిద్వజ్జన కృపాపాత్ర శ్రీ
బోడెం కృష్ణదాస ప్రణీతంబైన శ్రీమహాభాగవ
తాంతర్గత దశమస్కంధసంబంధ నందనందన
చరిత్రంబను యక్షగాన ప్రబంధంబు
నందు రుక్మిణీకల్యాణము
చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

శ్రీ రుక్మిణీసత్యభామాసహిత శ్రీమదనగోపాల కృష్ణార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ